# ప్రకరణ పట్టిక

....o○o....

# GLOSSARY

| | | |
|---|---|---|
| 1. | వాతావరణాభ్యాసము | Acclimitization |
| 2. | హిమశైల పతనము<br>గండశైలము | Avalanche |
| 3. | హిమవృష్టి | Blizzard<br>Snowfall<br>Snow storm |
| 4. | హిమహతము<br>మంచుకొఱుకు | Frost bite |
| 5. | హిమవాహిని<br>హిమానీ నది | Glacier |
| 6. | హిమనిపాతము | Ice fall |
| 7. | మంచుదారములు | Icicles |
| 8. | లోట్సె | Lhotse |
| 9. | నూప్సె | Nuptse |
| 10. | ప్రపాతము | Precipice |
| 11. | నీహార నేత్రావరోధనము | Snow blindness |

## ఈ గ్రంథమున కాధారములు

1

## The Ascent of Everest

BY

**JOHN HUNT**

**(Brigadier Sir John Hunt, C.B.E., D.S.O.)**

2

## The Tensing Story

**Articles I, II, III, IV**

BY

**GEOFFREY MURRAY**

రాజమండ్రి సరస్వతీ పవర్ ప్రెస్సు నందు ముద్రితము

# ఎవరెస్ట్ శిఖరారోహణము

## 1

## ఆశయము

కోటానకోట్ల సంవత్సరముల మాట !

విచిత్ర పరిణామముల నీ భూగోళము తన రూపును దానె చక్క దిద్దుకొనుచున్నది. విశాల సాగర భూభాగము లన్నియుఁ ద్వరిత గతిని మార్పులు సెందుచున్నవి. జంబూద్వీప పరిసర విశాల సాగర తరంగ డోలికలపై సూర్యకాంతులు సోకి యుత్సాహాత లూఁగుచు వన్నె చిన్నెలు మీఱ నర్తన మాడుచు సముద్ర సుందర నీలాంబరమునకు వెండిచాయలఁ దీర్చుచున్నవి. భాను కిరణ స్పర్శచే మైపులకలు సోక సంతోషమున నుప్పొంగి మహోన్నత స్వీయ తరంగ కరంబుల మిన్ను ముట్టుటకు నుద్యుక్తుఁ డగుచున్నాఁ డా సముద్రుఁడు.! ప్రకృతి నిశ్చల గంభీర ముద్రఁ దాల్చి తన నిండుతనమును బ్రకటించుచున్నది. అనంత సాగర గానము సామగానమువలెఁ గర్ణరసాయనముగ నుండెను. ఇట్టి ప్రశాంత వాతావరణముఁ జీల్చికొని భూమ్యాకాశ ములఁ బ్రద్దలుసేయు ఫెళఫెళారావ పరంపరలు హఠాత్తుగ వినవచ్చినవి. మహాజలధి యల్లకల్లోలమై ప్రళయ రుద్రుని రూపముఁ దాల్చినది. భూదేవి మదోన్మాదినివలె నావేశముతో రేగి రేగి హృదయముఁ జీల్చి కొన్నది. ఉత్తుంగ తరంగంబు లాకసంబున కెగసి యెగసి, విఱిగి నేలఁ బడి యొడ్డును దాకి తుత్తునియలై శరధిగర్భము లోనికిఁ దిరోగమించు చున్నవి. క్షార సాగర జలములనే క్రోలుచున్న దే ! సాగర గర్భము లోనికిఁ దిరోగమించు శిథిల తరంగములు నుఱ్ఱు విఱిగి విఱిగి, నుఱుఁ

గులు దేలి భూదేవి గళమునఁ బడి దొరలి పో సాగినవి. అహో! యీ భూదేవి యక్షయ పిపాస! ఇట్లు శీఘ్రకాలముననే యీ యంబుధి క్రుంకి యడుగంటెను. అనంత క్షారజలప్లావితమైన ప్రదేశ మిపుడు విశాలమగు మైదాన మైనది. అతిశీఘ్రకాలములో నీ మైదాన మెల్లెడల నానాజాతి వృక్షలతాదుల కాలవాలమై, రానురాను సాంద్రారణ్యమై, యసంఖ్యాక వన్య మృగ పశు పక్ష్యాదుల కావాసమై పరగినది. విశాల తరుచ్ఛాయలం దల్లిబిల్లిగఁ దిఱుగుచు, నల్లనల్లన మృదు రవముల జలజలఁ బాఱెడు సెలయేళ్ళీయరణ్యముల కొక వినూత్న శోభ గూర్చుచున్నవి. ఇట్లపరిమిత జీవరాసు లాప్రాంతములలో స్వైరవిహారములు సల్పుచుంట మఱల మహోపద్రవము లుత్పన్న మయ్యెను.

భూదేవి నిష్క్రియత్వమున విసిగి వేసారినది కాబోలు! మఱల మహోద్ధృతముగ విజృంభించినది. ఆమె శరీర మత్యంతముగఁ గంపముఁ జెందెను. భూమ్యుపరిభాగము దీవ్రముగఁ జలించి, చీలి, మిట్టపల్లములఁ దలక్రిం దయి, మహాపర్వతారణ్యాదులు ధరణిగర్భములోనికి దిగజాఱి, వేలకొలంది జీవరాసు లసువులఁబాయ, సముద్రము లింకి, భూధరములు మింటికెగసి మహాసంక్షోభ మేర్పడెను. ఇతఃపూర్వము గలకలలాడు మైదాన మదృశ్యమై, యీ ప్రదేశమున మహోన్నత పర్వతములు వెలసెను. ఇటులే యెన్నెని విచిత్ర పరిణామము లప్పుడప్పు డేర్పడుటచే సముద్రములలోఁ బర్వతములు పుట్టుటయుఁ గొండలు సముద్రమున మునిఁగిపోవుటయు, సంభవించుచుండును. భూకంపముల విజృంభణ హెచ్చుకొలఁది నీపరిణామములు విచిత్రరూపములఁ దాల్చుచుండును. భూకంప పరంపరలచే నా మహాపర్వతములు పైకెగసి యత్యున్నతములై వందలాది శిఖరములుగా

రూపొందినవి. ఈ యనన్య మహోన్నత పర్వతములు సర్వదా హిమాచ్ఛాదితములై హిమనిధానము లగుటచే హిమాలయములను సార్థకనామముఁ గాంచెను.

భరతఖండమున కుత్తర దిశగా నీ భూగర్భజనిత పరిణామ విశేష ఫలితములైన హిమాలయశ్రేణులు దాదాపు పదునైదు వందల మైళ్ళపొడవున వ్యాపించి యున్నవి. ఇరువదివేల యడుగుల యౌన్నత్యముగల శిఖరము లీ పర్వత పంక్తిని సుమారు పదునొకండు వందలు గలవనియు, నింకను లెక్కకందని వెన్నియో కలవనియుఁ బర్యవేక్షకు లభిప్రాయ పడుచున్నారు. గంగా సింధు బ్రహ్మపుత్రాది జీవనదులకుఁ బుట్టినిల్లయి, వివిధ వృక్షౌషధీ లతాదిక సంపదలతో నలరారుచు, సహజసౌందర్య స్నిగ్ధకాంతుల నలువైపులఁ బ్రసరించుచు, భారతీయ చరిత్రను దీర్చిదిద్దుచుఁ, దదాధ్యాత్మిక మహత్త్వముఁ బ్రకటించుచు, నద్వితీయ మహీధరమై యిమ్మహి నీతుహిన మహీధర మొప్పారు చున్నది.

మానవుల మంత్రముగ్ధులఁ జేయు ప్రకృతి వైచిత్ర్యములలోఁ బర్వతములు గూడ నొక యున్నతశ్రేణికిఁ జెందియున్నవి. అటులైనచో వాని స్వరూపలక్షణములఁ దెలిసికొనుటకు మానవుఁడు సర్వదా సంసిద్ధుఁడే. బహుదూరమునుండి, మహోన్నతములై కోటగోడలవలెఁ గాన్పించుచు సహజసౌందర్య విలసితములై, నున్నని తిన్నని కాంతుల జిగిమెఱయు పర్వతము లెవరి నాకర్షింపఁజాలవు! కావుననే వాని యథారూపముల నరయుటకు మానవులు విశ్వప్రయత్నములు సల్పుచుందురు. ఈ ప్రయత్నములే గత శతాబ్దమునుండి పర్వతశిఖరారోహణాదిక క్రియారూపముఁ దాల్చినవి. పర్వతారోహణాది క్రియలకుఁ బూర్వముఁ, బర్వతశిఖర పరిసరములఁ బరిశోధన

ముఖ్యమై యుండెను. గత శతాబ్దములో నిట్టి పరిశోధన లెన్నియో జరిగెను.

పూర్వ శతాబ్దము 'భారతీయ భౌగోళిక పరిశోధనా శాఖ' యను పేర నొకదానిని భారతీయప్రభుత్వము స్థాపించెను. ఈప్రభుత్వ శాఖ నిర్వహించవలసిన కార్యములలోఁ బర్వత శిఖరారణ్య నదీనద జన్మస్థానాదిక పరిశోధనలు గూడ గలవు. ఈశాఖాధిపతియైన 'సర్ జార్జి ఎవరెస్ట్' సుమారు నూరుమైళ్ళ దూరమునుండి యంత్ర సాహాయ్యమున హిమవత్పర్వత శిఖరములఁ బరిశీలించుచుండఁ గ్రీ. శ. 1841, సంవత్సరములో నసంఖ్యాక శిఖరాగ్రముల నడుమ, నాకాశముతో భుజస్కంధముల నొరయుచున్నదో, యను భ్రాంతినిఁ గొల్పు త్రిభుజాగ్రము నొకదానిఁ జూచి యా శిఖరము 29,002 అడుగుల యౌన్నత్యము గలదని తెలిపెను. నాటినుండి యా శిఖరమును 'ఎవరెస్టు' శిఖరమనుట యాచారమైనది. నేఁడీ ఎవరెస్టు శిఖరమే ప్రపంచములో నత్యున్నత శిఖరముగఁ బరిగణింపఁ బడుచున్నది. ఈ శిఖరమునకు నామాంతరములు గూడఁ గలవు. నేపాలీయు లీశిఖరమును 'సాగర్ మాతా' యనియు, టిబెట్టుదేశస్థులు 'చోమోలుంగ్ మా' యనియు, భారతీయులు 'గౌరీశంకర్' అనియు దీనిని వ్యవహరించుచున్నారు. గౌరీశంకర శిఖర మనుపేర వేఱొక శిఖరము గలదని యాధునిక పర్వతారోహకులు స్పష్టముగఁ దెల్పుచున్నారు. ఇదిగాక హిమాలయసీమలో, కే, 2, (28,278 అ.), కాంచనగంగా (28,150అ.) మకాలు, (27,790అ.) లోట్సు (27,890అ.) నంగపర్వత్ (26,600 అ.) చోమ్లోహారి (23,930 అ.) త్రిశూల్ (23,406 అ.) ప్యూమోరి (23,190 అ.) కామెట్ (22,260 అ.), ధవళగిరి, నందాదేవి, కైలాస్ మొదలైన శిఖరము లెన్నియో కలవు.

ఈ పర్వత పరిశోధనల ముఖ్యోద్దేశమేమి? పర్వతశిఖరారోహణమే! పర్వతముల నధిరోహించి యందలి ప్రకృతి సౌందర్య శోభలఁ దనివారఁజూచి యానందించవలెను. కౌతుక మెల్లవేళల మానవ హృదయములఁ గదిలించుచుండును. అత్యున్నత శిఖరాగ్రము లెటులుండును? అందు ప్రాణు లేవైనఁ గలవా? అచటి వాతావరణ మెటులుండునో, మొదలయిన ప్రశ్న పరంపర మానవ హృదయసీమల మొలకెత్తుచుండును. ఈ సహజ సౌందర్య విజ్ఞాన పిపాసయే పర్వతారోహణకు ముఖ్యకారణము సాధారణముగ మన దేశమునఁ బర్వతము లెంతయో భక్తి ప్రపత్తులతోఁ బూజింపఁ బడుచున్నవనుట యతిశయోక్తి కానేరదు. అమరనాథ హరిద్వారాది పుణ్యక్షేత్రము లెన్నియో, పర్వతాగ్రములఁ గాని, తత్సానుదేశములఁ గాని, తత్పాదభూమికలఁ గాని, నెలకొని యున్నవి. భారతీయు లెందఱో, యతి కష్ట శారీరక మనఃక్లేశములఁ గోరి యనుభవించుచునే యీ పుణ్యక్షేత్రముల దర్శించి వచ్చుట మనకుఁ దెలియని విషయము గాదు. సంయమీంద్రుల తపస్సాధనాది కార్యములకు దోహద మిచ్చుచు, వారి యాధ్యాత్మికౌన్నత్యమునకుఁ గారణమగు నీపవిత్ర హిమవన్నగ సందర్శనార్థమై కదా, కాశీకాంచ్యవంతికాది మహాపుణ్య క్షేత్రములఁ బెడమొగము పెట్టి యా "చతు రాస్యవంశ కల శోదధిపూర్ణ శశాంకుఁడు" ప్రవరాఖ్యుఁ డేగినాఁడు! పుణ్యప్రాప్తికి మార్గము లని భారతీయులు పర్వతారోహణఁ జేయుచుండ, మానవశక్తి సామర్థ్యముల లోతుపాతుల నెఱుంగ వలెనన్న యభిలాషతోఁ బాశ్చాత్యు లీపర్వతారోహణఁ జేయుచున్నారు.

గత శతాబ్దములో నీ పర్వతారోహణ కార్యమారంభమై యైరోపీయుల మిక్కిలిఁ దీవ్రముగ నాకర్షించి కాలక్రమమున నొకా

నొక ప్రజ్ఞావిశేషముగఁ బరిగణింపఁబడి సాహసోపేతుల, విద్యుద్దీపితోత్సాహులఁ, జేయఁగల సాధనమైనది. మహోన్నత పర్వత శిఖరాగ్రములఁ దమసన్నిధాన భాగ్యాకరములుగఁ జేయు తీవ్రతరవాంఛ పాశ్చాత్య హృదయసీమల మొలకెత్తి, చిగిర్చి, పుష్పించి, ఫలవంతము కాసాగినది. గగన సాగర భూగర్భముల ఛేదించి యమూల్య సత్యరత్నముల బయల్పఱుప నొనర్చు మానవ ప్రతిభా పురోగమనము నరికట్టఁగల శక్తి యీ భూమండలములో నుండరాదనెడు పరమాశయమే యీ సాహసికక్రియలకు మూలాధారము. మానవుఁడు దనవిజ్ఞాన పరిమితి కావల యజేయ సృష్టివైచిత్ర్య మేదేని యున్నచో 'నది మానవసామర్థ్యమున కొక పరీక్షగ నెన్నుచున్నాఁడు. అట్టి పరీక్షకు సిద్ధపడి యక్షయదీక్షతో శ్రమించి, విజయము సాధించి, యజేయుఁడు మానవుఁ' డన్న విఖ్యాతిని సజీవముగ నిలుపునంత, వఱ కాతనికి నిదుర పట్టదు. ఈ విజయకాంక్షయే యాధునిక యుగమునం దత్యద్భుత కార్యసాధనలకుఁ గారణభూతమై నేడు మానవుల నుత్తమస్థాయిలోఁ బరీక్షింపఁగల పర్వతారోహణ కార్యరూపము వహించినది.

పందొమ్మిదవ శతాబ్దములో నైరోపీయుల నుత్తేజపఱచిన పర్వతారోహణ విద్యుద్వేగమునఁ బ్రపంచ మెల్లెడల జరజరఁ బ్రాకినది. దేశీయప్రభుత్వములు సైతమిపు డీ యత్నములపట్ల నాదరాభిమానములఁ బ్రకటించుచుఁ బర్వతారోహణానురక్తుల నుద్దీపింపఁజేయుచున్నవి. ఈ ప్రజ్ఞావిశేషమునకు మార్గదర్శకులైన పాశ్చాత్యులు, ఐరోపాఖండమునఁగల 'ఆల్ప్స' ( Alps ) పర్వతములను, దక్షిణ అమెరికాలోని 'ఆండీసు' — పర్వతములను, అలాస్కా, ఆఫ్రికాలఁగల పర్వతములను, నధిరోహించిరి. ఈ విజయములతో వారి యాతుర

తయు నుత్సాహము నుపశమించుటకు బదులు మఱింత విజృంభించెను. సాగర పరివృతమేదినీ విశాలమండలములో నింక నీ సాహసకార్యాను కూల రంగస్థలమేది — యను సమస్య తలయెత్తి నంతలో హిమవ త్పర్వతములు వారియెదుట సాక్షాత్కరించెను. అత్యధిక పరిమా ణౌన్నత్యములతో నలరారుచుఁ బ్రపంచ విఖ్యాతిఁగన్న హిమాలయ పర్వతారోహణ సులభసాధ్యముగాదు. నిరుపమాన సాహసము, కార్యాసక్తి, క్రియాదక్షత, ప్రయత్నము, విజయోత్సాహము, గలిగిన వీరులకే యీ భూధరములు ఆరోహణీయములు. కావున నీ పర్వ తముల జయించుట కష్టసాధ్యమే యైనను కీర్తిహేతు వగును. ఇరువదవ శతాబ్దమునఁ బాశ్చాత్య పర్వతారోహకులు హిమవత్పర్వ తారోహణయందే తమ శక్తియుక్తులఁ గేంద్రీకరించుటకు కారణ మీ నిరుపమాన కీర్తి ప్రతిష్ఠాసముపార్జనమే యనుట యతిశయోక్తి కాఁజాలదు.

పాశ్చాత్యుల దృష్టి నాకర్షించిన దాదిగ హిమవత్పర్వతముల ప్రాముఖ్య మశేషముగ వృద్ధి నొంది బహువిధ గిరి శిఖర పర్యవేక్ష ణలకు దారిదీసినది. పాశ్చాత్యులు, భారతీయులును, నెడ తెగక యీ దుర్భర కార్యభారమును స్వచ్ఛందముగఁ దమపై వైచికొని, కృషి సల్పి, హిమవన్నగ పరిస్థితుల నెన్నిటినో వెలుఁగున కీడ్చిరి. అట్టివారిలో 'హరిరాం' అను వంగదేశీయుఁ డొకఁడు.

సుమారు నూరు మైళ్ళ దూరమునుండి యీ 'ఎవరెస్టు' శిఖ రాగ్రమునుఁ బరిశీలింపఁ గలిగిరే గాని, దాని దవ్వుల కరిగి యితర విశేషాంశముల నెఱిఁగినవారు లేరు. జగద్విఖ్యాత కీర్తిఁ గన్న మీఁదట నీశిఖర పరిసరములఁ దెలిసికొన వలెనను కోరిక లీరకలెత్త, వంగ రాష్ట్ర ప్రభుత్వ మీ కార్యమును సాధించుట కుపక్రమించి, తద్విషయ

పరిశీలనా కార్యభారము హారిరాముపై మోపినది. హారిరాముఁడు హిమాలయ ప్రదేశములఁ బ్రవేశించి, వెలలేని సత్యముల నరయ వలయుఁగదా! అది యంతయు వాని తెలివితేటలపైనే యాధారపడి యున్నది. అది యటులుండ, నీకార్యము నాటంక పఱచు శక్తు లెన్నియో కలవు. అవెట్టివో, తెలియఁదగిన యావశ్యక మాదియందే కలదు.

హిమవత్పర్వతశ్రేణులు టిబెట్టు — ఇండియా దేశముల నడుమ సరిహద్దుగా నేర్పడి యుండుటయేగాక రెంటి యందును సువిశాలముగ విస్తరించియున్నవి. ప్రకృతివిషయమైన 'ఎవరెస్టు' శిఖర మీ టిబెట్టు, నేపాళదేశముల విస్తరించి యుంట, నేతత్పరిశోధన కార్యము నకుముందా టిబెట్టు ప్రభుత్వాంగీకార సంపాదన మవశ్య కర్తవ్యము; కాని పందొమ్మిదవ శతాబ్దమున మతావేశ భూయిష్ఠమైన టిబెట్టు ప్రభుత్వమున కీలాటి కార్యము లర్థరహితములేగాక మత విరుద్ధములుగఁ దోఁచుటను, విదేశీయులపట్ల నుదాసీన భావము సహజ లక్షణముగఁ గలిగిన దగుటచేతను, నితరులు దమదేశము పొలిమేరల దాటివచ్చుట కిచ్ఛగించు నట్టిది కాకుండెను. కావుననే యాదేశమునఁ బ్రవేశించి పరిశోధింపఁ బూనుకొన్న పాశ్చాత్యు లెందఱో, విఫల మనోరథులై గృహోన్ముఖులైరి. ఈ యాటంకము గొడ్డలి పెట్టగుట హిమవన్నగ పరిశోధన లసాధ్యసమస్య లయ్యెను. లామా ప్రభుత్వ ధిక్కారణ పాడిగాదను నభిప్రాయమును భారతీయ ప్రభుత్వము గలిగి యున్నప్పటికిని బహుప్రయోజన కరమైన పరిశోధన లుపాయాంతర ములనైనఁ గొనసాగించుటకు నిశ్చయించి గూఢచారిగా హారిరాము నాపర్వతసీమల కంపెను.

ఎవరెస్టు శిఖర నిజరూప ప్రకటన కార్యాసక్తుడై క్రీ. శ. 1871 సంవత్సరమున హారిరాం డార్జిలింగ్ పట్టణమునుండి బయలు

దేరెను. వంగ రాష్ట్రోత్తరభాగమున నీహారాచల నిగూఢ నిశ్చల పరిష్వంగ సౌఖ్యమునఁ దేలుచు, నద్వితీయ శ్యామల కోమల కానన పరివృతమై, స్నిగ్ధసౌందర్య దీధితుల నలువైపుల వెదఁజల్లుచు, హిమాలయ దివ్యవీథులలో కనుల మిఱుమిట్లు గొల్పునది డార్జిలింగ్ నగరము! ప్రకృతిసిద్ధమైన యీ సుందరనగరమును దిలకించి నేత్రోత్సవము నేసికొనుటకై విదేశీయులు తత్పరిసరమున కేతెంచి విహరించుచుందురు. ఇట్లంతర్జాతీయ విఖ్యాతిఁగాంచిన డార్జిలింగ్ నగరమునకుఁ బరదేశీయు లారోగ్యప్రాప్తి కేతెంచుచుందురు. నేపాల్, టిబెటు, సిక్కిం దేశీయులు జీవనోపాధి కొఱ కేతెంచుచుందురు. కావుననే యీ పట్టణ మెల్లపుడును యాతాయాత జనవ్రాతములచే నిత్యానంద పినూత్న శోభాయమానమై చెలఁగుచుండును. తత్సమీపమున దివ్యసౌందర్య విలసితమై యొప్పారు 'కాంచనజంఘా' శిఖరముగలదు. డార్జిలింగ్ నగరము నందలి యాకర్షక దృశ్యములలో నిది యొకటి. ప్రకృతి రామణీయకమువలననేగాక యీనగరము కారణాంతరములచేఁ గూడఁ బ్రసిద్ధిఁ గాంచినది. తేయాకు నుత్పత్తివ్యాపారముల కిది ప్రధాన కేంద్రమై యున్నది. లక్షలాది ప్రజ లీ తేయాకు యొక్క యుత్పత్తి వ్యాపారాది కార్యములలో నిమగ్నులై జీవయాత్ర నల్పుచుందురు. అదియుఁగాక, యిండియా, టిబెట్టు దేశముల సంధించు రహదారిలో నీ పట్టణము వెలసియుండుటచే నీ రెండు దేశముల నడుమ భారవస్తుసముదాయము లెన్నియో దీనిమీఁదుగ ననుదినము రవాణా యగుచుండును. ఇట్లు హిమాలయనగర సింహద్వారమై యొప్పు డార్జిలింగ్‌లో బయలుదేరి హరిరాముఁడు ప్రబల నైసర్గికావరోధములచే నిండి నిబిడీకృతమైన పర్వతప్రాంతమునఁ బ్రవేశించెను. ఈ ప్రాంతము లన్నియు విదేశవైముఖ్య వాతావరణముగల వగుటచే, నిర్వహింప వలసిన కార్యభారము నాతఁడు మహాపర్వతమునువలె మోయవలసి

వచ్చెను. ఆతని బాధ్యత కడుంగడు గడుసైనది. ప్రమాదభరితమైన ప్రదేశములలో సంచరించవలసియుంటఁ బ్రచ్ఛన్న వేషధారణ మత్యావసరమై యుండెను. హరిరామునకు వైద్యమునఁ గొలఁది ప్రవేశముండుటఁ దద్వేషానుగమ్య రహస్యవ్యాపారుఁడై మందులజోలె యొకటి భుజమునకు దగిలించుకొని పొట్టఁ జేతఁబట్టి దేశద్రిమ్మరివలె నతఁడు భారతదేశపు సరిహద్దులదాటి సిక్కిం రాష్ట్రములోని లేప్చా మండలమున నడుగు వెట్టెను. అపుడా మండలాధిపుభార్య దీర్ఘ వ్యాధిగ్రస్తత, బాధ యెక్కుడగుటఁ దీవ్రవేదనాదోదూయత నుంట యెఱింగి హరిరాముం డచటి కేగెను. అంత నా రాష్ట్రపుని కోర్కెమేర కాబిడ కతిశ్రద్ధాసక్తుఁడై యౌషధ మిచ్చి యచిరకాలముననే స్వస్థతఁ జేకూర్చెను. హరిరాం సేవల కా రాష్ట్రనేత మెచ్చి సంతసించి, తనకృతజ్ఞతఁ దెల్ప నేమి యాతనికి వలయుఁ దానిఁ దా నొసంగెద ననుఁడు టిబెట్టుదేశ ప్రవేశ మనఁ, గోరిక స్వల్పమౌట నా యధిపతి తత్క్షణమే తన రక్షకభటుల సాహాయ్యమున నాతని నా దేశముఁ జేర్పించెను.

హరిరాముఁడు టిబెట్టులోఁ బ్రవేశించి యందలి సరస్సులను, దత్తీరాంతర గ్రామములను, గనుంగొనుచు, నెవరెస్టు శిఖరపరిసరములలోఁ దిరుగాడుచుండ, శీతకాల మాసన్న మాయెను. శీతగిరిపై శీతకాల మెంతటి వంతల ఘొంతకారియో తదనుభవవేదులకే వేద్యము. దుర్భర శీతలపవనములు, తుపారవృష్టులు, హిమాచ్ఛాదిత బిలద్వారములు, ప్రయాణికులఁ బెక్కువెతలఁ బెట్టుచుండును. మార్గమున నటనటఁ గొన్ని మహోన్నత ప్రపాతములు, నఖాతములైన లోయలు, గిరిశిఖరములనుండి యమాంతముఁ, దలక్రిందులుగ దొఱలు నిర్ఝరిణులుఁ, బర్వతములఁజుట్టి వనలతాళివలె, వంపుసొంపులతో, బ్రహ్మాండ

మైన లోయలఁబడి ప్రవహించు దీర్ఘదీర్ఘికలును, గల పర్వతపర్వతాం
తర వనాంతరముల సంచరించుచుఁ, దిన్నగఁ గొంతకాలమున కెవరెస్టు
శిఖర సమీపమున కాతఁ డేతెంచెను. ఇపు డాతనిని పర్వతోత్తుంగ
దీర్ఘబాహువులు కట్టివైచినవి. ఎటు చూచినను హిమప్రపూరిత
భయోత్సేక మహాభీలగగన చుంబిత శిఖరాంతర సానుదేశములే
తళత్తళత్ స్ఫాటిక వర్ణాంచిత ధావళ్యానుపమ తేజో విరాజిత నగో
న్నత తలులే; ఒకపరి భయము, మఱియొకపరి రేకెత్తు నుత్సా
హము; నొకవంక గభీరాభీల దుర్దమ నిర్జన భూధర శిఖరారోహణము,
మఱియొకవంకఁ బ్రాణభయోజ్జ్వలిత నిరుత్సాహ పరవశత్వము;
ఏ తట్టుఁ జూచినను గనీనికల మట్టువెట్టు నిడుమెట్ట కొట్టకొనలు; భయ
హేతువు గలదు. కాని నిశ్చల ధర్మవీరుఁడు హరిరాముఁడు. ఎది
యే శృంగమో, తెలియుటెట్లు? పరిసర గ్రామీణుల నతఁడు ప్రశ్నిం
చెను గాని యాశిఖరనామముల నెన్నింటినో వారుఁ దెలియరు, గాన
నీతడెట్లు దెలియంగలఁడు? ఇఁక నెవరెస్టు శిఖరమా, యితర శిఖరము
లచేఁ గప్పబడియున్నది. హరిరాముఁ డిరువదిమైళ్ల దూరమున
నుండియు దానిశిఖర దర్శనము చేయఁజాలఁ డయ్యెను.

హరిరాముఁడు రెండవసారి యీ ప్రాంతములకువచ్చి పరిశో
ధనా ప్రయత్న కలితుడయ్యెఁగాని, తచ్ఛిఖర నిజస్థల స్వరూపముల
నాతఁ డెఱుఁగఁ జాలకపోయెను. అయినప్పటికిని హరిరాం పరిశోధ
నల మూలమున హిమవత్పర్వత శ్రేణీరూపరేఖాదులు, గ్రామీణ
జీవిత విశేషము లొకింత విశదమైనవి. హరిరాం వలెనే పెక్కు రిట్టి
పరిశోధనలఁజేసి మఱికొన్ని విశేషముల బహిరంగ పఱచిరి. అటు
పిమ్మటనే హిమాలయ శిఖరారోహణ కార్యము స్పష్టరూప మొందఁ
జొచ్చెను.

ఇట్లుంకుంఠిత దీక్షతో హిమవత్పర్వత శిఖరపరిశోధన కొనసాగుచుండినను, క్రీ. శ. 1921 వ సంవత్సరము వఱకు, నెవరెస్టు శిఖరారోహణమును నెవ్వరును దలపెట్టరైరి. ప్రపంచమునఁ గల వివిధ పర్వత శిఖరముల నధిరోహించిన వీరులుసైత మీయెవరెస్టుపై కుఱుకఁ దలంపుఁ గల్గియు సాహసింపఁ జాలరైరి.

లండన్ నగరమున 'రాయల్ జియ్రాఫికల్ సొసైటి' (Royal Geographical Society), 'ఆల్పైన్ క్లబ్' (Alpine club) అను సంస్థలు గలవు. భూగోళిక పరిశోధనయే ముఖ్యాశయముగాఁ గల రాయల్ జియ్రాఫికల్ సొసైటీ కృషిఫలితముగనే సముద్ర మధ్యస్థిత ద్వీప సమూహములు, నుత్తర దక్షిణ ధ్రువ ప్రదేశములు, రవికానని రహస్యదుర్గమ సాంద్రారణ్యా నదీనద జన్మస్థలములు, పరిశోధితము లైనవి. ఇఁక 'నాల్పైన్ క్లబ్బు' ముఖ్యాశయము పర్వతారోహణమే. ఈసంస్థలు రెండును గూడి యెవరెస్టు శిఖరారోహణకుఁ బూనుకొనినవి. ఏతత్కార్య నిర్వహణభారమును దమ భుజస్కంధములపై మోపికొని తదీయ కార్యసాధనార్థము 'ఎవరెస్టు సమితి' అనుపేర నొక నూత్నసంఘమును బ్రతిష్ఠించి, 'సర్ ఫ్రాన్సిస్ యంగ్ హజ్‌బెండు' అను సైనికోద్యోగినిఁ దత్సమితి ప్రథమాధ్యక్షునిగ నియమించిరి. అటుపిమ్మటఁ క్రీ. శ. 1921 వ సంవత్సరమున నీ సమితి యాజమాన్యమున నెవరెస్టు శిఖరాగ్రమును జేరుట కనువైన సులభ మార్గమును బర్యవేక్షించుటకై 'కర్నల్ హూవార్డ్ బరీ' నాయకత్వమునఁ బర్వతారోహక సంఘము బయలుదేఱెను. ఆ సంఘము టిబెట్టుఁజేరి యుత్తరదిశ నుండి యెవరెస్టు శిఖరాగ్ర గమనమున కనువైన మార్గముం గనుంగొన నుద్యమించెను.

అది క్రీ. శ. 1922 వ సంవత్సరము మే నెల, 20, తారీఖు తెల్లవాఱినది. అరుణోదయ రవికాంతు లుదయాచలముపై కెగఁ బ్రాకుచున్నవి. తుహినభూధర శిఖరాగ్రముపై బాలార్క తరుణారుణ తేజఃపుంజములు ప్రసరించుచు నారజత పర్వతమునకుఁ బయిడి చాయల దిద్దుచున్నవి. అద్వితీయ మనోహరాలంకృతమైన యా శిఖరసుందరి తన లేఁతగులాబి బుగ్గలు సొట్టలువడఁ జిఱునవ్వులు గ్రుమ్మరించుచుఁ బర్వతారోహకులఁ దన పరిష్వంగ సుఖానురక్తులఁ జేయుచుండ వారిశరీరములఁ బులక లెలయించుటకో యనఁ జల్లని పిల్ల తెమ్మెరల పరంపరలు మంద వేగమున గిరిశిఖరముల నడుమ దోఁబూచు లాడుచుఁ బింపిళ్లు గూయుచు నున్నవి. నీహారసృష్టిచేఁ బర్వత నితంబములు జిలుగు జిగ్గు నిగనిగల సొగయింపఁజేసి వెదఁజల్లుచు, వెండిపూఁతల సొబగుం దనమును గుబాళింపఁజేసెడిని. ఆకస మింద్రనీల శోభితమై సాగరప్రతిబింబమో యనునట్లు మెఱయుచుండెను. ప్రకృతి ప్రశాంతత యాహ్లాదకరముగ నుండుటఁ బర్వతారోహకుల యుత్సాహ ముప్పొంగుచుండెను. నిజానన్య సాహసక్రియాభిలాషకు శుభాశీస్సుల నీ ప్రశాంతమయ ప్రకృతి యొసఁగుచున్నది గదాయని ముద మందుచు, నుదయ మేడున్నర గంటలకుఁ బర్వతారోహకులు పురోగమించిరి. మానవచరిత్రలోఁ బ్రప్రథమమున నెవరెస్టు శిఖరారోహక యత్నారంభమున కానాఁడు జార్జి మేలరీ ప్రభృతులు అంకురార్పణ గావించిరి ! ! కాని విధి ప్రతికూలమగుటనా యత్నము ఫలింపలేదు. మఱల 1924 వ సంవత్సరమున బునః ప్రయత్నము సేసిరి, కాని విజయలక్ష్మి యింకను గొంత దూరమునగనే యుండెను. నాయకుఁడైన కర్నల్ నార్టన్ 28,126 అడుగుల యెత్తునకువెళ్లి పరాజితుడై తిరోగమించెను. మఱియొకసారి మానవుల, బరాజితులఁ జేసినందుల కాగ్రహపడి ఆండ్రూ ఇర్విన్ అను యువకుని

వెంటనిడుకొని మేలరీ శిఖరముపై కుఱికెను. జూన్ 7 వ తారీఖున బయలుదేఱిన మేలరీ ఇర్విను మఱల రాలేదు. వారు శిఖరాగ్రమును జేరఁగల్గిరా? చేరి మఱలుచుండఁ బ్రమాదవశమున నసువులు బాసిరా? అను సంశయములఁ దీర్చువారులేరు. సుమారు 28,000 అడుగుల పర్యంతము వెళ్లఁగలిగిన మేలరీ ఇర్వినుల వృత్తాంతము కాలగర్భమున లీనమైనది. పర్వతారోహక ద్వయమును నిట్లు పొట్టఁ బెట్టికొని, నూత్నవిజయలక్ష్మిచేఁ బ్రకాశితమగుచున్నదో యన నహంకారమున దన యౌన్నత్యముఁ బ్రకటించు నా శిఖరరాజమును జూచి మానవులు చిరకాల మోపికనుండఁజాలరైరి. మేలరీ ఇర్వినుల విషాదగాథ యనంతర పర్వతారోహకుల యుత్సాహమునుఁ జల్లార్చినది కాని సృష్టివైచిత్ర్య పరిశోధనాబీజ మొకపరి యంకురించి, మొలకెత్తి చచ్చినను మఱల నంకురింపక, మొలకెత్తక, నిలువనేరదు గదా! కాలవాహిని మఱికొన్ని యోజనములు బ్రవహించిననేమి? అది యంకురించి, మొలకెత్తి, ననలఁబొఱనుండెను. ప్రకృతి విజయమును మానవుఁడెట్టు లెంతకాలము సైపఁగలఁడు? మేలరీ ఇర్వినుల యంతర్ధానరూపముఁ దాల్చిన పరాభవాగ్ని పర్వతారోహక ప్రపంచము నుడికించినది. తనపైఁ గాలుమోపినను, మోపకపోయినను విచారములేదు; గాని యువకవీరు లిరువురఁబొట్టఁ బెట్టికొనుటయా? కేవల మొక యున్నతశిఖరమే, సృష్టిస్థితిలయాది సత్యస్వరూపముల నరయఁగల మానవుల నింతఁ బరాభవింపవలెనా? యని తలఁచినచో మానవశక్తి కీశిఖర మేపాటిది? ఇతఃపూర్వ మెన్నిశిఖరముల నధిరోహించలేదు? ఏమైనఁగాని శిఖరరాజమని విఱ్ఱవీగు నీశిఖర గర్వము నడంపవలయును. ఇట్టి భావతరంగాహిత మనస్కులై కొందఱు కార్యరంగమున కుఱుక నుండిరి. ఎవరెస్టు కాహుతులైన మేలరీ ఇర్వినుల యాత్మలు శాంతిఁబొందు టెట్లు? ఈ మాట యాయువకుల

మఱింత రేఁచినది. కొంతకాలమైనంత, హ్యూరట్ వెడ్జ్ (1933), ఎరిక్ షిప్టన్ (1935) మఱల హ్యూరట్ వెడ్జ్ (1936), టిల్‌మన్ (1938) మఱల ఎరిక్ షిప్టన్ (1951), వైస్‌డునాంట్, (స్విట్జర్లెండు దేశీయుఁడు) (1952), గేబ్రియల్ (స్విట్జర్లెండు దేశీయుఁడు) (1952) అను వారల నాయకత్వమున నా యా సంవత్సరములలో నెవరెస్టు నధిరోహించుటకు బ్రయత్నములు జరిగెను. కాని వారును జితాస్మః యనవలసివచ్చెను.

మఱలఁ గ్రీ. శ. 1933 సంవత్సరమున నెవరెస్టు శిఖరారోహణ ప్రయత్నము తలయెత్తినది. ఆ సంవత్సరము హ్యూరట్ వెడ్జ్ అను నాంగ్లేయుని నాయకత్వమునఁ జతుర్థయాత్ర జరిగెను. దాఁదాపు తొమ్మిది వత్సరముల కాల మా శిఖరము మానవధిక్కారము లేక ప్రశాంతి వహించినది, తన యీ ప్రశాంతిని భంగపఱుప మానవ మాత్రుఁడు దనపై నరుదెంచి, కయ్యమునకుఁ గాలుద్రవ్వుటఁ జూచి ఎవరెస్టు మహోగ్రమయి, తన్నావరించి యుండు ప్రకృతిశక్తులలో నొకటియైన ప్రచండపవనమును వారిపైఁ బ్రయోగించెను. ఉచ్చులఁ ద్రెంచికొనినటు లా తీవ్రమారుతము వారిపైఁబడి మఱలఁ జేసెను.

ప్రయత్నపరాజయము లిట్లన్యోన్యముఁ బెనఁగులాడుచునే యున్నవి. ప్రకృతి పురుషుల యన్యోన్యకలహమున నెవరుగాని వెను దివియుటలేదు. నిరంతర పౌరుషాతిరేక ముద్దీపింపఁజేయగల యెవ రెస్టుపై మఱల మానవుఁడు పోరు ప్రకటించెను. ఎరిక్ షిప్టన్ నాయ కత్వమునఁ గ్రీ. శ. 1935 లో నాంగ్లపర్వతారోహక సంఘమొకటి యెవరెస్టు పశ్చిమదిశనుండి యారోహణ ప్రారంభించెను. ఎవరెస్టు మఱల జయభేరి మ్రోయించి చండమారుత నీహారవృష్ట్యాది ప్రబలసైన్య నికరముల వారిపై దాడివెడలఁజేసి వారి యత్నముల సమయింపఁ

జేసెను. మఱునటి వత్సరముననే హ్యూరట్ వెజ్జ్ పునఃప్రయత్న కలితుఁడై విఫలుఁ డయ్యెను. యత్నకార్యసాఫల్యము లేమియైనను, నితరప్రయత్నము లాగలేదు. టిల్మన్ అను నాంగ్లేయుఁడు 1938 సంవత్సరమున నెవరెస్టుపై విజృంభించి భగ్నసంకల్పుఁడయ్యెను.

అంతటితో నాంగ్లేయు లెవరెస్టుకు విశ్రాంతి నీఁదలంపుఁగొనిరి. ద్వితీయ ప్రపంచసంగ్రామమే యిందులకు గారణము. వివిధరంగముల వీరాధివీరులెల్లరు స్వదేశరక్షణార్థ మీయత్నములకుఁ స్వస్తిఁజెప్పిరి. యుద్ధము పరిసమాప్తిఁ జెంది ప్రపంచమున సుస్థిర శాంతిస్థాపనానంతరము బర్వతారోహకుల దృష్టి మఱల నెవరెస్టుపైఁ బడెను. విధివిరామములు లేక యెందఱెన్నివిధములనో ప్రయత్నములు సల్పుచున్నను, దలయొగ్గని యెవరెస్టు శిఖర మొక గొప్ప సమస్యగాఁ బ్రపంచసదస్సునఁ బరిణమించినది. ఈ సమస్యాపరిష్కారమునకు మార్గాంతరము లేవైనఁ గలవా యని యాలోచనఁజేయఁ బూర్వముమాడ్కిఁ దక్షిణ పార్శ్వమునుండి శిఖరాగ్రము సేర వలనుపడునా యను సందేహము పొడమెను. అంత నాంగ్లేయులు మఱలఁ బర్వతారోహణకార్యమం దధికప్రావీణ్యము సముపార్జించిన ఎరిక్ షిప్టన్ నాయకత్వమున 1951 లో నెవరెస్టు దక్షిణముఖ పర్యవేక్షణార్థము బయలువెడలిరి. ఎవరెస్టు శిఖరము టిబెట్టు నేపాళదేశములలో, నుత్తర దక్షిణములుగ విస్తరించి యున్నది. దక్షిణ ముఖమును బర్యవేక్షింపవలసినచో నేపాళదేశమున కేఁగవలయును. పూర్వ మీప్రయత్నముల నేపాళీయు లామోదింపని కారణముచే దక్షిణముఖ పర్యవేక్షణగాని, యటనుండి పర్వతారోహణగాని జరిగియుండలేదు. ఇపు డాయవసరము వచ్చినది. నేపాళ ప్రభుత్వ మీ యవసరమును గుర్తించి, యాంగ్ల పర్వతారోహకుల నభినందించుచు, నెవరెస్టు దక్షిణముఖ పర్యవేక్షణ కనుమతించెను.

ఎరిక్ షిప్టన్ బహుచాకచక్యముతోఁ బర్యవేక్షణ జరిపి యెవ
రెస్టు దక్షిణముఖమునుండి శిఖరాగ్రము దనుక సులభసాధ్యమా
మార్గము గనుగొనెను. ఎవరెస్టు శిఖరారోహణ తొలుదొల్తఁ బ్రారం
భించుటకు బూర్వము శిఖరాగ్రము నేరుటకై సుగమమార్గ మన్వే
షింపఁ బూనుకొనిన జార్జి మేలరీ యెవరెస్టు దక్షిణ పార్శ్వముఁ దిల
కింపఁగా నది మహాభయంకర ప్రపాత హిమానీ నదులతోఁ నిండి ప్రమా
దములకు బుట్టినిల్లుగా నతనికిఁ దోఁచెను. ఎవరెస్టు దక్షిణదిశనుండి శిఖ
రారోహణము కలలోనివార్త — యని యతఁ డభిప్రాయబడెను. ఇపు
డామార్గమే యనుకూలమైనదని షిప్టన్ సూచింపఁ బర్వతారోహకు
లెల్లరు నచ్చెరువందిరి. ముఖ్యముగా స్విట్జర్లాండు దేశీయు లీ నూతన
నావకాశమును సత్వరముగ వినియోగించుకొనుటకు సంసిద్ధులై రెండు
మార్లు శిఖరము నారోహించుటకుఁ బ్రయత్నించిరి. 1952 వ సంవత్సర
వసంతకాలమున, ఎడ్వర్డ్ వైస్—డ్యునాట్— (R. Edward Wyss-
Dunaut) నాయకత్వమున దక్షిణ దిశనుండి స్విస్సు లెవరెస్టు శిఖరా
రోహణ సల్పిరి. కార్యసిద్ధి కనుచూపుమేర నుండగ, వారు దమ యశ
క్తత గుర్తెరిగి తిరుగుత్రోవఁ బట్టిరి. మఱల నాసంవత్సరముననే శీత
కాలమునఁ బ్రయత్నించి విఫల మనోరథులైరి. ఇట్లు అనేక యత్నా
నంతర మీ యెవరెస్టు పూర్వమువలెనే తమ యశక్తతకుఁ దామే
బిడియపడు నారోహకులఁజూచి పరిహాసించుచుండెను. బహుశః ప్రపం
చములో మఱే యితర శిఖరమధిరోహించుటకును నిన్ని ప్రయత్నము
లెవ్వరేని సల్పియుండరు. మానవ శక్తియుక్తులకు లొంగని ఎవరెస్టు
శిఖరము భూతలమ్ముపై నున్నంతకాల మీ యారోహణాది కార్యములు
తుదిముట్టు మార్గ మగపడదు. విజయస్తంభము నాటువరకు కీమానవులు
సుఖముగ నిద్రఁగూరరు. ధీరవరులైన లాంబర్ట్—టెన్సిం గను వారలు
దక్షిణముఖము నధిరోహించి దాఁదాపు శిఖరాగ్రముఁ జేరగల్గిరని

వినినమీఁదట నాంగ్లేయుల కుత్సాహ మతిశయించెను. కాలయాపన నేమాత్రము జరుపక మరియొక జైత్రయాత్రకు సన్నాహము లారంభించిరి.

పర్వతారోహణవలని ప్రయోజనము లెట్టి వను సమస్య సామాన్యుల నెల్లవేళలఁ గలవర పెట్టుచుండెను. స్థూలదృష్టికీ ప్రయోజనములగోచరములై యుండనగును గాని సూక్ష్మదృష్టి కెన్నని విశేషప్రయోజనములు గోచరించును. ఆధునిక నాగరకతావ్యాప్తికి శాస్త్రవిజ్ఞానాభివృద్ధి విస్తరణ మిక్కిలి ముఖ్యమై యున్నది. అది యట్లుండ నెవరెస్టు నధిరోహించుట కిన్నివిధముల వ్యయప్రయాస పరాజయముల కోర్చి మానవులేల శ్రమించుచున్నా రను విషయము సామాన్యులకు దురవగాహమే. ప్రాథమికదశలో నాంగ్లేయు లెవరెస్టు శిఖరారోహణార్థమై వెడలుచు టిబెట్టు సరిహద్దులలో నెవరెస్టు శిఖరసమీపమునఁ గల రాఁగ్‌బక్ మఠాధిపతినిఁ గలిసికొని తమ ప్రయత్నమును గూర్చి తెలిపిరి. మఠాధిపతికీ శ్రమవలన ప్రయోజనము బోధపడలేదు. శిఖరారోహణ యనున దాతనిదృష్టిని ప్రయోజన విహీనమౌ ప్రయత్నము గావున నాతని కచ్చెరువయినది. ఎవరెస్టు శిఖరారోహణ మేల చేయుచున్నారన, నా సంఘాధిపతి 'మాదేశమునఁ బర్వతముల నారాధించు తెగ యొకటి కలదు, మే మాతెగవారము. ఇదియొక తీర్థయాత్ర. మహోన్నత భూధరమగుట మేము దీని నారాధింప వచ్చితిమి' అని లామాకు సమాధాన మొసఁగెను.

కల్నల్ జాన్ హంట్ 1953 లో నెవరెస్టు శిఖరయాత్ర ముగించి మరల వచ్చుచుండఁ గొంద ఱాతని – 'నెవరెస్టు శిఖర మధిరోహించుటలో మీయుద్దేశమేమి? ధనాపేక్షయా? మతిభ్రమణమా? మిమ్మీకార్యమునకు ప్రేరేపించినది' – అని ప్రశ్నించిరి. పైప్రశ్నల నాథా

రముఁ జేసికొని యాలోచించితి మేని విషయ మంతయు మనకు సుగ్రా హ్యమగును. నిజమే! లక్షల కొలఁది ధనము వెచ్చించి మానవ సంచార హీనమగు మంచుకొండల మీఁది కేఁగఁ బ్రాకుటలో గడించు లాభ మేమి? ఈకార్యమునకై వినియోగించిన యార్థిక శారీరక బలముల వేఱొక ప్రజోపయోగమైన కార్యమున కేల వినియోగించ రాదు? ఇదంతయు బూదిఁబోసిన హోమమేకదా! కావచ్చు. సామాన్యదృష్టిని లాభనష్టముల లెక్కఁ దేల్చువారి కీ కార్యములు ప్రయోజన రహితములే. ఆదృష్టి రూపుమాసి పోవునంతవఱ కీ ప్రయత్న ములలో వారికిఁ బ్రయోజనముఁ గన్పట్టదు. అట్టివారి కీ యత్నములు లేశమైనను దృష్టినీఁజాలవు. జిజ్ఞాసయే యీప్రయత్నములకు మూల కారణము. క్షుత్పిపాసలవలెనే మానవున కీ జిజ్ఞాస యొక సహజలక్ష ణము. తన్నావరించి వివిధరీతులఁ బరిణామములు జెందు ప్రకృతి స్వరూప మరసి తెలిసికొనుట యాతని స్వభావము, లేనిచో నతఁడు దివాంధుఁడే యగును. ఈయంధత్వమును బాపికొనుటకే యుగముల తరబడి మానవులు దమ శారీరక మానసిక శక్తుల యున్నతి నభి వృద్ధిఁ గావించుచున్నాఁడు. పర్వతశిఖరారోహణ కేవల మొక యార్థిక సమస్యగఁ బరిగణింపఁ జనదు. ఇంతకాలమునుంచి యవధిలేని కష్టనష్టములకోర్చి మహాపర్వతశిఖరముల నధిరోహించి వారేమిలాభ పడిరి? ఏదేని గొప్పలాభము నాశించిగాని, ప్రాప్తించునని యూహించి కాని, వారీ కష్టముల వరించలేదు.

అంబర చుంబిత, నిరంతర హిమాచ్ఛాదిత పర్వతశిఖరాగ్ర ములు విపరీత వాతావరణములకు జన్మస్థానములు. సర్వకాలముల దుర్భరశైత్యము, ప్రచండ పవనములు, హిమవృష్టులు, బర్వతములఁ జుట్టియుండు క్రొక్కారు నీలమేఘములు, నఘాతములై శరవేగమున

ప్రవహించు నిర్ఝరిణుల కాశ్రయమిచ్చు లోయలు, మహాప్రమాదాకర ములైన హిమానీనదులును, విరివిగాఁగల పర్వతములం దచ్చటచ్చట గుడారములలోఁ దాత్కాలిక నివాసము లేర్పరిచికొని, ప్రాణములఁ బిడికిటఁ బట్టికొని, శరీర సౌఖ్యముల విసర్జించి, పర్వతారోహణఁ జేయు వారి కెంతటి ధనాశఁ గల్పింపఁగలము? ధనాశయే ప్రధానమైనచో నీ ప్రయత్నములు సంభవములేనా? ప్రబల భౌతికావరోధముల నిస్స్వార్థ ధీర హృదయముల నెదుర్కొను కార్యదీక్షా పరతంత్రులకేగాని యన్యుల కీ సాహసకార్యములు గగన కుసుమములే! పూర్వ మా యర్జునుడు గాననావాసియైయుండియుఁ బాశుపతాస్త్ర సంపాదనకై యింద్రకీల పర్వతాంతరములఁ దపస్సు సేయుట, గనఁ బర్వతసానుప్రదేశములఁ బ్రబలశక్తియొకటి సాధారణ మానవదృష్టి కగోచరమైనది కలదని యూహింపవచ్చును.

ఇంతఃపూర్వము జఱిగిన శిఖరారోహణ కార్యములలో వైజ్ఞానిక విశేషముల నెన్నింటినో తెలిసికొనగల్గిరి. హిమాలయ పర్వత ప్రాంతములలో, వృక్ష, జంతు, భూగర్భ వాతావరణాదిక శాస్త్రజ్ఞుల కపార వైజ్ఞానిక విశేషాంశములు లభింపఁగలవు. ఇంకను బరిశోధనలేక బహిరంగముగాని విజ్ఞానాంశములెన్నియో యీ హిమవన్మహీధర సీమఁ గలవు. ఇవన్నియు బహిరంగము గావలెననిన భూధరారోహణ లెన్ని వలయునో యోచింపనగుగాదే! అని చక్కని జవాబు నిచ్చెను.

---

# 2

## సంకల్పము

ఎరిక్ షిప్టన్ కృషిచే గవేషితమైన నవీనమార్గము, నాతని యనుభవములను నాధారము సేసికొని, 1952 వ, సంవత్సరమున, శీతర్తువున, స్విట్జర్‌లాండీయు లెవరెస్టు నోడింప వెడలిరి. వారి యత్న మొకవేళ యన్యథా ఫలించినచో, వెనువెంటనే 1953 లో నెవరెస్టు నధిరోహింప మఱొకయత్నము సలుపవలయునని యాంగ్లేయులు నిశ్చయించిరి. ఈ నిశ్చయమునకుఁ గారణభూతులు, రాయల్ జ్యాగ్రాఫికల్ సొసైటీ, ఆల్ పైన్ క్లబ్బు సభ్యులు, తచ్ఛిఖరారోహణ చరిత్రకు పై రెండు సంఘములే దృఢమైన పునాదులువేసెను. క్రీ. శ. 1919 వ సంవత్సరము నుండి, నిరంతర మకుంఠిత దీక్షతో జఱుగు నాంగ్లేయుల యెవరెస్టు శిఖరారోహణ కార్యము లన్నియు నీ సంఘద్వయముయొక్క సహకార శుభాశీస్సులతోఁ గొనసాగెను. త్రిదశాబ్దములనుండి మొనకొని పూనిక మెయి జరుపు యత్నములు విజయవంతముగఁ బరిసమాప్తి జెందువఱకీ యెవరెస్టు సమితి యస్త్ర సన్న్యాసముసేయదు ; గావుననే మఱల వారీ దిగ్విజయ యాత్ర నుద్దేశించుటనేమి వింతయు క్రొత్తయులేదు.

భావికార్య నిశ్చయముఁ జేయుటయే తడవుగ నీశిఖరారోహణ కార్యనిర్వహణము దనభుజస్కంధములపై మోపికొనఁదగిన నాయకుని, నియమింపవలసి యుండెను. జర్మనీదేశమున నాంగ్లసైనికోద్యోగిగా నున్న - కల్నల్‌సర్ జాన్‌హంట్ - అను నాతని నాయకునిగ నెవరెస్టు సమితి నియమించెను. ఏ యుద్యమమునకైన నుత్తమ నాయకుఁడు లభించుటయనఁ గార్యమర్థభాగము పరిసమాప్తి యైనటులే. ప్రస్తుతకార్యమున కత్యవసర వస్తుస్వీకరణ వేయి కనులతోఁ జేయవలసి

యున్నది. వస్తుస్వీకరణకు ముఖ్యముగా నార్థికసంపత్తి, వివిధ ప్రభుత్వ వ్యక్తి సంస్థల సహృదయ సహకార మత్యవసరములు గాన, సమితి కార్యనిర్వాహకవర్గ మివి సాధింప వలసియున్నది. ఇవిగాక, యిండియా, నేపాళదేశములతో, బ్రస్తుత కార్యము నిరాటంకముగఁ గొనసాగుటకు సంప్రతింపులు జఱిపి, యా ప్రభుత్వముల యంగీకారము సంపాదింపవలసిన బాధ్యతయు సమితిపై నున్నది. ఇవన్నియు, నిరుపమానః ప్రజ్ఞా ధురంధరులు నిర్వహింపఁదగినవి. ఏదియెట్లున్న నీ యత్నమున కార్థిక సంపత్తి యపారముగ నుండవలయును. తదభివృద్ధిఁ జేయవలసినభారము సమితిపై బడినది. ఆరంభమునుండి తదీయ శిఖరారోహణకార్యము పరాజయముల పాలగుచుండుటఁ, బూర్వాపరముల యోజింపక దాత లీయుద్యమునకు ధనసాహాయ్య మొనరించుట సందేహాస్పదమైన విషయమే; కాని యెవరెస్టు సమితివారే ప్రారంభమునుండి యీయుద్యమునకు ధనమును, స్వకీయ మునే వినియోగించికొనుచుండిరి. ప్రకృతమునకు ధనసాహాయ్య మొనర్చిన వారిలోఁ దదీయ సమితి గౌరవకార్యదర్శి బి. ఆర్. గుడ్ ఫెలో, రాయల్ జ్యాగ్రాఫికల్ సొసైటి డైరెక్టరు, ఎల్. పి. కిర్వాన్, అను వారిరువురు చిరస్మరణీయులు. సర్ జాన్ హంట్ వీరికిఁ దన ప్రత్యేక కృతజ్ఞతాభివందనములు సమర్పించెను. ఇంకను బహు సంఖ్యాక సంఘములు, వ్యక్తులు. ధనమునిచ్చిరి. లండన్ నగరమున స్థాపితమై జగద్విఖ్యాతిఁ గాంచిన 'టైమ్స్' వార్తా పత్రిక వెనుకటి వలెనే ఘన సాహాయ్యమునుఁ గావించెను. ఆహారపానీయాదుల సేకరణ విషయమున, ముందువలె, మెడికల్ రీసర్చ్ కౌన్సిల్ అమూల్యమైన సలహాలఁ బ్రసాదించెను. ఈవిధముగ నింగ్లండునఁగల వివిధ సంస్థలు యథోచిత సహకార మొనర్చుట కేమాత్రము వెనుకాడలేదు.

ఎవరెస్టు సమితి కర్నల్ సర్ జాన్ హంట్ నాయకునిగ నియమించినపు డాతఁడు జర్మనీదేశమున నుండెను. స్వదేశమున కేతెంచి నూతనపదవి నలంకరించుటకుఁ బూర్తిగ నొకమాసమైన గడువుఁ గావలయునని యాతఁడు తెలిపెను. అటు లాతఁడు స్వదేశమునకు వచ్చునంతలోఁ బ్రయాణ సన్నాహములను సమితియే ప్రారంభించె నని, హిమవత్పర్వత శిఖరారోహణలో సిద్ధహస్తుఁడని పేరువడసిన ఎరిక్ షిప్టన్ తన పూర్వానుభవమును బురస్కరించుకొని పర్వతారోహణార్థ మొక పథకమును గుదిర్చియుంచెను. పర్వతారోహణ యీ పథకమున సూచింపఁబడిన మార్గము ననుసరించియే సాధారణముగ జరుగుచుండును. యాత్రాసన్నాహములఁ దదేకదీక్షతో సిద్ధపఱచుటకై కార్యదర్శినిఁ గూడ నియమించిరి.

ఎవరెస్టుయాత్ర వందలాది వ్యక్తుల నిరంతరకృషి వలనఁ గాని సాగనేరదు. దానఁజేసి యాత్రలోఁ బాల్గొనువారి నెన్నికొనవలసిన గురుతరబాధ్యత నాయకునిదై యున్నది. నిజమునకీ పర్వతారోహకుల యెన్నికమీఁదనే జయాపజయము లాధారపడి యున్నవని వక్కాణించు టతిశయోక్తి కానేరదు. యాంత్రికవస్తు సాహాయ్యమెంతటి యుత్తమమైనదైనను, నశేషప్రజ్ఞా ధురంధరులైన పర్వతారోహకులు లేమిఁ గార్యసాఫల్య మనుమానాస్పదమే. కావుననే నాయకుని బాధ్యత గురుతరమైనదని చెప్పనొప్పు. షిప్టన్ నాయకత్వమున జఱిగిన నూత్నమార్గాన్వేషణలోఁ బాల్గొనిన పర్వతారోహకుల ప్రత్యేకానుభవముల విషయ ముండనే యున్నది కదా. ఇంగ్లండులోని వ్యక్తిగత పర్వతారోహక సంఘములకుఁ దమతమ సంఘసభ్యుల నుత్తమ ప్రజ్ఞావంతుల సిఫారసు సేసి పంపవలసినదిగా నెవరెస్టు సమితి కోరెను. వీరిలో ననేకులకు ఆల్ప్సపర్వత శిఖరారోహణాను

భవ మపారము. మఱికొందఱకు హిమవన్నగారోహణానుభవముఁ గలదు. ఇంకను సాహస విక్రమోల్లసితు లెందఱో కౌతుకాయత్త చిత్తులై తమంతటతామే యీ యాత్రలోఁ బాల్గొన నుద్యుక్తులైరి. ఉత్సాహపరిపూరిత సాహసమనస్కు లిందఱీ యత్నమున ముందంజ వేయుచుండ, సత్యోత్తమ పర్వతారోహకుల నెన్నికొనుట మహాభార మైన కార్యమని వేఱుచెప్పవలయునె? నాయకుఁడైన సర్ జాన్ హంట్ ఎన్నియో సిఫారసుల నందుకొనవలసి వచ్చెను. ఇట్టి గొప్పవిషయ ముల మోమోటము లెక్కువగ నుండనగునుగాని, వానికే ప్రాధాన్య మిచ్చినచో కార్యసిద్ధి యసంభవ మగును. అందుచేఁ బర్వతా రోహక నియామకముగఁ గొన్ని నిబంధన లేర్పఱుపవలసివచ్చెను. శారీరక పూర్వానుభవ వయోమనస్తత్వ పరిస్థితులఁ బ్రమాణము లుగఁ దీసికొని సర్ జాన్ హంట్ ఉత్తమ పర్వతారోహకుల యెన్నిక నారంభించెను. అత్యున్నత హిమవత్పర్వతారోహణ కవధిలేని సహన మత్యవసరము. వాతావరణ విపర్యాసముల కెదురీదుటకు వలయు శమదమములు ముఖ్యావశ్యకములు; గావునఁ బర్వతారోహకు లెల్లఱ కిరువదియైదు, నలువది వత్సరముల వయఃపరిమితికి హెచ్చుతగ్గు లుండ రాదు. నిస్స్వార్థపరాయణులు, సంఘీభావ ప్రియులు, నిర్మలధైర్యో త్సాహ సమన్విత మనస్కులు, నిరుపమాన సాహస క్రియాదక్షులగు వారే పర్వతారోహక దళమున నుండనర్హులు.

పూర్వానుభవము సానదీఱిన మణి. ఎట్టి కార్యమునకైన ననుభవజ్ఞుల యావశ్యకత కాని, ప్రయోజనముగాని విలువ యిడ రానివి. శైలారోహణానుభవమెంతయో శ్రమకోర్చి గడింపఁ దగినట్టిది. మహోన్నత భీకర పర్వతానంత నిమ్నోన్నత సానుభూముల నావరించి, యెట్టిధైర్యవంతుల నేనిఁ జెండఁగల గభీర నిశ్శబ్దత సహించుచుఁ

ప్రకృతి పరీక్షల నవలీలనెదుర్కొనుచు, వానిపై గత్తి నొత్తఁగల నిర్భేద్యశరీర మనోదార్ఢ్య సంపన్నులే యీ కార్య రంగస్థలి నటింపఁ గలరు. అట్టి పురుషవరేణ్యుల కీపర్వతారోహణ మొకక్రీడయే. కాన విశేషాను భవముగలవారి నాదశమునఁ గూర్పవలసియున్నది. కాని యనుభవమనిన నెట్టిదో తెలియనగు. ఆరోహకు లెదుర్కొన వలసిన క్లిష్టసమస్యలలో, హిమ, తుషార, శైలము, లనెడి త్రివిధావరోధములు. పెనుభూతముల వంటివి. ఇవన్నియు ఋతుధర్మముల ననుసరించి, గ్రొత్తరూపములఁ దాల్చుచు, నారోహకుల ముందడుగు వెట్ట నెత్త రానీయనట్టి యడ్డంకుల గడ్డుగ నొడ్డుచుంటఁ, బీడఁ జేయరాని సమస్యలై తన్నైపుణ్య ప్రకటనావశ్యకతను గల్గించుచుండును. దానఁజేసి యెంత పూర్వానుభవ మున్నదో, యంత లాభముగలదు. ఆల్ప్సు పర్వతారోహకులకీ యనుభవ మపారము. కావున వారిచేరిక వాంఛనీ యము. విశేషించి హిమాలయ పర్వతారోహణానుభవమే యవసరము వాంఛనీయమును గాన, నట్టివారికే యీదశమునఁ బ్రవేశ ముండ వలయును.

కాగా, శరీరదార్ఢ్యమొక కొలత బద్ధమై యున్నది. ఎవరెస్టు శిఖ రారోహకులు మిక్కిలిబరువైనవారుగా నుండరాదని పలువురి యభి ప్రాయము. ఉన్నత సానుతలముల నధిరోహించునపుడు శరీరమెంత తేలికయైన నంత సులభముగ నుండుటయే యీ యభిప్రాయమునకు మూలకారణము. కాని యన్నిఁటికన్నను నిర్మలారోగ్యమే తదా రోహకులకు బరమావశ్యకమని సర్ జాన్ హంట్ తీర్మానించెను.

పై సూత్రములేకాక యెవరెస్టు యాత్రలోఁ బాల్గొనఁ దలఁ చిన వ్యక్తులఁ బ్రత్యేకముగ సందర్శించి వారి ప్రజ్ఞావిశేషముల నర యుటకూడ నొక ముఖ్యసూత్రముగ నాయకుఁడు నిర్ణయించి తన

దళము నెన్నికొనెను. విదేశీయు లెందఱికో యీ యవకాశము లభింప దయ్యెను. న్యూజిలాండు వాస్తవ్యులగు నిరువురు పర్వతారోహకుల విషయమున మాత్ర మీ సూత్రములు నియమముగఁ బాటింపఁ బడ లేదు. కారణమేమన వారి సామర్థ్య శక్త్యనుభవములు షిప్టన్ వంటి సిద్ధహస్తుల ప్రశంస లందుటయేకాక, వారి చేరిక యనివార్య మని భావింపఁ బడెను. ఇట్లుండఁ బర్వతారోహకుల యెన్నికలో మఱొక సమస్య యుద్భవిల్లెను. ఎవరెస్టు యాత్రిక దళ మంతర్జాతీ యతా సూత్రముపై నెన్నఁబడవలయునా? లేదా? యనునదే సమస్య! బహుదేశములనుండి బహుసంఖ్యాకులీ యాత్రఁ జేయ నుత్సహించిరి. వారి ధీసాహసలక్షణము లంత సులభముగాఁ ద్రోయ రానివి. జెక్కో స్లోవేకియా దేశీయుఁడును, బ్రఖ్యాతిఁ గాంచిన పఱుగు జెట్టియును, నైన జాటోపెక్ (Zato pek) ఈ కార్యము కోసము స్వదేశ పౌరసత్వ మును వదలికొని, యాంగ్ల పౌరసత్వమును స్వీకరించుటకు గూడఁ దన యంతరాత్మ నొప్పించెను. అయినను జిరకాల మీ యత్నములలో ముఖ్యముగఁ బాల్గొను వా రాంగ్లేయులే యగుట, దీని నంతర్జాతీయ తాసూత్రముతో ముడి పెట్టు టనవసర మను భావము పలువురలోఁ బ్రబలియుంటను, సమితి వారీ సమస్యను వీలైనంత సంకుచితముగాఁ జేయసమకట్టి, చిట్టచివరకు, కామన్‌వెల్త్ దేశములకు మాత్ర మిందు స్థానమిచ్చు టుచితమని తీర్మానించిరి. ఎట్టకేల కీ సూత్రముల సమన్వయ పఱచి 1952 నవంబరు ప్రథమ దివసము నాటికిఁ బది మంది సభ్యుల నెన్నికొనిరి. వీరుగాక యొక వైద్యునిఁ గూడ దళమునఁ జేర్పవలసి వచ్చెను. వారి నామాది విశేషము లీ క్రింద విశదీకరింపఁ బడినవి.

ఛార్లెస్ ఇవాన్స్. యఫ్. ఆర్. సి. యస్. వయస్సు ముప్పది మూడు సంవత్సరములు. పొట్టిగను, గాయవాటుగను, నుండును. ఆనాటి కతఁడు లివర్‌పూల్ నగరమున వాల్టన్ వైద్యా

లయ శస్త్ర చికిత్సకుఁడుగ నుండెను. తన యుద్యోగ ధర్మము నిర్వహించుచునే యితఁడు ముమ్మారు హిమాలయమునకు వెడలెను. టిల్‌మన్ నాయకత్వమున 1950, 52, సంవత్సరములలో హిమవత్పర్వత శిఖరారోహణం గావించెను. షిప్‌టన్‌తో (cho oyou) 'చో వో యు' శిఖరము నధిరోహించెను.

టాం బోర్డిలాన్ వయ సిరువదేనిమిది శరత్తులు. ఆజానుబాహుఁడు. ఎరిక్ షిప్టన్ అనుచరులలో నొకఁడు. 1951, 52, సంవత్సరములఁ దుహినాద్రి సానుదేశముల నధిగమించినవాఁడు. చో వో యు శిఖరారోహణమునఁ బ్రాణ వాయువు నుప యోగించెను. ఆల్ప్సు పర్వతారోహణమం దితని కనుభవము గలదు. రాకెట్ మోటారు యంత్రాభివృద్ధికై యితఁడు కృషి సల్పుచుండెను.

ఆల్‌ఫ్రెడ్ గ్రిగరి, బ్లాక్ పూల్ నగరమునఁ బ్రయాణ శాఖ (Travel agency)డైరెక్టరుగా నుండి చోవోయు శిఖరారోహణలోఁ బాల్గొనెను. బక్కపలుచని వాఁడు కాని దృఢ గాత్రుఁడు. ఈతని వయసు నలువది కొక్కటి తక్కువ. ఆల్ప్సుపర్వతారోహణానుభవజ్ఞుఁడు.

ఛార్లెస్ వైలీ, ఇతఁడు ప్రారంభము నుండియు నెవరెస్టుసమితి కోరికపై వస్తుసంపాదనాది కార్యనిమగ్నుఁడై యున్నవాఁడు. గుర్ఖా సైన్యమును నొకానొక యుద్యోగిగ నితఁ డుండెను. ఇంచుమించుయుద్ధకాలమంతయు జపానుయుద్ధము ఖైదుగ నుండెను. ఇతని వయసు ముప్పదిరెండు సంవత్సరములు. ఆల్ప్సుపర్వతారోహణానుభవమే గాక బ్రిటిష్ పర్వతారోహణా భవమునుగలదు.

మైకేల్ వెస్ట్ మేకట్ యిరువ దేడేండ్ల యువకుఁడు. హిమాద్రి సానుతల దేశపరిచయము లేనివాఁడు. ఆక్స్‌ఫర్డు విశ్వ

విద్యాలయ పర్వతారోహణ సంఘము మాజీయధ్యక్షుఁడు. ఆల్ప్సుపర్వతములలోఁ గొంత యనుభవము సంపాదించినవాఁడు. మంచిచురుకైన పర్వతారోహకుఁడు.

జార్జి బ్యాండ్, ఇరువది మూడేండ్ల యువకుఁడు. ఇతఁడే యాదళమునఁ గడుంగడు పసివాఁడు. ఈతని యాల్ప్సు పర్వతానుభవ మత్యంత ప్రశంసాపాత్ర మగుటచే వయఃపరిమితి సూత్ర మీతని పట్ల నుల్లంఘింపఁబడెను. ఇతఁడును ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ పర్వతారోహణ సంఘము మాజీయధ్యక్షుఁడు.

విల్‌ఫ్రెడ్ నాయిన్ ముప్పదినాల్గు వర్షముల వయసుగలవాఁడు. గ్రంథకర్త. ఉపాధ్యాయుఁడు. ఆల్ప్సు పర్వతములఁ బ్రశంసార్హములైన యారోహణాది కార్యముల సాధించి మన్ననలకుఁ బాత్రుఁడయ్యెను. ద్వితీయప్రపంచ సంగ్రామమునఁ గాశ్మీరదేశవైమానికులకు బర్వతారోహణ విద్యఁ గఱపుచుండెడివాఁడు. సర్ జాన్ హాంట్ వద్దఁ గూడ గొంతకాల మితఁడు పనిచేసెను. సిక్కిమ్‌లోని పాహున్రీ (23,400-అ), గర్వాల్ శిఖరముల నధిరోహించెను.

జార్జి లో, వయసిరువదెనిమిది సంవత్సరములు. ఇతఁడు న్యూజిలాండ్ దేశీయుఁడు. స్వదేశీయుఁడైన హిల్లరీ కన్న మున్నే యితఁడు పర్వతారోహణ మారంభించెను. మంచు కొండల నెక్కుటలో నితని కనుపమాన ప్రజ్ఞావిశేషములు గలవు. న్యూజిలాండ్ పర్వతము లీతని యనుభవమున కాస్పదమయ్యెను. దృఢ దీర్ఘకాయుఁడు. షిప్టన్‌తో- చో-ఓ-యూ శిఖరారోహణఁ జేసెను. హేస్టింగ్స్ పట్టణమునఁ బ్రాథమిక పాఠశాలలో నుపాధ్యాయుఁడుగా బనిఁజేయుచుండెను.

ఎడ్మండ్ పెర్సివల్ హిల్లరీ న్యూజిలాండ్ దేశీయుఁడు. తండ్రి మిస్టర్ పెర్సివల్ అగస్టస్ హిల్లరీ. వీరివృత్తి తేనెటీఁగలఁ బెంచి తేనె

మొగుమతి సేయుట. ఆక్లెండ్ పట్టణము వీరి నివాసస్థలము. హిల్లరీ వయసు ముప్పది మూడు సంవత్సరములు. అతఁడు పొడవరి. ద్వితీయ ప్రపంచ సంగ్రామమునకుఁ బూర్వ మాతనికిఁ బర్వతారోహణానుభవ మేలేదు. యుద్ధ పరిసమాప్తి యైనంతనే యతఁడు పర్వతారోహణ విద్య నభ్యసించ మొదలిడెను. న్యూజీలెండ్ దేశీయ పర్వతారోహక దళముతో నాతఁడు హిమాలయ మధ్య సీమఁగల నెత్తముల నధిరోహించి విశేషానుభవము గడించెను. నాటినుండి గొప్ప పర్వతారోహకుఁ డని యతఁడు ప్రఖ్యాతి వడసెను. అతని కీర్తి ప్రతిష్ఠలు దేశములో నలు మూలలఁ బ్రాకినవి. క్రీ. శ. 1951, 52, సంవత్సరములలో ఎరిక్ షిప్టన్ నాయకత్వమున హిమాలయములకు వెడలిన దళముల వెంటిలో హిల్లరీ పాల్గొని స్వీయ ప్రజ్ఞాపటుత్వములఁ బ్రకటించి నాయకుని మన్ననలకుఁ బాత్రుఁడయ్యెను. అజ్ఞాతావరోధముల నెన్నెని, నకుంఠిత శౌర్యోన్నతులతో నీత డతిక్రమింపగలడు.

ఇక కల్నల్ సర్ జాన్ హంట్, నాఁటికి నలుబదిరెండు. బ్రిటిష్ సైనిక దళములో నొక యున్నతోద్యోగిగా నుండి జర్మనీలో నుద్యోగ ధర్మము నిర్వహించుచుండె. తన పదునైదవయేట నితఁ డాల్ప్సు పర్వత శిఖరమొక దాని నధిరోహించెను. మంచునేలపైఁ బ్రత్యేక పాదరక్షలతోఁ బరుగిడుటలో Ski-ing గూడ నతని కెంతయో యనుభవము గలదు. ఇండియాలో సైనికోద్యోగిగ నుండుటచే ముమ్మారు హిమవత్పర్వత యాత్రల బాల్గొనెను. ఇంతియుగాక యుద్ధ కాలమందును యుద్ధేతర కాలమందును, బర్వతారోహణ క్రియల నితఁడు ప్రముఖ పాత్ర వహించుచుండెను.

పై సభ్యులతో నారోహక దళమేర్పడెను. ఈ దళమునకారోగ్య విధుల నేర్పి యథోచితౌషధ సేవా సాహాయ్యమొనర్చుటకై 'మైకేల్

వార్డ్ ' అను నిరువదేడులవయసు గలవైద్యునిఁ జేర్చుకొనవలసివచ్చెను. ఇతఁడును బర్వతారోహణ కౌశలముఁ గలవాఁడే. ఎవరెస్టు దక్షిణ ముఖ పర్యవేక్షణాభిప్రాయమునకు బీజము నాటిన దితఁడే. ఎరిక్ షిప్టన్ వెంట బర్యవేక్షణా దళమున నితఁడుఁ బాల్గొనెను. అవసర మైనచోఁ బర్వతారోహణకైనను సంసిద్ధుఁడే.

ఇంకను 'మెడికల్ రిసెర్చి కౌన్సిల్', 'కంట్రిమన్ పిల్మ్సు లిమిటెడ్'., అను సంస్థలు మఱిద్దఱను దళములోఁ జేర్చుకొనవలసినదిగాఁ గోరెను. వీరిలో మానవశరీరశాస్త్రజ్ఞుఁడైన గ్రిఫిత్ ఫ్యూ, ఒకఁడు, 'ఛోవోయు' శిఖరారోహణ దళము వెంట నితఁడు గూడ వెడలెను. కాన, నాతని చేరిక సైతము వాంఛనీయమే. చలన చిత్ర సంస్థ తరపున 'టామ్ స్టో బార్ట్' దళమునఁ జేరెను. ఇతఁడు శిఖరారోహణ కార్యమునఁ జలన చిత్రముగఁ దయారు చేయుటకై పాల్గొనెను. ఇతః పూర్వ మితఁడు కొన్ని దళములఁ గలసి, హిమాలయ, ఆఫ్రికా, అంటార్కిటిక్, ఉత్తరక్వీన్సులాండ్, సీమలకుఁ జలన చిత్రము దీయుట కేఁగెను. వీరు గాక యాత్రికదళమునఁ జేరవలెనని యుబలాటపడు కొందఱిని అవసరమైన నుపయోగించు కొనుటకై ప్రత్యేకించియుంచిరి. అట్టివారందఱును బ్రయాణసన్నాహ కార్యముల సాయపడుచుండిరి.

యాత్రికదళ మేర్పడినది మొదలు వస్తుసంగ్రహణాది కార్యముల వేగము హెచ్చనారంభించెను. పర్వతారోహకు లెల్లరుఁ బ్రయాణోత్సాహ సంభ్రమ చిత్తులై యూపిరిఁ బీల్చుటకైన వ్యవధిలేక కార్యములఁ బూర్తిసేయుచుండిరి. యాత్రిక దళములతో వివిధ వైజ్ఞానిక వ్యావహారిక రంగముల విస్తారానుభవము గడించి వా రుండుటచే నొక్కొక్క రొక్కొక్క వస్తు స్వీకరణ భారమును వహింపవలసివచ్చెను.

---

# 3

## సేకరణ

పర్వతారోహణాది కార్యము లాధునిక సాంకేతిక విజ్ఞాన సాధనముల సాహాయ్యము వలనఁ గాని సక్రమముగ జరుగనేరవను విషయ మెందఱో యనుభవజ్ఞులే బుజువు వఱచిరి. అందునను హిమ వన్నగర శిఖరారోహణ కుత్తమ సాంకేతిక సాధనములు మిక్కిలి యవసర మయినవి.

సాంకేతిక వస్తు సాధనముల నీక్రింది విధముగఁ విభజించిరి. పర్వతారోహణ కవసరమైన యారోహకుల వేషములు, తాత్కాలిక నివాసముల కవసరమైన గుడారములు, నాహారపానీయములు, వార్తా ప్రసార సంగ్రహణాదియంత్రములు, నౌషధాది వైద్యవిశేషములు, ఛాయాగ్రాహక సాధనములు, ప్రాణవాయు యంత్రములు, మొదలైనవి. హిమవత్పర్వతములవంటి యత్యున్నత ప్రదేశముల శీతోష్ణ పరిస్థితులు విచిత్రముగ నొప్పుట లోకవిదితమే. వాతావరణ వైపరీత్య మచ్చోట వర్ణనాతీతమై యుండును. కావునఁ దత్ప్రాంతముల సంచరింప వలసినచో శైత్యోపశమన సాధనములఁ దప్పని సరిగ సమకూర్చుకొనవలయును. అట్టిసాధనములు శాస్త్రనిబద్ధమైన పద్ధతిలో నారోహకులు సిద్ధము సేసికొని పురోగమింప నుద్యుక్తు లౌదురు. శైత్యోపశమన సాధనములతో, వస్త్రములు, గుడారములు, పడక సంచులు, నాహారపానీయములు చేరియున్నవి. సాధారణముగ శైత్య, మున్నత స్థలముల కరుగుకొలఁది హిమానిల సహితమై తీవ్రతమ మగుచుండును. అట్టి బాధలలో మంచుకొఱుకు (Frost Bite) దృష్టి మాంద్యము, నాయాసము నీరసములు ముఖ్యములు. వీనిలో

నొక్కొక్కటియే పర్వతారోహకుల ధైర్యోత్సాహముల నడలించి, నిర్వ్యాపారాసక్తులఁ జేయఁగలదు. అట్టి యెడ నివన్నియు నేకమైన నిటఁ జెప్పవలయునే! కనుక నీ శీతబాధా నివారణార్థము నవ్య శాస్త్రీయ పద్ధతులలోఁ దేలికగాఁ బెనుగాలినైనఁ జొరనీని నిలన్ వస్త్రములతోఁ దయారైన సూట్లను లోపలధరింతురు. ఇవిగాక యున్నతస్థలములలో మంచువలనఁగాని, గాలివలనఁగాని, బాధలేకుం డుటకై మఱిరెండు ఉన్నిసూట్లు, చొక్కాలు, తలపై కప్పులు వారు ధరించవలసి యుండును. ముంజేతి తొడుగులు గూడఁ జాల యవ సరము. లేకున్నఁ జేతివ్రేళ్లు హిమహతము లగును. (Frost Bitten) మొదట సిల్కు తొడుగులను వదులుగాఁ జేతులకుఁ దొడిగి వానిపై నున్ని తొడుగులు, నామీఁద వాయు రక్షకములగు నిలన్ వస్త్రములు (Wind proofs) తొడుగుదురు. వీనివలన శరీరమునకు వెచ్చఁ దనము గలుగుచు గాలి విసరుల వలని బాధలు తొలఁగును.

పర్వతముల నారోహించు నపు డచ్చటచ్చట బర్వత నితంబ ములపై దాత్కాలికావాసము లేర్పఱచుకొనవలసియుండును. ఎవరెస్టు పర్వత పరిసరములలోఁ బ్రచండ శీత మహావాతములు వీచుచుండుటచే నావిజృంభణ కెదురొడ్డి నిలుచు బలిష్ఠమైన గుడారములు గావలసి యున్నవి. ఉత్తర దక్షిణ ధ్రువ పరిశోధనా దళము లుపయోగించు ఆర్కిటక్ గుడారము లెంతయో యుపయోగ్యములు. ఇవి తేలిక, వెచ్చఁదనము, గాలి విసరుల కెదుర్కొను లక్షణములుఁ గల్గియుండ వలయును. ఉన్నతస్థలములలో ననుకూల స్థలాభావమెక్కువగ నుం డునుగాన, నిద్దఱకు మాత్ర ముపయోగపడు వటకుటీరముల యవసర మెంతేని కలదు. దానఁజేసి నూలు నిలన్ వస్త్రములతోఁ (Meade) మీడ్, గుడారములను, బది పండ్రెండుగు రుండుటకు వీలైన పెద్ద

గుడారములను సేకరించిరి. ఇవన్నియు నూత్న పరిశోధనలు జరిపినమీఁదట నిర్మించిన వగుటచే నెవరెస్టు వాతావరణము నోర్చుకొనఁగలవు. ఇవి విడఁదీసిన గోపుర కుంభాకారముల నుండునట్లు తయారు చేయఁబడెను.

పర్వతారోహకులు, రాత్రుల నిద్రించుటకుగాని, పగటిపూట విశ్రాంతిఁ గైకొనుటకు గాని, సుఖనిద్రనిచ్చుటకుఁ బడక సంచు లను సాధనము లున్నవి. వీరి కొక్కొక్కరికిని రెండేసి సంచులుండును. వస్త్రములతో నేసిన యీసంచులు శైత్యము నరికట్టఁగలవు. వెచ్చని సంచులలో దూరి వారు సుఖనిద్రఁగూరుదురు. నేలపైఁ బఱచుటకుఁ గాని, యవసరమైనచో గుడారముల నిర్మించుటకుఁగాని, మంచువాన లచే వస్తుచయము తడిసి చెడకుండుటకు గాని టార్పాలిన్ జమ్ఖానా లవసరములు గాన వానినిఁ గూడ సేకరించిరి.

ఇఁకఁ బాదరక్షలు. సుమా రిరువదివేల యడుగుల యెత్తు కెక్కిన మీఁదట మంచు కొఱుకుచేఁ బాదములు బాధ పెట్టును. దాని వలనఁ బ్రత్యేకమైన బూట్లు వలసిన పరికరములు. వీని కుండ వలసిన ముఖ్య లక్షణములు: తేలిక, మన్నిక, యనునవి రెండు. పర్వతముల నారోహించు నపుడుఁ బర్వతారోహకు లెంత యల్పభార ముల మోసిన, నంత సుఖముగ ముందుకు సాగి పోఁగలరు. ఉన్నత ప్రాంతములలోఁ బాదములపై నొకపౌను బరువు భుజములపై నైదింటికి సమానముగావున బూట్లు వీలైనంత తేలికగ నుండుట యవసరము. కావుననే మన్నిక, తేలికలలోఁ దేలికయే ముఖ్యమని రూఢిపఱచిరి. మంచుపై నడచు నపుడు జారకుండఁ గాలు నిలువఁ ద్రొక్కు కొన వలయును. అందుకై బూట్ల యడుగున నాలుగైదు మేకులు బిగిం చిన యినుపరేకుఁ (Crampoon) దగిలింతురు. కొన్ని సందర్భముల మంచుపైన బూట్లతోనే మెట్లు చెక్కవలసి వచ్చును; గాన మన్ని కయు నవసరమే. ఒకొక్కపరి బూట్లు మొద్దగట్టును; గావున

హిమజలస్పర్శ వానికుండఁ దగదు. నవీన పరిశోధనలతోఁ గ్రొత్త నమూనాల బూట్లు తయారుచేసి (–40° C) మైనస్ నలుబది సెంటి గ్రేడ్ డిగ్రీల శీతోష్ణస్థితులలో వానిఁ బరీక్షించి, తృప్తిఁజెందిరి. అయి నప్పటికి, శిఖరారోహణలో నవి తడిసి ముద్దఁ గట్టినవి. మధ్యలో హఠాత్తుగఁ జెడిపోయినచో, వానిని బాగుసేయుటకు ఎల్‌ప్రిడ్‌నాయిన్ తరిఫీదుఁ బొందెను. గాలి పఱుపులు (Air mattresses) కూడ వారి కవసర మయ్యెను. పర్వతారోహకు లుపయోగింప వలసిన వస్తువుల జాబితాలో మంచు గొడ్డలి (Ice axe) ముఖ్యమైనది. ఉన్నత పర్వ తోపరిభాగములు సాధారణముగ హిమాచ్ఛాదితములై యుండును. అట్టిచో మెట్లు చెక్కికొనుచు వానిపై గాలూని చేతిబెత్తము వలె నుండు గొడ్డలిపట్టుతో, నాగొడ్డలినే మంచులో దిగఁ గ్రుచ్చి దాని యాధారమునఁ దిన్నగఁ బైకిఁ బోవలయును. పర్వతారోహకు లందఱ కిట్టి గొడ్డలి యొకటి మిక్కిలి యవసరముగ నుండవలయును. పర్వత మారోహించు జట్టునకు మార్గ దర్శకుఁ డిట్లు మెట్ల నెక్కుచుఁ బురో గమించుచుండ, వెనుక వచ్చువా రా మెట్ల నెక్కుచు సులభముగ సాగిపోవుచుందురు. ఈ గొడ్డలి కొకవైపు మంచులో గ్రుచ్చుట కనువుగ లావైన మే కొకటియు, మఱొకవైపున మెట్లు సెక్కుటకు కీలుగా వాడియైన యింకొక రేకు, నమర్పఁబడి యుండును.

పర్వతారోహక దళములో సభ్యు లెల్లఱును బొడవైన గట్టి త్రాడుతో, నొకరి నొకరు బంధించి కొని యుందురు. ఈబంధము పర్వతారోహణ కార్యమునఁ బాల్గొను వ్యక్తుల భద్రత కొఱకై యున్నది. పర్వతము లెక్కవలసినపుడు గాని, దిగవలసినపుడు గాని, పొగ మంచు గ్రమ్మినచో ముందునడచు వారి త్రోవఁ గనుగొనుటకు గాని, యెవరేని జారినపుడు ప్రమాదము వాటిల్లకుండుటకుగాని యీ త్రాడు మిక్కిలి యుపయోగపడును. ఇది కొన్ని వేల యడుగుల పొడవు

గలదిగాయె యుండెను. త్రాళ్ళవలెనే త్రాటి నిచ్చెనలు గూడ నిట్టనిడివిగాఁ జాలమెత్తయిన మంచు నెత్తములను, బ్రహ్మాండమైన శిలలను, నెగఁబ్రాకవలసినచో నుపయోగించుదురు. హిమవృష్టి ఫలితముగఁ బర్వతారోహకులకు ద్వంద్వదృష్టి, దృష్టిమాంద్యములు గల్గుచుండును. తన్నివారణార్థము కంటియద్దముల (Ice glasses) వాడుదురు.

పర్వతారోహణమున నచ్చటచ్చట హిమానీనదుల దాటవలసి యుండును. ఇట్టివి మహాప్రమాదభరితములు. వాని యుపరిభాగములం దచ్చటచ్చట నతివిస్తీర్ణమైన బిలద్వారము లుండును. కొన్నిటనివి చాల లోతుగ నుండును. ఇవి యున్నటులుండి పూడికొనుట, క్రొత్తవి యేర్పడుట సర్వసామాన్యములే. అట్టి బిలద్వారముల దాటవలసి నపు డిదివఱలోఁ ద్రాళ్లవంతెనలు, త్రాళ్లనిచ్చెనలు, నుపయోగించెడివారు. కావున ముప్పది యడుగుల నిచ్చెన యొకటి తేలికయైన యెల్యూమినియం లోహముతోఁ గ్రొత్తగఁ దయారుచేసిరి. దీనిని బిలము వెడలుపు ననుసరించి సర్దుకొన వీలగునట్లును, నాలుగు భాగములు గలిగి ముడుచుటకు వలను గలుగునట్లుగ నిర్మించిరి. ఎటనేని బిలముల దాటవలసినచో నీ నిచ్చెన రెండంచులమీఁద వేసి, సులభముగ దాటనగును. దుర్భిణీయంత్రములు గూడ నవసరములయ్యెను. పర్వతారోహణ కార్యము నాలుగు మాసములకు మించక జరుగవలసి యుండును. అంతకాల మారోహక, వస్తువాహక దళములకు వలసిన యాహారసామగ్రి ముందుగనే సిద్ధము జేసికొనవలెను. శిబిరములలో నిత్యము వంటచేసికొనవలెను. గాన వంటపాత్రలు గావలయును. ఉన్నతస్థలములలో వంటచెఱకు లభ్యముగాదు. కనుక స్టవులు, కుక్కరులు, గావలసిన వగుట, వీలైన తేలికగ నుండి త్వరగ నుష్ణము గ్రహించి, దీర్ఘకాల మాయుష్ణమును నిలుపుకొనఁగలవిగఁ బరిశోధనానంతరము గ్రొత్తగఁ దయారుచేయించిరి.

పర్వతారోహకుల యాహారపానీయముల నొకింత గమనింతము. ఇంగ్లండులోనే వివిధవస్తువులు, పానీయములు సమకూర్పఁబడెను. గడ్డపాలు, పాలగుండ, ఓట్లగంజి (Porridge Oats), బిస్కత్తులు' రొట్టెలు. మెమికన్ రొట్టెలు, తేయాకు, సూప్, చాకలెట్లు, వెన్న, పండ్లగుజ్జు, పంచదార బిళ్లలు, సారాయి, ఎండఁబెట్టిన పండ్లు, మొదలైనవి డబ్బాలలో దాచియుంచిరి. ఇవిగాక హిమవత్పర్వతములలో దొరకు బియ్యము, బంగాళాదుంపలు, పప్పులు, నెయ్యి, త్సాంపా, బార్లీగంజి, కోడిగ్రుడ్లు, మాంసము, పండ్లు మొదలైనవి యవసరమున కనుగుణముగఁ గొనుటను దీర్మానించిరి. పర్వతములపై శిబిరస్థాపనానంతర మారోహణాది వార్తలఁ బరస్పరమందఁజేసికొనుటకు నిస్తంత్రీయంత్రములు సేకరించిరి. శిబిరముల నడుమ వివిధ వార్తాప్రసరణార్థమే గాక, వాతావరణ పరిశోధనాలయమునుండి వాతావరణ పరిణామవార్తలు సంగ్రహించుట కీ యంత్రములు చాల నుపయోగ పడును. పర్వతారోహణ కార్యక్రమమును బ్రకృతి నిత్య వినూత్న శోభను బర్వతశిఖరముల యాకారాది రూపరేఖలును, ఛాయాగ్రాహక యంత్రముతోఁ జిత్రరూపమున గ్రహింతురు. పర్వతముల పరిస్థితులను, బరిశీలించుట కీ చిత్రములు మిక్కిలి యుపయుక్త మగుచుండును.

అతిశైత్యముచే నూపిరితిత్తుల యారోగ్యము చెడును; గావున వానికిఁ దగిన వేడిమినిచ్చు టవసరము. పర్వతారోహకు లుపయోగించు వివిధవస్త్రము లీ లోపమును దీర్చును. సుప్రసిద్ధ వైద్యులు, హిమాలయసీమలో ద్రవరూపమైన యాహార మెక్కువగఁ దీనుకొనవలయునని సూచించిరి. ఇట్టి సూచనలు, సలహాలు, నౌషధములు, ముఖ్యావసరములుగాన, నౌషధములను గూడ వస్తుచయపట్టికఁ జేర్చిరి.

ఇక (బ్రాణవాయూత్పత్తి సాధనములు జూతము. ఎవరెస్టు శిఖరారోహణలోఁ (బ్రాణవాయు వవసరమని విశ్వసించి, యభిమానించి, యావాయు సాహాయ్యముతో శిఖరారోహణఁ బ్రయత్నించి తద్విశేష ప్రయోజనములఁ జాటించిన పర్వతారోహకుడుఁ జార్జిఫించ్ అనువాఁడు. ఇతఁడు, 1922 లో నెవరెస్టు యాత్రలోఁ బాల్గొనెను. అప్పటినుండియుఁ (బ్రాణవాయు ప్రయోజనము నెల్లరుఁ దెలిసికొనిరి. తెలిసికొని, వెంట నిడికొని, యారోహణ కార్యముల సాగించిరి; గాని, దానిని విశేష ముగ వాడినది లేదు. ప్రస్తుత యాత్రలో నీసాధన మధిక(ప్రాధాన్యము వహించినది. అసలీ సాధన మేల యవసరమో ? యెఱుఁగవలయును. హిమాలయమువంటి యున్నత(ప్రాంతములలో సంచరించవలసినచో, శరీరాయాస మెక్కువై యుచ్ఛ్వాస నిశ్వాసములు శ్రమతోఁగూడిన వగును. ఆ యా స్థలముల వాయుసాంద్రత పలుచనగుటచే నందలి (ప్రాణవాయు వల్పముగ నుండును. ఆ గాలి పీల్చినచో శరీరమునకు వలసినంత (ప్రాణవాయువు లోనికిఁ జేరదు. అందుచేఁ బర్వతారోహ కుల శారీరక మానసిక శక్తు లుడిగి మితిలేని (ప్రాలు మాలికగలుగును. అట్టిస్థితిలోఁ బర్వతారోహకులు పురోగమించలేరు. అంతకన్నఁ దిరోగమించనులేరు. వారి పరిస్థితి త్రిశంకు స్వర్గమురీతి యగును. ఈస్థితి మహా(ప్రమాదకరము గావునఁ గృత్రిమ సాధనముల ద్వారా (ప్రాణవాయువును జనింపఁజేసి దాని నుపయోగింపవలయును. (Open-circuit oxygen appartus, closed circuit) అన నీ కృత్రిమ సాధనములు రెండువిధములు. వీనినే తెనుఁగున 'బాహిర్వ్యాహిక సాధనము – అంతర్వ్యాహిక సాధనము' నని చెప్పెదరు. బాహిర్వ్యా హిక సాధనములోఁ బర్వతారోహకుని వీపునఁ (బ్రాణవాయు పూరిత మైన ఎల్యూమినియము సీసాలు రెండుమూఁడుండును. ఆ సీసాలనుండి రాగిగొట్టము ద్వారా పర్వతారోహకుని శిరస్త్రాణములోనికి (బ్రాణ

వాయువు వెడలును. అంతట నది గాలిలోఁ గలియఁగా దానిని వారు పీల్చెదరు. అంతర్వాహిక పద్ధతిలోఁ బర్వతారోహకులు వాయు సంపర్కములేని పరిశుద్ధ ప్రాణవాయువునే రాగిగొట్టము ద్వారా పీల్చెదరు. అట్లు పీల్చఁదగిన ప్రాణవాయువును గొద్దిగొద్దిగఁ గొంత కాలము వఱకు నుపయోగింతురు. అందుచే నిట్టి సీసాలు కొలదిగఁ జాలును. కాని యీపద్ధతి యింకను దోషరహితమైనట్లు ఋజువు గాలేదు. నిద్రావస్థఁ గూడఁ బడకసంచులలోఁ బ్రాణవాయువును సేవించవలసిన యగత్యము, నవసరమును గలదు.

ప్రాణవాయువులఁ బీల్చుట వలన ముఖ్యముగ నారోహణాయాసము, గాళ్ల దుర్బలత, నీరసముఁ దొలఁగి హాయినిఁ గలిగించును. ఓపికను హెచ్చించును. సుఖనిద్ర నిచ్చును. పై రెండు కృత్రిమ పద్ధతులలో, మొదటిదే పర్వతారోహణ కధికోపయుక్తమని శాస్త్రవిదు లభిప్రాయపడిరి. ఇంకను నున్నిలాఁగులు, ప్రిమస్సు స్టవులు, బ్యాటేన్ కుక్కర్లు, పురోగమనమార్గ సూచికా పతాకలు, నిలన్ చొక్కాలు, హారికేన్ లాంతర్లు, చిన్నప్రేలుడుబాఁబులు, ఉన్ని చేతి తొడుగులు, ఎల్యూమినియం వంట పాత్రలు, జండాలు, గడియారములు, దిక్సూచి (Compass) యంత్రములు, స్థలముల యెత్తు గొల్చుటకు (Altimetre) ఆల్టిమీటర్ యంత్రము, వాయువేగమును దెల్పు యంత్రము, వాయు పీడనశక్తినిఁ గొల్చు బారమితి, బ్యాటరి దీపములు, ఉష్ణమాపకములు, కాగితములు, మొదలయిన వస్తువు లెన్నియో సేకరింపవలయును.

మఱియొకసారి ఎవరెస్టు శిఖరారోహణఁ దలపెట్టిన మీఁదట దేశములో నొక నూతనోత్సాహము ప్రభవించెను. ఒక్కొక్క దినము గడచిన కొలఁది వస్తుసంగ్రహ క్రమమంతయు వేగముగ పూర్తియగు

చుండెను. యాత్రికబృంద సమావేశములు, వస్తుపరికరముల పరీక్షలు, సిద్ధహస్తుల హితోపదేశములు, పత్రికా రచనలు, రేడియో ప్రసారములు, శుభాకాంక్షలు, మొదలైన వానితోఁ గాలచక్రము గిరగిర తిరుగుచుండెను. నాటి కింకను, స్విడ్జర్ లెండ్, ఎవరెస్టు యాత్రాఫలితముఁ గూర్చి యధికార వార్త లెవ్వియు రాలేదు.

ఇవి యట్లుండ నాహారాదిక విషయములఁ బరిశీలించుటకై డిసెంబరు (1952) మొదటివారమున, ఛార్లెస్ వైలీ, ఆల్ఫ్రెడ్ గ్రెగరి, గ్రిఫిత్ ప్యూ, అనువారల వెంటనిడికొని సర్ జాన్ హాంట్ స్విడ్జర్ లేండు దేశమునకు వెడలెను. ఇంతవఱకు దాము సేకరించిన వస్తుపరికరములతో, ఆల్ప్సు పర్వతారోహణ మొనర్చి, ఫలితములఁ గనుఁగొనవలయు ననియే వారి ప్రయాణ ప్రధానోద్దేశము. మార్గములో, ప్యారిస్ పట్టణమున దిగి, 'అన్నపూర్ణ' శిఖరారోహణ మొనర్చిన దళములో నొకసభ్యుఁడైన, 'గాస్టన్ రిబుఫట్' అను నాతనితో వస్తుపరికరములఁ గూర్చి వారు సంప్రదింపులు జరిపిరి. తదనంతర 'మాల్ప్సు' లోని 'జూంగ్ ఫ్రా, మాంచ్' శిఖర పరిసరములలో శిబిరము నిర్మించుకొని, వస్త్రములు, బూట్లు, గుడారములు, పడకలు, మొదలైన యాహారవస్తువులలో నే వాతావరణమున కేయే వస్తువు లుపకరించునని తెలిసికొనుటయే వారియుద్దేశము. జుంగ్ ఫ్రా, మాంచ్ శిఖరముల నధిరోహించి, స్వదేశమునకు మఱలి 'టామ్ బోర్డిలన్, జార్జిబ్రాండ్, సర్ జాన్ హాంట్,' అను ముగ్గురు పర్వతారోహకులు ప్రాణవాయు సాధనములఁ బరీక్షించు నిమిత్తమై 1953 జనవరి మాసములో వేల్సు పర్వతములఁజేరి కొంత కాలము గడపిరి. ఇది యిటు లుండ స్విస్ ఎవరెస్టు యాత్రికదళము గమ్యస్థానముఁ జేరఁజాలక విరమించి, ద్వితీయ ప్రయత్నము నసాధ్యమని యెంచి, తిరోగమించు

చున్నారను వార్త పైవారి చెవింబడెను. సంవత్సరములో రెండు పర్యాయములు, నెవరెస్టు వాతావరణముతోం బోరిన స్విస్ దళ మనన్య సాహసోపేతమైనది గదా! 1952, వసంతమున శిఖరాగ్రము దవ్వులకేఁగి యందలి వాతావరణ వైపరీత్యమునకుఁ దాళలేక, నైరాశ్య ధూమావృత చిత్తములతో గగన పుష్పతుల్యమగు తదగ్రముపై విచారదృక్కులఁ బ్రసరించుచుఁ బునఃప్రయత్నోద్దేశములు హృదయసీమలఁ జిగురింపఁ శిఖరారోహణము గావించిన రేమండ్ లాంబర్ట్, టెన్సింగ్ సాహసముల విన్న నెట్టి వీరులగుండియ లైనను నీరగును గదా! ఈ వార్త నాలించి సమధికోత్సాహ వికసిత హృదయులై హంట్ ప్రభృతులు స్వదేశమునకు మఱలివచ్చి వివిధ వస్తూత్పత్తి సంస్థలకు నవసరమగు వస్తువుల కాజ్ఞ నిచ్చిరి.

1953 జనవరి మాసారంభమునుండి వస్తుసముదాయము లన్నియు నొక దరికి రా మొదలిడెను. వస్తూత్పత్తి సంస్థలన్నియు వేగముగ వస్తువుల నమర్చి పంపుచుండెను. అట్లు సేకరించిన వస్తువులఁ బెట్టెలలో భద్రపఱచుటకు, ఛార్లెస్, ఇవాన్స్, రాల్ఫ్ జోన్స్, విల్‌ఫ్రిడ్ నాయిస్ అనువారలు నియమితులైరి. ఒక్కొక్క పెట్టె బరువు 60 పౌనులుండును. ఏపెట్టెలో నేయే వస్తువు లున్నవియు, నేయే పెట్టె లెచ్చటెచ్చట నుపయోగింప వలసినదియుఁ గ్రమపద్ధతిని గుర్తుపెట్టి యుంచబడెను. ప్రాణవాయు సాధనములఁ దయారుసేయుటకు వ్యవధిలేమిఁ దదితర వస్తువు లిండియాదేశముఁ జేరిన యనంతరము విమానములపై ఖాట్మాండూ నగరమునకుఁ జేరవేయుట కేర్పాట్లు జఱిగెను.

ఈ యేర్పాట్లీ రీతిని జరుగుచుండ స్విస్ ఎవరెస్టు దళము స్వదేశమునకు మఱలివచ్చి రనువార్త వెలువడెను. వారినిఁ గలసి, సంప్రదించి, వారి యనుభవములఁ దెలిసికొనుట కర్తవ్యమని యెంచి

జ్యూరిచ్ నగరమున జనవరి 28 తేది నాఁడు సర్ జాన్ హంట్, స్విస్ దళనాయకులైన డాక్టర్ షెవల్లీ, లాంబర్ట్, డాక్టర్ ఫ్ర్యూ, అనువారలఁ గలసికొనెను. ఈ సమావేశము చాల ముఖ్యమైనది. స్విస్ దళము శిఖరారోహణలో నుపయోగించిన సాధనములఁ బరిశీలించి వారి యనుభవజ్ఞానము సంపాదించు నపూర్వావకాశము బ్రిటిష్ దళమున కదృష్టవశమున లభించెను. ఇంతలో వస్తువులు డబ్బాలలో భద్రపఱచి పట్టీలు, శిఖరారోహణ పథకములు సిద్ధముచేసి యుంచిరి. కారణాంతరములచే ఋతుపవనారంభాత్పూర్వమే కార్యసాఫల్య మందనిచోఁ బునః ప్రయత్న మొనరింపవలసినదే యని సమితి నిశ్చయించెను. పర్వతారోహకదళ మిండియా గూర్చి తరలుటకు ముందు సర్. జాన్ హంట్, సమితి సభ్యుఁడైన R. W. లాయడ్ వెంటరా, ఎడింబరో ప్రభువు సందర్శనమునకై బకింగ్‌హామ్ రాజభవనమున కేఁగెను. ఎడింబరో ప్రభువు ప్రస్తుత శిఖరారోహణకుఁ దన హృదయపూర్వక శుభాశిషములఁ గురిపించుచు రాజపోషకుఁ డగుట కంగీకరించెను.

1953 ఫిబ్రవరి 12 తేదీ నెవరెస్టు యాత్రికదళము వస్తుపరికరముతో భారతదేశమునకుఁ బయనమైనది. ఆ ముహూర్త మహత్వమెట్టిదో?...మానవులట్లు పరాజయముల లక్ష్యము సేయక, యధైర్యమొందక, మఱల మఱల నీవిధముగఁ బ్రయత్నములు సాగించుటఁ జూడ హృదయపూర్వక యత్నాంతర వర్తనుఁడు భగవంతుఁడను పండితజనులాడు మాట వ్యర్థము గాదని తలంపనగును. అట్టి భగవత్సాహాయ్య మిూమాత్రైన నుండకపోవునే!

---

# 4

# టెన్జింగ్

మఱియొక పర్వతారోహకదళము ఎవరెస్టుపై నేకాదశ దండయాత్ర సలుపుచున్న దనువార్త ప్రపంచము నుత్తేజపఱచినది. ఈ వార్త వినిన పిమ్మటఁ బలుమార్లు మానవశక్తి నోడించిన జడాత్మక వస్తువున కెంతటి యప్రతీక సామర్థ్యాతిశయము కలదో, యెంతటి విచిత్రవిషయమో, యను నాశ్చర్య జనకమైన భావములే గాక దాని నధిరోహింపఁ బూనుట మానవమాహాత్మ్యమునకు గీటురాయి యను భావమును గొందరిలో నుద్భవించినది. అయినను నీశిఖరోహణ క్రీడలో నేధీరవీరులు విజయలక్ష్మినిఁ జేబట్టగలరో యను కౌతుక మెల్లర హృదయములఁ స్పందించుచునే యున్నది. అందుచే నేధీరులు ముందంజ వేసినను వారి నుత్సాహపఱచుచు, వారి చలన వలనములను జాగరూకతతోఁ బరిశీలించుచు, వారి కార్యసిద్ధి నాకాంక్షించెడి సహృదయుల కెన్నఁడును గొదువలేదు. ప్రకృత యాత్రికులను స్వదేశీయులెంతయో గౌరవించి, వివిధరీతుల వారి నుద్రేకపూరితు లగునట్లు చేసి యఖండ శుభాశీర్వచో ధారాపాతము వారిపైఁ గురిపించిరి. ధీరులకు శుభాకాంక్షల కన్న నానందమొనర్చునది యొండేదియు లేదుగదా. పత్రికా రచయితలు, బి. బి. సి. రేడియో టెలివిజన్ ప్రతినిధులు, నీయాత్ర కత్యధిక ప్రచార మొనర్చిరి.

ప్రధాన దళము భారతదేశముఁ గూర్చి వెడలిన పిమ్మట చార్లెస్ ఇవాన్స్, ఆల్‌ఫ్రెడ్ గ్రిగరి, యనువారు విమానములో ఫిబ్రవరి యిరువదియవనాఁడు బయలుదేరిరి. తదనంతరము సర్ జాన్ హంట్, టామ్‌బోర్డిల్లాన్, అనువారును, జట్టచివర గ్రిఫిత్ ప్యూ యనువాఁడును,

విమానములపై నిండియూ చేరిరి. ఛార్లెస్‌లో న్యూజిలాండ్ దేశమును వీడి ప్రధానదళమునకు స్వాగతమిచ్చు నిమిత్తము బొంబాయి రేవుఁ జేరెను. ఎడ్మండ్ హిల్లరీ వ్యక్తిగత కారణములచే మార్చి మాసారంభమున విమానయానమున ఖాట్మాండూ నగరమున కేతెంచెను. ప్రధాన యాత్రిక దళము సామానులతో నోడదిగి రైలు మోటారులలో దీర్ఘకాల మధికశ్రమకోర్చి, పయనించి మార్చి యెనిమిదవ నాఁటికి సురక్షితముగ ఖాడ్మాండూ నగరమును జేరెను. ఆ నగరమున బ్రిటిష్ అధికారవర్గ మీ యాత్రిక దళము నుచిత రీతిని మజ్జన భోజనాదుల నానంద పఱచుచుండిరి. అది వసంతర్తువగుటచే హిమాలయోత్సంగ సీమ నలంకరించిన యా దేశ వాతావరణ మత్యంతాహ్లాదకరముగ నుండెను. హిమాచల శ్రేణీపరివృతమైన ఖాట్మాండూ నగరము యాత్రికులఁ బ్రమోదరస నిమగ్నులఁ జేయుచుండెను. పర్వతారోహకుల మానసవీథుల నెవరెస్టు శిఖరతలాంతరోజ్జ్వల దీధితులు దేదీప్యమానముగ వెలుంగ, విజయోత్సాహ తరంగ డోలికల నూఁగుచు, నానందోద్రేకులై కాలహరణము సైపలేక ప్రతిక్షణముఁ బురోగమ నానక్తులై యుండిరి.

ఎవరెస్టుయాత్ర కవసరమగువస్తుసముదాయ మేడున్నర టన్నుల బరువుతో నాలుగువందల డెబ్బదిమూఁడు పెట్టియలలో నిమిడియుండెను. వీనిని మహోన్నత పర్వతములను, అఖాతములైన లోయలను, భయంకరములైన, సాంద్రారణ్యములను, బ్రచండవేగమున సుడులు దిరుగుచుఁ బ్రవహించు నదులను, నుత్తరించుచు, 'త్యాంగ్ బోచ్' గ్రామమునకుఁ జేర్పవలయును. ఈ భారమును మోయుట కెందఱో కూలీలు వలయును. త్యాంగ్ బోచ్ గ్రామము తాత్కాలిక మూలశిబిరముగఁ బరిగణించిరి. పై వస్తువుల నాశిబిరమునకుఁ జేర్ప నేర్పుగలవారు

షేర్పాలు. వీరి నేర్పాటుసేయ నిండియాలోఁగల హిమాలయన్ క్లబ్ వారిని ప్రార్థింప వా రంగీకరించి మార్చి నాల్గవ తారీఖున సర్ జాన్ హంట్ సందర్శనమునకు షేర్పాల నంపిరి. హిమవత్పర్వతారోహణ గాథలో షేర్పాల పాత్ర యతి ప్రశంసార్హ్యము. వారి సహకారములేని శిఖరారోహణమే లేదనుమాట యుత్ప్రేక్షగాదు. శుష్క ప్రశంసయును గాదు. కావుననే యీ యాత్ర లన్నింటికిఁ బంచప్రాణ సమానులౌ షేర్పాలఁ గూర్చి తెలిసికొనుట మన కృతజ్ఞతాపూర్వక ధర్మము.

అయ్యది నీహారసిక్త గగన చుంబిత శిఖర సానుతల పరివృతమై బుద్ధభగవానుని పుట్టుకచేఁ బునీతమైన నేపాళదేశ ప్రాచ్యసీమ, సోలా ఖుంబూమండలము. వారే అహింసా ధర్మమూర్తి గౌతమబుద్ధుని హృదయకుహరములఁ బ్రతిష్ఠించి నిశ్చలభక్తి పారవశ్యమునఁ బూజించు నమాయిక ప్రజానీకము ; చెరిగిపోయిన చరిత్రలో నెన్నఁడో హిమాద్రి కావల వెలసియున్న టిబెట్టు దేశమునువీడి, తన్నగరశ్రేణులు దాటి, ప్రాచ్యనేపాళ భూమిఁజేరి పరిసర ప్రకృతి శోభారామణీయకమునకు ముగ్ధులై ముందువెనుకలకు నడువజాలక, సాహస మూర్తులు గొంద ఱచ్చోటనే నిలిచిరి. వారే షేర్పాలు. త్వరితగతిని వారి సంఖ్య పెఱిగినది. అచిరకాలమున సాంద్రహరిత గుల్మకుంజ లతా భూజాధిక స్థగితమైన సోలాఖుంబూ లోయలలో దూరదూరముగ నుద్భవించిన కుగ్రామము లీ సాహసమూర్తుల సంతతిచే నిండినవి. ప్రాంతిక నిబిడారణ్య భూములు, లోయలు, పర్వతాంతర విశాలస్ఫాటికవర్ణ ప్రకీర్ణ సానుమయ శిలాహిమధామ పంక్తులు, తరులతానికుంజ పుంజములు, వీరివిశృంఖల వీరవిహారసీమాంతరములు. కేవల మూషరక్షేత్ర మనఁదగు మాతృభూమి టిబెట్టును గాలవశమున వారు విస్మరించిరి. మాతృభూమి

నట్లు మఱచిరేగాని, మాతృభాషను, నిజాచార వ్యావహారిక సంప్రదాయములను, బుద్ధ భగవత్పూజావిధానములను మాత్రము మఱువఁజాలరైరి. మహోన్నత పర్వతోత్సంగవాసముచే నాపర్వతశ్రేణుల కావలి ప్రపంచమేమి చిత్రవిచిత్రముల నలరారుచున్నదో వారికేమియెఱుక ! ఎఱుగవలయు నను కౌతుకము వారికి లేనేలేదు. ఊహాతీతమైన వేగముతో మార్పులుచెందు బాహ్యప్రపంచ మేరీతి నెట్లుపోయినను వారికేమి ? నీలవర్ణహిమవన్నగములఁ జూచుచు, నందు వీచు నిర్మలశీతల పవనములుకొని తెచ్చు నానావిధ కుసుమ విసర సౌరభపరంపరల నానుచుఁ, దరులతాశాఖల నావాసములఁ గలుగఁజేసికొని యానందముప్పొంగ మృదుమధుర కంఠస్వర తరంగము లెగయ గానము సేయు వివిధ శకుంతాది సంతాన సౌందర్యరేఖావలోకనము గావించుచు, వినీలాకాశవారాశిఁ దేలాడు రజతవలయ సూత్రాంచిత శ్యామల మేఘపంక్తిఁ జూచుచు, హృదయసాగరము లుప్పొంగ నర్ధనిమీలిత నేత్రులై ప్రకృతి శోభలం దనివి సనక పానముసేయు షేర్పాల కీ చంచల బాహ్యప్రపంచముతోఁ బనియేమి ? అది వారికెట్లు లెట్టియానందము గూర్పఁగలదు ? వారిదృష్టిలో సోలా ఖుంబూ మండలమే విశాలమహీమండలము. పూర్వాచార సంప్రదాయములనే పవిత్రముగ నెంచి పూజించుట పరంపరానుగతముగ లభించిన వారి విధానము.

సోలా ఖుంబూ మండలము చూడ ముచ్చటఁ గొల్పునదే కాని సుఖ జీవనముఁ బ్రసాదించునదిగాదు. వ్యవసాయమున కవకాశము లచటఁ జాల స్వల్పము. అహోరాత్రములు చెమటూడ్చి పనిచేసినను నర్ధాన్నకుక్షులై యలమటించవలసినదే. మఱి యీయర్ధాన్న భోక్తల కడుపుమంట చల్లారున దెట్లు ? బలిష్ఠమృగములకైన మోయ

శక్యము గాని భారవస్తువుల వీపులపై నిడికొని యిరువదివేల యడుగుల యెత్తులోనుండు నూంగ్పాలా కనుమదాటి టిబెట్టు దేశముఁజేరి, తమ వస్తువుల నచట విక్రయించి వానికి బదులుగ నుప్పుబస్తాలఁ గైకొని గృహోన్ముఖు లగుచుండుట నీషేర్పాలకు వంశానుగతముగ సంక్రమించిన లక్షణము. గురుతరభార వస్తువులమోత కేదైన మృగము నుపయోగింప నగును; గాని షేర్పాలందుల కిచ్ఛగింపరు. అందుల కొక విచిత్రకారణము గలదు. అది వారి మూఢవిశ్వాసములలో నొకటి. నూగ్పాలాకనుమ యధిష్ఠానదేవత యొక తురంగ మనియు, నాదారిని మఱే యితర మృగమైన నడువఁ బ్రయత్నించిన నీర్ష్యాళువగుటచే నా తురంగ దేవత యా శత్రువును దక్షణమే మృత్యువువాతఁ బడఁ ద్రోయుననియు వారి మతము. ఇది మౌఢ్యమో, కాదో మన కేమి? బహుశః ఒకటి, రెండుపర్యాయము లాకనుమ దాటుటచే మృగము లెంతబలిష్ఠమైనను బ్రమాదమున కాస్పద మగునను మాట యొకటి, పైదానిలోని వాస్తవికము గానగునేమో? ఎందుచేనైనను మృగముచే బ్రమోయింపకఁ దామే యెంతటి బరువునైన, నెంతటి కొండనైనను దాటి పోయెదరు. అట్లు మాసముల తరబడి యపరిమిత భారముల కతన శరీరములు విండ్లవలె వంచి, దారితెన్నులు లేని మంచు నేలలు, హిమానీనదులు, క్షుద్రమృగమయారణ్యములు, మహాశ్రమాదకారకములైన లోయలు, మహోద్ధృత నిర్ఝరులు, శిలా సంఘాతములు, కంటకావృత ప్రదేశములును, దాటుచుఁ గడుం గడుదూరము పయనించుట యెట్టికార్యమో భగవంతునికే యెఱుక. స్త్రీపురుష తారతమ్యము లేక ధాన్యములు, కాయలు, కూరలు, పండ్లు వస్త్రములు, పొగాకు, బంచదార, పంగాళదుంపలును పెద్దపెద్ద సంచులలో నింపి, మోసికొనిపోవుటవారికి సర్వసామాన్యమే. అవసరమైనచోఁ జంటిపిల్లలనుగూడ నాతల్లులే పంటల తల్లివలెఁ గడునోపి

కతోఁ దాల్చి పర్వతములఁ బయనించెదరు. ఇఁక నీజీవితములకు సుఖ మెచ్చట! అటులే యాపర్వతసీమల నిట్టి నికృష్ట జీవనము సలుపుట వారికి విధివిహితము గాఁబోలు.

హిమశైల భూమిలోఁ గాయకష్టములకుఁ బొల్పడుటచే వారి శరీరములు శైలప్రాయము లైనవి. జీవిత మెన్నిక్లిష్టసమస్యల వారి నిడుమలఁ బొల్చేయుచున్నను, నేటి కెదురీఁతవలె వాని నెదుర్కొనవలసి యుండుటచే, మితిలేని సహనము, నకుంఠిత కార్యదీక్ష, యచంచల ధైర్యసాహసములు, వారికి యథాగతికముగ నలవడిన లక్షణములు. మహాభయంకర పర్వతముల నడుమ నివసించుటచే వారి జీవిత మెల్లవేళలఁ బ్రమాదభూయిష్ఠమై యుండును. అట్టియెడ నిజ సహజబలసాహస ధైర్యములే వారికి శ్రీరామరక్ష. ఉత్సాహముతో నా భౌతిక ప్రమాదములను జీవితసమస్యలుగా నెదుర్కొనితీరవలయును; గావున నుత్తమగుణము లనాజ్ఞాతముగ నాషేర్పా రక్తనాళములలో జీర్ణించి పోయినవి. వారి విశాలవదనములు, కుఱుచలైన నాసికలు, పసుపుఁబచ్చని గట్టిశరీరములు, సంకుచితావయవములు, మంగోలు జాతి లక్షణముల జ్ఞప్తికిఁ దెచ్చును.

షేర్పాగృహము శిలానిర్మితము. ప్రతియింట రెం డంతస్తు లుండును. పైదాన షేర్పా కుటుంబము కాపుర ముండును. క్రింది దాన నెడ్లు, యాక్ మృగములు నుండును. ద్వారబంధములు, గిటికీలు, దలుపులు, నేలయును, గలపతో నమర్పఁబడును. గృహములో నేమూలఁ జూచిన గృహసామగ్రి కనుపడును; అయినను గృహము చాల పరిశుభ్రముగ నుండును. 'త్సాంపా' యను పదార్థము షేర్పాల ముఖ్యాహారము. బార్లీగింజలను బాగుగ వేయించి మెత్తగఁ బొడి చేసినచో నిది తయారగును. 'చాంగ్' అను బియ్యపుగంజియుఁ,

దేనీరము, వీ రెక్కువగ వాడుకొను పానీయములు. అతిథుల గౌర వించు నపు డీ పానీయము లిచ్చుట వారి కాచారము.

షేర్పాలు స్నేహార్ద్రహృదయులు. అహింసాధర్మాచరణాభి రక్తులు. మతగురువుల మిక్కిలి శ్రద్ధగాఁ బూజింతురు. ఒకప్పుడు హిమవత్పర్వత గర్భకుహరములవీడి పరిసర గ్రామాదులపై దాడిచేసిన మంచుమనుష్యులపట్ల సైతము మీ యహింసాచరణ వ్రతశీలమునే ప్రకటించినా రీషేర్పాలు. ఆ మంచుమనుష్యులు దమ కెగ్గుచేసినను, వారియెడ హింసాత్మక ప్రతీకారచర్యలు నైచ్యాధమామానుష క్రియ లుగాఁ బరిగణించెదరు. త్యాంగ్‌బో పరిసరారణ్యములఁ దిరుగాడు, కస్తూరి, యాక్ మొదలైన మృగముల నేలాటిహింసల పాల్సేయ రాదను నిజమత గురువుల యాదేశములను షేర్పా లక్షే యనుసరింపఁ జొచ్చిరి. అందుచే నావన్యమృగములట స్వేచ్ఛావిహారమున కలవడి నవి. వివాహాది సంతోషసమయములలో షేర్పాలు వికృతవేషములు దాల్చి వింతగొల్పు నాట్యభంగిమములఁ బ్రదర్శించు నృత్యములు సలిపెదరు. ఈనృత్యములలో స్త్రీపురుషులెల్లరుఁ బాల్గొనెదరు.

కొండలోయలలో నహోరాత్రములు కాయకష్టముచేసి పండిం చిన ధాన్యాదులతో వ్యాపారము సాగించుట షేర్పాలవృత్తులలో నొకటియైయున్నది. సాధారణముగ వ్యవసాయదారులే వస్తువాహక వృత్తి నవలంబింతురు. కాని యీ యవకాశము లేనివారు దారిద్ర్య బాధ ననుభవింపలేక కడుపు చేతఁబట్టికొని జన్మభూమిని వీడి డార్జిలింగ్ నగరమునకు వలస వెళ్లుచుందురు. దారిద్ర్య మెంతటి హైన్యగతికి మానవులఁ గొనిపోవునో యీ షేర్పా జీవితము విశదీకరించును. ఆ డార్జిలింగ్ నగరమునఁ బొట్టపోసికొనుటకు నూటొక్క మార్గము లుండుటయే యట వలసకుఁ గారణము. హిమవత్పర్వత శిఖరారోహణ

కార్యక్రమము లెక్కువైనది మొద లీషేర్పాలు డార్జిలింగ్ నగరములో స్థిరనివాసము లేర్పఱచుకొనిరి. దీనికి మఱియొక కారణముగూడ గలదు. హిమవత్పర్వత శిఖరారోహణ యాత్ర లధికమాగాలది వస్తు వాహకుల యవసర మధికమయ్యెను. అందుచే హిమాలయసంఘ మీ షేర్పాలను వస్తువాహక వృత్తి నవలంబింపఁజేసెను. నాటినుండి పాశ్చాత్య నాగరకతావాతపరంపరలు వారిపైఁ బ్రబలి తమ ప్రభావ ముచే వారిని మంత్రముగ్ధులఁజేయ నారంభించెను. సోలాఖుంబూ మండ లము గూడ నేఁటి మార్పునకు దల యొగ్గినది. పర్వతారోహణలో షేర్పాలు సిద్ధహస్తులను విఖ్యాతి ప్రపంచ మెల్లెడలఁ బ్రాకినది. వారి నీ కీర్తి వరించుటకు వారు సహజముగ విశ్వాసపాత్రులు, ధైర్య సాగరులు, నుత్సాహపూరిత మనస్కులు, దృఢగాత్రులును నగుటయే ప్రధానకారణములు. ఈయాత్రఁ బాల్గొని విజయసాధనకు యథోచిత సేవఁ జేసినవారిలో షేర్పా టెన్‌జింగ్‌నార్గే, దా టెన్జింగ్, అనుల్లు, తాండూప్, ఆంగ్ నాంగ్యాల్, దానాంగ్యాల్, పసాంగ్‌ఫుతార్, గోంపు, మింగ్‌మా, దావాతాండూప్, ఆంగ్‌న్యీమా, ప్రభృతులు చిరస్మరణీయులు.

ఎవరెస్టు యాత్రిక దళము ఖాట్మాండూ నగరము జేరిన యనం తరము షేర్పాటెన్‌జింగ్‌నార్గే ఎవరెస్టు శిఖరారోహణ రంగమునఁ బ్రవేశించెను.

ఎవరెస్టు శిఖరారోహణలో టెన్‌జింగు చూపిన యనన్య సాహస విస్ఫూర్తి కచ్చెరువొంది నేపాళసార్వభౌముఁ డాతని కా బిరుదు నొసం గెను. నేపాళభాషలో నీ బిరుదమునకుఁ 'బులి' యని యర్థము. మంచుతోఁ బులిలాగున మహాపరాక్రమ ముప్పొంగఁ బోరుసల్పుటచే మంచుపులి' యను సార్థకనామ మతనికిఁ గలిగెను.

ఈ మంచుపులి సోలా ఖుంభూమండలములో 1914 సంవత్సర మారవనెల జనన మందెను. ఈ వీరుని జన్మభూమి యెవరెస్టు శిఖరము నెదురుజూచు 'తామీ' గ్రామము. దారిద్ర్యమునకు విహారస్థల మాగ్రామము. అందేవో కొలది జీర్ణకుటీరములు మాత్రమే కలవు. ఆ గ్రామీణులకు బేలముఖములు, వేడినిట్టూర్పులు, జీర్ణావయవములు, నుదుటిపైఁ దేలు స్వేదమాలికలు, దైన్యదృక్కులు, సామాన్యములు. ఆగ్రామము నెన్నఁడైనఁ జూడఁబోయినవారికి నాఁగలి భుజముపై నిడికొని కొండచరియలలోనికిఁ బోవు వృద్ధ యువక బృందములు, ద్రొమోత్రమోయు పశువులరీతి వీపున భారవస్తువుల మోపికొని, నడుము వంచి, మార్గములు బహు కష్టప్రాయములై యుండఁ, బర్వతములపై కరుగు స్త్రీపురుష సమూహము, జరాభారమునఁ బని పాటలు లేక గృహాంగణముల వెచ్చని సూర్యరశ్మి మేనులనానఁ గూర్చొని, చుట్టు ముట్టిన పర్వతచయము నవలోకించు వృద్ధవర్గములు, నెదురు వచ్చు చుందురు. తెప్పపాటు విశ్రాంతికే మొగము వాచిన యీ కష్టజీవుల నడుమ టెన్జింగ్ పుట్టిపెఱిగెను. బాల్యమునఁ దల్లిదండ్రుల కౌగిళ్ళ నేమిసుఖించెనో గాని, యౌవన ప్రాదుర్భావ మాదిగ నీతఁడు వంశాను గతముగ సంక్రమించిన వస్తువాహకవృత్తి నలవఱచుకొని తండ్రిశ్రమఁ బాలు పంచికొనక తప్పినది గాదు. కుటుంబమునఁ బ్రతియొక్క రిట్లొ డలువంచి పని జేయనిచో పస్తులు తప్పవు. ఏకవింశద్వర్షప్రాయ మానన్నము, కానంతవఱకతఁ డిట్లు గుటుంబోదర పోషణార్థము దండ్రికిఁ జేఁదోడు వాఁదోడుగ నుండెను.

అప్పటికే పాశ్చాత్య పర్వతారోహకులు హిమవత్పర్వత శిఖ రారోహణ మారంభించి చాలకాలమైనది. ఏడెనిమిదేండ్ల బాలకుఁ డైన టెన్జింగ్ ఎవరెస్టు శిఖ రాగ్రము నమాయక శూన్యదృక్కులఁ

జూచు దినములలోనే మానవు లా మహాపర్వతముతోఁ బోర ధ్వజ మెత్తిరి. నాఁటి పాశ్చాత్యపర్వతారోహక వీరగాథలఁ బెద్దలు వర్ణింప టెన్సింగ్ చెవుల ఱిక్కించికొని యుత్కంఠతో వినుచుండెడివాఁడు. ఆవీరగాథ లతనికి శ్రవణానందకరముగ నుండెను. నాఁటినుండి ఎవరెస్టు శిఖరమాతని కంటఁబడిన నావేశపూరిత చిత్తుఁడై, యేదోయొకయనిర్వ చనీయానంద మనుభవించెడివాఁడు. ఆశిఖర మధిరోహించి, తదగ్ర ముపైఁ గాలూని, విశాలమేదినీవలయ మవలోకింప వలెనన్న యాశయ మతని హృదయాకాశమునఁ దళుక్కునఁ దటిల్లత వలె మెఱసెను.

మాటలు పేటలఁ గోటలఁ దాటుఁగాని, కాళ్ళు గడపదాటగనేర వని కదా లోకోక్తి. ఈతాత్కాలికావేశము శమించి, వాస్తవిక ప్రపంచము లోనికిదిగుటతోనే యతని యావేదన మొదలిడును. నక్క యేడ? నాకలోకమేడ? భగభగల జెలరేగు నాకలి మంటలఁ జల్లార్ప జాలక రాత్రింబవళ్ళు గాయకష్టముసఁ గాలముఁ గడపు నిఱుపేదకా యీ ముదివెఱ్ఱి! ఏనాఁడు శరీరాస్వస్థత వలనఁగాని, మఱేదేని కారణమునఁగాని, ప్రాలు మాలి పనిఁ జేయక విశ్రాంతిఁ గొనిన, నాఁడు భుక్తి దుర్లభముగదా! కడుపు చల్లకదలని శ్రీమంతులకుఁ గాని, తనవంటి కడుంగడు పేదకా యీ దురాశ! అని కొంత తడ వతఁడు నిరుత్సాహపడుచు, విధిని దూరుచు, లోలోపలఁ గుందుచుఁ, గర్తవ్యజ్ఞాన శూన్యుఁడై, యొక్కొక్కపటి గ్రుడ్లనీరు గ్రక్కికొనుచు బరువులు మోసెడివాఁడు, మన టెన్జింగ్నార్గే. మఱొకప్పు డతని జననభూమి యైన సోలా ఖుంభూ కారాగారముగ నతనికిఁ దోఁచును. పంజరములోని పక్షిపగిది నాతఁ డాశాలతఁ ద్రెంపుకొనుచు బ్రదుకుచుండును. కాని యీవిషాద మేఘములు క్షణభంగురములే. హిమవస్త్రధారి యా నెవరెస్టు శిఖరశీతలమారుతము లావిషాద మేఘముల నెటకో తఱిమి కొనిపోవును. మబ్బు తొలఁగిన మింటివలె నతని మనసు నిర్మలమగును.

నూతన తేజఃపుంజముల నెసఁగజేయు నుదయభానునివలె నతని మనస్సులో నుత్సాహరేఖలు పొడసూప మఱల నాయాశలు చెలరేఁగును. ఏనాఁటికైనఁ దన యాశయము నెఱవేఱక పోవునా? యను దృఢవిశ్వాస మతని ముంచి తేల్చును. జీవిత మానందజలధిపై దీర్ఘయానముగ నతనికిఁ దోఁచును. బంధములఁ ద్రెంచికొని, యాకారాగారము వీడి, విశాలప్రపంచములోని కెగసిపోవుట కతఁ డెన్ని పర్యాయములు ప్రయత్నింపలేదు? ఎన్నిమార్లు తల్లిదండ్రుల వేడినిట్టూర్పులు నెన్నుదిటి స్వేదబిందూత్కరము, బాల్యస్నేహితులు, వారింగలసి యాడి పాడిన చోట్లు, చిరపరిచిత రమణీయ ప్రకృతిదృశ్యములు, తాను పుట్టి పెఱిగిన కుటీరములు, టెన్జింగు ప్రయత్నముల కడ్డుదగులలేదు? టెన్జింగు మనసు మహాందోళనమున నల్లకల్లోల మగుచున్నది. పేదవాని పేరాశ యొకవంకఁ, గడుపులోని ప్రేవులయాక్రందన లొకవంక, నతనిఁ బీడింప సాగినవి. కాలము దొరలిపోవుచుండెను, గాని యాశయస్ఫూర్తికి మార్గమాతనికిఁ దోఁచుటలేదు. ఇటులుండ నొకానొక శుభదివసమున డార్జిలింగ్ నగరమును గూర్చి వెడలు మిత్రబృందమొకటి యతనికిఁ దటస్థపడెను. టెన్జింగ్ మనోభివాంఛాలతకా మిత్రబృంద సమాగమ మొకయూఁతకొయ్యమాడ్కి నయ్యెను. ఆక్షణమే టెన్జింగ్ ప్రస్థానారంభము! ఆమూఁక వెంబడి నతఁడు పది దినములు పయనించి డార్జిలింగ్ చేరెను.

అదియొక నవ్యలోకము. స్వగ్రామ మెక్కడ! ఈ యాధునిక నగర మెక్కడ! ఆ నగరరాజమును, నందలి ప్రజలను, వారి వేషభాషలను జూచి టెన్జింగ్ విస్మయావిష్టుడయ్యెను. తన సోలా ఖుంభూ కావలసి నంతటి యాశ్చర్యము గొల్పు నవ్యలోక మొకఁడున్నదని టెన్జింగ్ ఎన్నఁ డూహించినాఁడు? ఈ నవ్య లోకమును జూడఁ జూడఁ

దాను, దన ప్రజలు నెంతటి గాఢాంధకారమున నున్నారో టెన్జింగున కపుడు బోధపడ సాగెను. డార్జిలింగ్ నగరవాసులు గూడఁ దమవంటి మానవులే, కాని, యా యిరువురి మధ్య నెదియో యగోచరాంతర మొకటి కలదు. ఊపిరి ద్రిప్పి కొనుటకైన వ్యవధిఁ గనని పఱుగులపై బఱుగులు తీయు నిరువదవ శతాబ్ద పరిణామము లాతని దిగ్భ్రాంతునిఁ జేయుచుండెను. డార్జిలింగ్ నగరములో నే నిమిషమునఁ గాలిడెనో కాని, పీడుట కాతని మన సొప్ప లేదు. తన యనాగరక స్థితి కతఁడు సిగ్గువడెను. అతి శీఘ్రముగ డార్జిలింగ్ టెన్జింగ్‌ల మధ్య సంబంధ మెక్కుడ య్యెను.

చదువా రాదు. చిల్లిగవ్వయా లేదు. బ్రదుకుఁదెఱువు ? వంశాను గత వస్తువాహకత్వమే, రక్షయైనది. క్రీ. శ. 1935 సంవత్సరము. వసంతా వతరణ మైనది. నవనవోన్మేష తరులతా కుసుమ వనభాగోదయము, నపరిమితామోద వీచికా నివహంబుల నోలాడు నానాజంతు సంతాన నితాంత హావభావవికాస సముల్లాస సమయ ప్రారంభము నై, టెన్జింగ్ జీవితారామ లక్ష్మికి నవీన శుభోదర్క మయినది. ఎవరెస్టుపైఁ దెల్ల దొరలు మఱల యుద్ధముఁ బ్రకటింపఁ దలపెట్టి రను వార్త, డార్జిలింగ్ నగరమంతయు జరజరఁ బ్రాకి, టెన్జింగ్ క్రొత్త జీవన పుటామునికి మహోత్సవ దశావిఖ్యాతికిఁ గారణ మయ్యెను. తత్క్షణమే నేత్రములు ప్రఫుల్లములైనవి. పులకలెలసి దేహమును మఱపించెను. ఎదో యొక మహత్తరావ్యక్తానందానుభూతి యతని రుద్ధకంఠునిఁ జేసినది. శిఖరాగ్ర మధిష్ఠించినాఁ డపుడే టెన్జింగ్ ఉన్నచోట నుండలేక రివ్వునఁ బఱుగెత్తెను. 'సాహెబ్' బంగళా సమీపించు క్షణకతఁ డాగలేదు. షేర్పా లెందఱో యచటఁ గుమిఁగూడి యుండిరి. అల్లంత దూరమున నొక తెల్లసాహెబు కుర్చీలోఁ గూర్చొని షేర్పాలతో

నే మేమియో ముచ్చటించుచు, నొక్కొక్కరిగాఁ బరిశీలించు చుండెను. ఆ దొర తనవైపేలఁ జూడరాదు ? అని టెన్జింగు తల పోయ మొదలిడెను. తన యమృతహస్తముతో సభయప్రధాన మొసంగుమని దయామయుఁడైన బుద్ధభగవానునిఁ దదేకదీక్షతో నాతఁడు ధ్యానించుచుండెను. టెన్సింగు నిర్మల హృదయావాసి బుద్ధదేవుడు కరుణారస వృష్టి నతనిపై గురియించెను. తెల్లసాహెబు చూపెవరినో వెదకుచు, నలువైపులఁ దిరిగితిరిగి మెల్లగాఁ, గౌతుకాయత్త చిత్తుఁడై నిశ్చల దృక్కులఁ జూచు టెన్జింగుపై వ్రాలినది. ఆనీల నేత్రాంచల దృఙ్మయూఖముల తనిపైఁ బ్రసరింప నతనిశరీరము గంపించెను. అప్పటి యాతని తహతహ వర్ణనాతీతము ఉచ్ఛ్వాస నిశ్వాసము బిగియఁ బట్టి తనునట్టే పరిశీలించు పాశ్చాత్య సాహెబ్ నోట వెలువడు పసిడి పలుకుల కాతఁడెదురు సూచుచుండెను. ఫలిత మేమిగానున్నదో యని టెన్జింగ్ మిక్కిలి యాతురతఁ బడుచుండెను. సాహేబ్ దొర చిఱునవ్వుతో టెన్జింగ్‌ను దనకడకు రమ్మని పిలిచెను. ఆసాహేబ్ పర్వతారోహణ ప్రజ్ఞాధురంధరుఁడు, ఎరిక్ షిప్టన్.

టెన్జింగ్ చిరకాలవాంఛ యీడేరినది. తనవెంట వస్తువుల మోసికొని రావలసినదిగా దొర యాతనిఁ గోరెను. ఆ సంవత్సరమే ఎరిక్ షిప్టన్ ఎవరెస్టు శిఖరాగ్రమునకు నూతన మార్గాన్వేషణఁ జేయ హిమాలయమును బ్రవేశింపఁ దలపెట్టెను. ప్రఖ్యాత పర్వతారోహకుఁడైన ఎరిక్ షిప్టన్ కీర్తి 'సోలాఖుంభూ' మండలమెల్ల మాఱు మ్రోయుచుండెను. అట్టి పురుషుని సాంగత్యము లభించుట టెన్జింగ్ అదృష్ట విశేషమే. తత్ఫలితముగఁ బర్వతారోహణాంతర్భూత సాంకేతిక రహస్యముల నభ్యసించుట కవకాశము లెన్నియో మన 'నాగ్రే'కు లభించెను. నూతన మార్గాన్వేషణయే కాక, నూతన సాంకేతిక సాధ

నోపయోగములఁ దెలిసికొనుటకును, నూతన పర్వతారోహక వస్తువా హకవర్గములకు శిక్షణ యొసంగుటకును ఎరిక్ షిప్టన్ యీయాత్రను ద్దేశించెను. ప్రారంభములోనే స్వీయభుజబలోత్సాహవిన్రమతాది సుగుణములతో టెన్జింగ్ నాయకుని యభిమానమునకుఁ బాత్రుఁ డయ్యెను. టెన్జింగ్ భావిభాగ్యోదయము నానాడే షిప్టన్ చూచాయగఁ జూడ గలిగెను. తన ప్రథమయాత్రలోనే తా మీ గ్రామమునుండి యత్యంతరమణీయ ముగఁ గాన్పించుచుఁ దనజీవితలక్ష్యమునకు రూపరేఖలు దిద్దిన యెవరెస్టు మహోన్నతరూపసంపదఁ జూచి టెన్జింగ్ దిగ్భ్రమఁజెందెను. ఎవరెస్టు శాత్రవనిరోధవిరోధము లెంతటివో, యెంతటి యజేయములో, నతని కప్పు డర్థమయ్యెను. యాత్రాఫలితము లుత్సాహకరముగ లేనప్పటికిని టెన్జింగ్ పర్వతారోహక జీవితములో నిది, దృఢతరమైన పునాది యేర్పఱచినది. టెన్జింగ్ సాధించిన విశేషములలో నకుంఠిత మైన యాత్మవిశ్వాస మత్యంతప్రధానమైనది.

మఱునటి వత్సరమున (1936) హ్యూరడ్ లెడ్జ్ మఱియొక యెవ రెస్టు యాత్రఁ దలపెట్టెను. టెన్జింగ్ గుణగణము నెఱిఁగి యుండు టచేఁ దన యాత్ర నాతఁడు పాల్గొను నవకాశము హ్యూరట్ లెడ్జ్ కలుగఁజేసెను. అటుపిమ్మట 1938 లో టిల్ మన్ దళములో జేరి టెన్జింగ్ మఱియొకసారి యెవరెస్టుపై కుఱికెను. ఈ యాత్రలో నతని పర్వతారోహణ నైపుణ్యా మొకమెట్టు పైకిఁ బోయెను. తదితరు లయిన షేర్పారులు, మిక్కిలి దస్సి, కుప్పఁగూలి, పైకరుగలేకుండ టెన్జింగ్ తనయుత్సాహ రజ్జుసాహాయ్యమున నిరువ దాగువేల యడుగుల యౌన్నత్య మధిరోహించెను. ప్రతియాత్రలో నెవరో యొక షేర్పా మృత్యువువాతఁ బడుటయో, హిమపాతము Frost te) చే నంగ వైకల్యముఁ జెందుటయో, తప్పని సరిగ సంభవించుచుండెను. ఇట్టి

ప్రమాదములఁ గనులారఁ గాంచినవాఁడయ్యు టెన్జింగ్ నిరుత్సాహపడ లేదు. మృత్యుదేవతకు జడిసి మహాకార్యసాధన మంటఁ గలుపుట, విగత విక్రములగుట, నిశ్చితాశయముల నేలపాలుసేయుట యను నివి ఘనులకార్యములు కావు. ఏనాటికైన నెవరెస్టు నధిరోహించుటయే, యాతని జీవిత పరమావధి !

ఎవరెస్టు యాత్రల జయాపజయము లెట్లున్నను బర్వతశిఖరారోహణ సాధనసంపత్తి, యచంచలదీక్ష, యను నుత్తమ వీరలక్షణములు, టెన్జింగ్‌లో బయల్వెడలెను. హిమవత్పర్వతాంతర రహస్య విశేషముల నతఁ డెఱిఁగినట్లు మఱియొకఁడుండఁడని చెప్పుట సాహసముగాదు. అందలి (Avalanches) కొండశైలములు, వాని నైసర్గిక లక్షణములు వాతావరణ రీతులు, శిబిరస్థాపనానుకూల స్థలములు, మొదలైన బహువిధ పర్వతారోహణ విశేషములు టెన్జింగునకు కరతలామలకములు :

క్రీ. శ. 1939 సంవత్సరములో టెన్జింగ్ హిందూకుష్ పర్వత శ్రేణులలోని 'తిరిచ్ మీర్' శిఖరారోహణ కార్యములోఁ బాల్గొనెను. ఇపుడు టెన్జింగ్ పాల్గొనని హిమవత్పర్వతారోహణకార్యము లేదనియే చెప్పవచ్చును. ప్రసిద్ధ పర్వతారోహకుఁడుగను, వస్తువాహకుఁడుగను, షేర్పా నాయకుఁడుగను, సర్దారుగను, టెన్జింగ్ కీర్తి ప్రతిష్ఠలఁ గాంచినాఁడు. జీవితములో స్థిరత్వ మతని కేర్పడినది. హిమాలయ మతని యారాధనాలయమైనది. పర్వతారోహకవృత్తి నవలంబింప నిశ్చయించినచో, డార్జిలింగ్ నగరములోనే స్థిరనివాస మేర్పఱచికొనవలయును. టెన్జింగ్ కోరఁదగిన దంతకు మించి యేమున్నది. ఏకాకిజీవిత మింక నెంతకాలము ? తనకా తెక్కులు వచ్చినవి. సుఖదుఃఖ సమ్మిళితమగు జీవిత మహాప్రవాహ మీఁదుటకు దోడునీడగా

వర్తించు వ్యక్తి యున్న జీవితదశాపరిణామ మెవ్వానుగదా ! ఆ సంవత్సరములోనే, అంగ్లామూ, అను షేర్పా యువతినిఁ బెండ్లాడి డార్జిలింగ్ నగరములో స్థిరనివాస మేర్పఱచికొనెను. డార్జిలింగ్ నీ రాతనికి బాగుగ నొంటఁబట్టినది. నగరములో నొకమూలఁ జిన్న యింటిలో నతఁడు మామూలు షేర్పా బ్రతుకు బ్రతుకుచుండెను. దారిద్ర్య మతని నంటియే యుండెను. పర్వతారోహణ యాత్ర లున్నపుడే నాలుగు రూకలఁ జూడఁ గలఁడు. ఆరోహణ ముగియఁ గనే యెప్పటి పరిస్థితియే. ఇట్టి స్థితిలో ద్వితీయ ప్రపంచమహాసంగ్రామ మారంభమైనది. దానితోఁ బర్వతారోహణ మూలఁ బడినది. పాశ్చాత్యప్రపంచము యుద్ధాగ్నిజ్వాలావృత మయ్యెను. పాశ్చాత్యులు దమ సర్వశక్తుల సంగరరంగముల కర్పించి, యుద్ధేతర కార్యములకు స్వస్తి చెప్పి ప్రాణములఁ బిడికిటఁ బెట్టికొని, యహోరాత్రము లూపిరి తిరుగని కార్యములం దాసక్తులై యుండిరి. మానవమదహంకార జనితాపచారములచే, విసిగి వేసారి, యెవరెస్టు శిఖర చిరకాలవాంఛి తమా ప్రశాంతత యిపుడు లభించినది.

ఇఁక టెన్జింగ్ గతి ? కాలము గడుచుట కేదేని యుద్యోగముఁ జేఁ జిక్కించి కొనవలయును గదా ! నిరుద్యోగులకు యుద్ధ మెన్నియో యవకాశము లొసఁగును. నేపాళసైనిక రణపరాక్రమ కౌశల విస్ఫూర్తి జగన్నుత కీర్తిఁ గాంచినది. మాటమాత్రమున టెన్జింగ్ చక్కని యుద్యోగము సంపాదింపఁగలఁడు ? కాని, యుద్ధము షేర్పా జాతివిరుద్ధము. అది ఘూర్ఖా జాతి ప్రబుద్ధము. షేర్పాలు శాంతి ప్రియులు. అన్నియు నాలోచించి కర్తవ్య మప్పటికది యనికొని చిత్రాల్ స్కౌటు సంఘమునఁ జేరెను.

ఎట్టకేలకు యుద్ధము పరిసమాప్తి యైనది. ఇంతకాల మెట్లో కాలక్షేపముఁ జేసిన టెన్జింగ్ తిరిగి డార్జిలింగు నగరమునకు వచ్చెను.

ఆరు సంవత్సరములపాటు మారణహోమాది విధ్వంసక చర్యలతో విసిగి వేసారి మానవులు శాంతికాముకులైరి. యుద్ధజ్వాలలు చల్లారినవి. శాంతిపిచికలు ప్రపంచముపైఁ బ్రసరింప నారంభించెను. సంగరోత్సాహమున సహజవాంఛలు మఱచి కాలము గడిపిన పర్వతారోహక మానసముల నాచ్ఛాదించిన శాంతి మేఘములుదొలఁగఁగ వారు పర్వతములపై దాడికిఁ బ్రారంభమూనులైరి. స్విస్ పర్వతారోహక దళమొకటి 1947 లో రెండు పర్యాయములు గహర్వాల్ యాత్రకై వెడలెను. టెన్జింగ్ ఆ యాత్రలోఁ బాల్గొని 23,000 యడుగుల యెత్తుకు వెళ్ళెను.

మఱునటి యేడు 'టుస్సీ' యను ఇటలీదేశ విద్యావేత్త టెన్జింగ్‌తో వెడలి టిబెట్టు రాజధానియగు లాసానగరములో నెనిమిది మాసము లుండెను. టెన్జింగ్ అతని యధీనమునుండి కొన్ని వందల పుస్తకములా నగరమునకు జేరవేసెను. మఱల 1949 లో టిల్‌మన్ వెంబడి నేపాళదేశములో టెన్‌జింగ్ సంచరించుచుండ నతనికి (Snow Blindness) నీహారనేత్రావరోధము సంప్రాప్తించెను. ఇయ్యది సాధారణముగఁ బర్వతారోహకుల బాధించుచుండును. కాని టెన్జింగ్ త్వరితముగ నాబాధనుండి విముక్తుఁ డాయెను. పిమ్మట 1950 సంవత్సరములో నతఁడు ఫ్రెంచి దళముతో నందాదేవి శిఖర మధిరోహించి కీర్తిగడించెను. ఈ విజయము గూర్చి యొకచో ముచ్చటించుచు 'నందాదేవిశిఖరారోహణలో హిమానీ నదిని దాటుటయే నాజీవితములో నత్యధిక ప్రమాద భరితమైన సంఘటన. ఆ హిమానీనది చేపట్టులేక యద్దపుబిళ్ళవలె నున్నగ నుండుటచే నన్ను రుస్సనుచుఁ దిన్నగఁ జీమవలెఁ బైకెగఁ బ్రాకితిని' అనిచెప్పెను.

తన పర్వతారోహణ పద్ధతిని వర్ణించుచుఁ "పర్వతము నెక్కుట ప్రారంభించితినా, మఱొక సంగతి నాకుఁ బట్టదు. ప్రపంచమ్మునే మఱచిపోదును. నాకిల్లుగాని, కుటుంబముగాని యున్నసంగతియే

మఱచెదను. నా మనస్సంతయు శిఖరాగ్రముపైనే లగ్నమై యుండును. అచటికి వెళ్ళవలె ననునుబలాటమే-నన్నుఁ బీడించుచుండును" అని టెన్జింగ్ యొకానొక సందర్భమునఁ జెప్పెను.

1952 సంవత్సరమున డాక్టర్ ఎడ్వర్డ్ వ్యూనాంట్ నాయకత్వమున స్విస్ దళమొకటి యెవరెస్టు యాత్రకై బయలుదేరెను. ఆనాటికే టెన్జింగ్ పేరు పర్వతారోహక ప్రపంచములోఁ బ్రజ్ఞాసామర్థ్యములకుఁ బర్యాయపదమై వెలయుచుండెను. ప్రముఖ పర్వతారోహకు లాతని గుణవిశేషముల మిక్కిలిఁ బ్రశంసించిరి. అయినప్పటికిని డాక్టర్ వైస్ వ్యూనాంట్ టెన్జింగును స్వయముగఁ గలిసికొని ముచ్చటింప మనసువడెను. నిర్ణీతకాలమునకు సరిగ డాక్టరు సందర్శనమునకు టెన్జింగ్ కాకీరంగుచొక్కా లాఁగులుఁ దొడిగి, చురుకుఁదనము, దిట్టతనము నుట్టిపడ, నూనూగు మీసాల నీలిమిజిగి, పసుపుమిసిమిఁ బిసాళించు దేహకాంతి రోచుల కొక వింతకళను సంతరింప నడిమిపాపటతో నిరువైపుల శిరసును గప్పు శిరోజములు మెఱయఁ, బ్రశాంత వదన మానంద మందహాసజ్యోత్స్నావగాహనమున వెలుఁగ, నేతెంచెను. ఆతనిఁ గనినంతనే, వినిన దంతయు యథార్థమే యనుకొని, వెంటనే తనదళములో గౌరవపదవి నొసంగుచు, షేర్పాలపై సర్దారుగ నుండ టెన్జింగును గోరెను.

స్విస్ పర్వతారోహకులు, 1951 లో ఎరిక్ షిప్టన్ విశేషపరిశోధనానంతరము గనుఁగొనిన నూత్నమార్గము ననుసరించి శిఖరాగ్రముఁ జేరఁ గృతనిశ్చయులైరి. ఈయాత్రలో టెన్జింగ్ తనప్రతిష్ఠను గొంత యున్నతస్థాయికిఁ గొనిపోఁగల్గెను. ఈయాత్రలో నతని సహచరుఁడు ఆల్ప్సు పర్వతారోహణ ప్రవీణుఁడు రేమండ్ లాంబర్ట్ అనువాఁడు. వీరలిరువు రా పర్వతముపై కురికిరి. పర్వతారోహణ నైపుణ్యమునఁ గాని, కార్యదీక్షా పరతంత్రతఁ గాని రేమండ్ టెన్జింగ్ లొకరిని మిం

చినవారొకరు. ప్రాణవాయువు నుచ్ఛ్వాసించుచు నత్యాయాస వీడి తులై వారు పురోగమించి, యొకచో నాగిరి. అటనుండి టెన్జింగ్ పరిసరముల నొకపరి వీక్షించెను. టిబెట్టు దృశ్యము లతనిఁ బరవశునిఁ జేసినవి. అతని నేత్రములవెంట నానంద బాష్పములు జలజలరాలినవి. అప్పటికే యలసియుండుట నాటి రాత్రికా కఠిన పర్వతోపరి శిలాతలమే పట్టుపఱుపుగ భావించి, విశ్రమించి, మఱునాటి వేకువ శిఖరాగ్రము గూర్చి పోవలయునని టెన్జింగ్ సూచించెను. అటులే నాటిరాత్రి యొక గుహాలో వారిరువురు సాక్షాన్నరక మనుభవించిరి. ఆరాత్రి వాతావరణము ప్రళయకాలము వలె విజృంభించెను. మృత్యువునకుఁ దప్పుటచే, నెటులో విధివశమున బ్రతికి బైటఁబడిరి. తూర్పు దెలుఁపు తేలుట తడవుగా యాత్రసాగించిరి. ఆ నడకలో బాధవారికే తెలియ వలయును. కొంతదూరమటు లూపిరి బిగియఁబట్టి ముందు కేఁగ మంచు దిట్టముగఁ గురియ నారంభించెను. మార్గ మగపడుటలేదు. చివరకొకరి కొకరైనఁ గాన్పించుట లేదు. క్రొత్తగ రాలిన పొడిమంచులోఁ గాళ్లు దిగఁబడి పోవుచుండెను. మోకాటిలోతు పొడిమంచులోఁ బడుచు లేచుచు వారు పురోగమించుచుండిరి. శిఖరాగ్రమిఁక నేడువందల యడుగుల నుండఁగనే వారి శక్తు లుడిగినవి. వారిదృష్టు లగ్రము దాకు చున్నవి. కాళ్ళు వెనుకకులాగుచున్నవి. తత్ప్రదేశమునుండి వానిని మఱల్చుట సాధ్యము గాకుండెను. ఇఁక విజయ మావగింజలో నర్ధభాగముగలదు. ఇపుడా, యీ ఘోరసంగ్రామ రంగమునకు వెన్నుఁజూపి మఱలుట! ఇదెంతటి యవాంఛనీయము? ఈ దైన్య భావాంకురము దలలో నెట్లు మొలకెత్తినది? అందుల కిదియా సుముహూర్తము. ఆదిలోనే యీభావబీజము మొలకెత్తియుండిన నీప్రయాసయేల?...... కాదు......... ఇదెంతటి దుర్ఘట కార్యమైనను నరియే సాధించి తీరవలసినదే...సాధించితీరవలసినదేనా! .........కాని కాళ్లుచేతు

తేలాకో యాశరీరము నంటియున్న వైనము దోఁచుటలేదు. శరీరమునకా చలనాంగములతో సంబంధ మున్నటులఁ గాన్పించుట లేదు... శరీరముతో సహకరించుట కవి నిరాకరించుచున్నవా? ......... కాకున్న నిదియేమి? కాలుసేతుల కర్తవ్య మాగిపోయినది......ఒకవేళ శరీరమే మానసిక భావతరంగముల కెదురీదు చున్నదా యేమి? అంతియగా నుండనోపు.........అయినచో మనోశక్తి నిస్సహాయురాలుగదా!......ఇఁకలాభములేదు. ........కార్యసాఫల్య మలతి దూరములో నాగిపోయినది...; యిట్టి విచారభావతరంగ డోలికల నూగి యూగి, యవనత వదనులై వెన్నుఁజూపి - తిరిగివచ్చిరి.

స్విస్ దళ ద్వితీయారోహణ ప్రయత్న మీవిధముగ టెన్జింగ్ యారోగ్యమునకే ప్రాణగొడ్డమైనది. హిమాలయము వీడి డార్జిలింగ్ చేరిన పిమ్మట టెన్జింగ్ రోగార్తుఁ డయ్యెను. మన్యజ్వర మాతని నిర్వీర్యునిఁజేయ మొదలిడెను. మంచుపులి నేఁడు మంచముపైఁ బొరలాడుచున్నాడు. 'ఇఁక నీ జన్మలో నెవరెస్టును జూడఁగలనా' యను విచార మాతనిఁ బిశాచమువలెఁ బట్టికొని పాలార్ప నెంచినది.....

ఇట్టి హతస్థితిలో యూరప్‌లోని 'యాల్ప్స్‌సమితి' టెన్జింగునకు గౌరవసభ్యత్వ మొసఁగ సంకల్పించినదను, వార్త యతనికిఁ దెలియవచ్చెను. లాంబర్ట్ యీ మహాపర్వతారోహక వీరశిఖామణిని, నైరోపాఖండమునకు రమ్మని యాహ్వానించెను. బ్రిటిష్ యాత్రిక వర్గము టెన్జింగ్ క్షేమాదికముల నపుడపుడు విచారించుచుండెను. ఇవి టెన్జింగును గొంత రోగవిముక్తునిగఁ జేసి బలము నిచ్చినవి. అతని జీవితాశయలత పునఃప్రాదుర్భావమునొంది నవకోమలపల్లవకుసుమ భరితాలంకరణమగుట కారంభించెను. అతని యచంచలదీక్షాగ్నియే, యతని యనారోగ్యమలినాంబరమును దగ్ధము జేసినది. అతని మానస

విహంగ మానందమయ హిమాచలాంబరవీధి విశ్రుతవిహార మొనర్ప సాగినది. చాలకాలముగ నతని శరీరమునకుఁ దగిన వ్యాయామసంపద లేమి టెన్జింగ్ తక్షణము పరిసర పర్వతములకేగి సాధన మొదలిడెను. ఇంతలో బ్రిటిష్ ఎవరెస్టు యాత్రకు సన్నాహము జరుగుచున్నదను వార్త యీ మహామహీధరారోహక శిఖామణి చెవికి వచ్చెను. అనాజ్ఞాతముగ నతని హృదయ ముప్పొంగెను......టెన్జింగ్ లేని యెవరెస్టు శిఖరారోహణమా......? అసంభవము!!

టెన్జింగ్ అప్పుడే సర్ జాన్‌హంట్ పేర ఎవరెస్టు యాత్రలోఁ బాల్గొను నవకాశము దనకు గల్పించవలయునని యొక లేఖ వ్రాసెను. ఆలేఖఁ జూచి సర్ జాన్‌హంట్ సంతోషించెను. టెన్జింగ్ లేని యెవరెస్టు శిఖరారోహణమా! యను నీ సమస్య సర్ జాన్‌హంటును గూడ నాలోచనానిమగ్నునిఁ జేసెను. చివర కతని చేరిక తప్పనిసరి యని తీర్మానించి 1953 మార్చి నాల్గవ దివసమునఁ గాట్మాండూ నగరములో సర్ జాన్‌హంట్ టెన్జింగును సందర్శించెను. సంపూర్ణారోగ్యభాగ్యమొందిన యీ యారోహక వీరప్రకాండుని జూచి బ్రిటిష్ నాయకుడు సంతసించెను. ప్రస్తుత యాత్రలో షేర్పా దళమునకు సర్దారుగనుండి వస్తుపరికరముల రవాణాబాధ్యత వహింపవలెనని యాతఁడు టెన్జింగును గోరెను. ఇది గాక, యింకఁ దప్పనిసరియైన యెడ టెన్జింగ్ పర్వతారోహకదళములో నెల్లహక్కు లనుభవించు గౌరవ సభ్యుఁడుగ నుండి శిఖరాగ్రారోహణములో నవసరమైనఁ బాల్గొనవలసి నట్లాతనిని సర్ జాన్‌హంట్ ఆదేశించెను. ఈయాదేశము మన వీరునిఁ బులకితగాత్రునిఁ జేసెను. ఆతని మానసిక క్షేత్రములో నాశాప్రసూనములు మొగ్గలువిచ్చి కొన లిడినవి. ఆతని నేత్రాంచలముల విజయప్రభాపటలరాగరేఖ లప్పుడే హవణింప సాగినవి.

# 5

## ప్ర యా ణ ము

ఖాట్మాండూ నగరమున కెనిమిదిమైళ్ళదూరములో భాద్గాన్ సైనిక శిబిరమున ఎవరెస్టు యాత్రా సామగ్రిని భద్రపఱచిరి. ఈ సామగ్రి నిఁక త్యాంగ్ బోచ్ గ్రామమునకు జేర్చవలయును. అందులకై వందలాది కూలీలవసరముగాన నేపాళీభాష బాగుగ దెలిసిన వాఁడగు ఛార్లెస్ వైలీ యాపనినిఁ దనమీఁదఁ బెట్టికొనెను. మార్చి తొమ్మిదవ దినమున మూఁడువందల యేబదిమందికూలీలు భాద్గాన్ సైనిక శిబిరమును జేరిరి. వారిలో స్త్రీలుగూడఁ గలరు. యాత్రిక దళమును రెండుభాగములు చేసిరి. ఎవరో ముగ్గురుదప్ప మిగిలిన వారందరు మొదటి జట్టులోఁగలసి త్యాంగ్ బోచ్ గ్రామమునకు వెడలవలెనని తీర్మానమైనది. ఇఁకయాత్రిక దళము తరలి పోవుటయే తరువాయి.

ఇది యట్లుండ నేపాళ సార్వభౌముఁడు, భారతీయ రాయబారి వర్గము, బ్రిటిష్‌రాయబారవర్గము, నీయాత్రిక దళమునకు గౌరవార్థము గొప్పవిందులు జరిపి ఆశీర్వచనములతో వారి సాగనంపిరి. సర్ జాన్ హంట్ మఱలివచ్చుచుండగా నేపాళసార్వభౌముఁడు, మూఁడు నేపాళ జాతీయ పతాకల నాతని కందిచ్చుచు, శిఖరాగ్రమునకు వానినిఁ గైకొని పోవలసినదనఁ, దనయాశయసిద్ధికిఁ బురోగామి యని భావించి సర్ జాన్ హంట్ సంతోషపూర్వకముగ వానిం గైకొనెను.

మార్చి పదియవ దివసము ప్రథమయాత్రిక దళప్రయాణము నకు నిర్ణీతమైనది. యాత్రాసన్నాహము లతివేగమున జరుగుచుండెను. ప్రయాణోత్సాహ సంభ్రమములతోఁ బర్వతారోహకు ల్లెల్లఱు

గాలిలో దేలిపోవునట్లుండిరి. ఛార్లెస్ వైలీ బెన్సింగ్ లిరువురుఁ బ్రయా
ణమున కేర్పాట్లు సేయుచుఁ, గూలీలతో నేమేమియో ముచ్చటించు
చుండిరి. ఏవైపుచూచినను వందలకొలఁది వస్తుపేటికలు చిన్నచిన్న
తిప్పలవలెఁ బడియున్నవి. కూలీల హడావిడి చెప్పనలవికాదు. వారి
గుసగుసలు, చిఱునవ్వులు, హెచ్చరికలు, సంప్రదింపులు, విచిత్రవర్ణ
ములౌ షేర్పాస్త్రీలవేషములుఁ జూడఁజూడ ముచ్చటగా నున్నవి.
బరువులు వీపునఁబెట్టికొనుట, దింపికొనుట, త్రాళ్ళతోఁ గట్టికొనుట
యొకరునొకరు బెద్దపెద్ద యఱపులతోఁ బిల్చికొనుట మొదలైన కోలా
హలముతో ఛాడ్గాన్ సైనిక శిబిరము నిండిపోయెను. పర్వతారోహ
కుల సాగనంపుటకు స్నేహిత, పరిచయ బృందములెల్ల నచటికి
వచ్చిరి. ఉత్సాహవచనములు, వీడ్కోలుపల్కులు, పరస్పర కరస్పర్శావ
లోకనములు, చల్లనిచూపులు, మందహాసములును ముగియఁగనే
మహాదీర్ఘవస్తువాహపంక్తి పూర్వాభిముఖముగ బయలుదేరెను. ఆరంభ
మున వాతావరణ ముత్సాహజనకముగ లేకపోయినను క్రమముగ
గొంతకాలమునకే యనుకూలముగ మారెను. వస్తువాహకుల ననుగ
మించుచుఁ బర్వతారోహక దళమును గదలెను. నేటి యాత్రిక సమూ
హమున, నూటయరవై యిరువురుకూలీలు, పదునెనమండ్రు షేర్పాలు
బోర్డిలాన్, గ్రిగరీ, స్టోబార్ట్, నాయిస్ఇవాన్స్, హిల్లరీ, లో, బాండ్
ఫ్ర్యూ, తొమ్మండ్రుడు పర్వతారోహకులు, గలరు. పత్రికావిలేఖకు లచటి
కేతెంచి, క్షేత్రయాత్రకు వెడలు, యాత్రికదళ చిత్రరూపములను,
ఛాయాగ్రాహకయంత్రములతో గ్రహించిరి. మఱునాఁడే సర్ జాన్
హంట్ మిగిలినవారితోఁ దరలిపోయెను. ప్రస్తుత యాత్రిక
దళము నూట డెబ్బదిమైళ్ళ దూరములో హిమవచ్ఛిఖర బాహు
వల్లరిలోఁ సొంపులఁబొంపిరిపోవు త్యాంగ్బోచ్ గ్రామలక్ష్మినిఁ గని
యాశ్చర్యసంభ్రమములు మానసవీథి బెనఁగొనఁ జేరఁబోయినది.

ఆగ్రామమునకు బండిబాట లేదు. బ్రహాండమైన కొండల నెక్కుచు దిగుచుఁ బదునేఁడు దినములు, మజిలీలు సేసికొనుచుఁ బ్రయాణము సేసిన త్యాంగ్ బోచ్ గ్రామము సేరగలము. త్యాంగ్ బోచ్ గ్రామమునఁ బ్రధానశిబిర మేర్పఱచ వలయునని సర్ జాన్ హాంట్ తీర్మానించెను.

హిమవత్పర్వతములలోనికిఁ జొచ్చికొనిపోయిన, నేపాళదేశము మిక్కిలి సుందరమైనది. అద్వితీయ పర్వతదృశ్యములేగాక, జగత్ప్రసిద్ధ శిఖరములుగూడ నాదేశములోనున్నవి. ఎవరెస్టు యాత్రికులిపు డా పర్వతదృశ్యములఁ దనివారఁ దిలకించుచు శిఖరరాజముతోఁ బందెము వేయుటకు వెడలుచున్నారు. ఆభీలోన్నత పర్వతాగ్రములనుండి దొరలి యఖాతములైన లోయలఁ బడి, సుడులు దిరుగుచుఁ బర్వతములఁజుట్టి, పొంగులుదేఱి, నీలచ్ఛవిరాజిత నీరములఁ బ్రవహించు నదులును వారి నచ్చటచ్చట నడ్డగించుచుండెను. పర్వతపార్శ్వములఁ, దత్పరిసరముల నిరంతరకృషిసల్పు కృషీవలులు, వారి కుటీరములు, పచ్చనిపంట కొండచెంపలు గనులపండువుఁగూర్ప దారిబడలిక నపనయించుచుఁ, బోవుచుండిరి. త్రోవలో నెందఱో నేపాళ స్త్రీ పురుషులు ప్రాంతీయ వస్త్రభూషణాద్యలంకృతులై పర్వతారోహకుల కెదురేగుచుండిరి. ఒక్కొక్కత్రోవ కిరుపార్శ్వములఁ దరులతా గుల్మాదు లొకదాని నొకటి పెనవైచికొని, ఛత్రాకారములధరించి, పాంథజలతాపములఁ దొలగఁజేయుచుండెను. అది మధుమాసోదయ మగుటచే వా రరుగు మార్గ మతిలోకరమణీయదృశ్యమయమై యుండెను. పరిసర తరులతా నికుంజ పుంజములు, నవకోమల పల్లవ కుసుమఫల భరితములై, మందమలయానిల స్పర్శసుఖానుభూతి మితిమీఱ న ర్తనక్రీడ సలుపుచుండెను. అందందు వీచు నాపిల్లతిమ్మెరలు, వికసితకుసుమవిసర పరిమిళితములై, నానాజాతి రూప పుష్పగుచ్ఛంబులఁ బాంథజనముల కాప్యాయతఁ గూర్చుచు,

మఱియు వారిప్రయత్న ఫలితముల నెసంగజేయగల యాశీస్సుల వెదఁ జల్లుచున్నవోయన్నట్లు వారిపైఁ గ్రుమ్మరిలుచుండెను. దీన, వారి పురోగమనము నిరాఘాటముగ సాగుచుండెను. నగరపార్శ్వనగస్థలముల నొప్పు వివిధ కుసుమ విసర విస్తర సానుతలంబులఁ జూచి, చూపుల మఱల్పలేక, కొంతసే పచ్చోటనే గడపి వెళ్లుచుండిరి. పలుజాతుల వృక్షనివహంబులు చిగిర్చి పచ్చని పట్టుబట్టఁ దాల్చినట్లుండెను. సహజవర్ణ శోభితములైన శకుంతసంతానము లాకాశపథమున విహరింప, సూర్యకిరణములు వానిపైఁ బ్రసరించి వాని సహజవర్ణములను నుద్దీపింపఁ జేయుచుండెను. లతాపరివేష్టిత మహోన్నతవృక్షశాఖలపై నానావిహంగమ సమూహంబులు చేరి వసంతసమయ మానసోల్లాస మతిశయింప, మంజుల స్వనముల విమలగానముచేసి యాత్రికుల మనముల రాగపరివాహకములుగఁ జేయుచుండెను. ఆ మధురగానముతో పురోగాములౌ యాత్రికుల కపూర్వ జయ జయ నినాదములు. ఆకాశవీథిలో నందచందములఁ జాటు సీతాకోక చిలుకలు యాత్రికులకు విజయపతాకలవలె నొప్పెను. ఆ యందాల బరిణలే, శీతనగ దీర్ఘధవళశ్రేణుల సాంద్రారణ్య వసంత రూపసంపదల దనివిమీఱఁ జూచి యానందించుటకై యాకసమున కెగిరినవా యనుభ్రమఁ బుట్టించుచున్నది. ఈ దివ్యసౌందర్యసీమ రూపవిశేషములఁ గనుచు, యాత్రికులు ముందునకు సాగుచుండిరి.

మనోహర దృశ్య మగపడినఁ జాలు. స్టోబార్టు గ్రిగరీలు ఛాయాగ్రాహకయంత్రములఁ జేఁబట్టి శరవేగమున ఛాయాచిత్రములఁ దీయుచుండిరి. ఈ దృశ్యములే గాక యాత్రిక జన గమన దృశ్యములుగూడ వారి నాకర్షించెను. దినములు గడచుకొలఁది వారు నూతన గ్రామములను, వినూతన దృశ్యములును, నూతనశిఖరములను, లోయలనుఁ జూచుచుండిరి. మధ్యే మార్గమున, గౌరీశంకర శిఖరము దర్శన

మయ్యెను. అట్లే పయనించుచుండ, నొకానొక దినమున వారి కెవరెస్టు శిఖరము గోచరమయ్యెను. ఆ దర్శనమే వారి నమితోత్సాహోద్రిక్తులుగఁ జేసినది. ఆనందము పట్టలేక, పునర్దర్శన లాభము కొఱకై వారు వృక్షముల నధిరోహించిరి. మార్గములోఁ దత్పర్వత ప్రాంత గ్రామీణ జీవితవిధానము వారి నాకర్షించినది. ఒక మండలము దాటి వేఱొక మండలముఁ జేర నందలి గృహనిర్మాణము పెక్కువిధముల మాఱుచుండెను. కొన్ని గృహముల కప్పులకయి కొయ్య పలకలు, వానిపై రాతిబండలు నుండెను. పెనుగాలులనుండి రక్షించుకొనుటకై యీ విధమును వా రనుసరించిరని తెలిపిరి. మఱికొన్ని మండలములలో బండలే కప్పుగా నమర్పఁబడి యుండెను. ఇంకను గొన్ని చోట్లఁ బెంకులతోడను, బూరితోను గప్పు వేయబడి యుండెను. ఆయాప్రాంతముల కనుకూలమైన విధానము లెట్టివో యట్టివాని ననుసరించెదరు. ఎక్కడ నే యేవస్తువులు సమృద్ధిగా దొఱకునో, యావస్తువులచే గృహనిర్మాణమును జేసికొనెదరు. ఎండ వానలకు నోర్చుచుఁ, గొండలపైనో, నేటవాలు ప్రదేశములనో, దున్ని, పంటలఁ బండించికొనుచుందురు. అవియే వారి జీవనాధారములు. వారి నిరాడంబరజీవితము పాశ్చాత్యుల కత్యాశ్చర్యమును గొల్పుచుండెను.

ఈప్రయాణములోఁ బర్వతారోహకుల దైనిక చర్యనుగూర్చి సర్ జాన్‌హంట్ ఈక్రింది విధముగా వర్ణించెను. 'మేము కులాసగ నాడుచుఁ బాడుచుఁ బయనించుచుంటిమి. నిత్యము, సూర్యోదయ వేళకు సరిగాఁ బొగలెగయు వేఁడి తేనీటిపాత్ర మా నిద్రమత్తునుఁ బాఱఁద్రోలుచుండెడిది. తేనీరు త్రాగినవెంటనే యాత్రిక దళము బయలు దేరును. పతాక ధారివలె మావంటవాఁడు తాండూప్, తన కవసరము లైన పరికరములతో, ముందుగ బయలుదేరి, ప్రాతఃకాలభోజన

మున కనువైన స్థలమును వెదకియుంచును. యాత్రికదళము రెండు మూఁడు గంటలు పయనించి మఱల నొకచో నాగును. భోజనాదులు ముగించుకొనినమీఁదట మఱల బయలు దేరి పోదురు. తాండూప్ వండు చుండఁ బర్వతారోహకులు యథేచ్ఛగ విశ్రమించుచుందురు. కొందఱు జలజలఁ బ్రవహించు నదీ ప్రవాహములలో గంటల కొలది హాయిగ స్నాన మాడుచుందురు. కొందఱు రచనా వ్యాసంగమున మునిఁగి యుందురు. కొందఱు గ్రంథ పఠన కాలక్షేపమును గావించు చుందురు. పుస్తకములు చదువుచుఁ, దద్రచన రచనా నైపుణ్య వైశద్యమున సొక్కుచుందురు. కొంద అద్వితీయ ప్రకృతి సౌందర్య చిత్రములఁ జిత్రించుచు, నందందిమిడియున్న సాంకేతిక రహస్యముల నితరులకు వివరించుచుందురు. సుదీర్ఘ తర్కవితర్కములలో మునిఁగి యున్నవారిని సుహాసిత హాస్య చతురోక్తులతోఁ గడుపుబ్బ నవ్వించుచుందురు, మఱికొందఱు. కొందఱు కన్నులు మిఱుమిట్లు గొల్పు రంగురంగుల ఱెక్కలఁ జూచికొని గాలిలో స్వేచ్ఛగ విహరించు సీతాకోకచిలుకలఁ జేఁజిక్కించికొనుచుందురు. మఱికొందఱు వీనుల విందుఁజేయు చక్కనిచుక్కలవంటి పక్షుల యందముఁ జూచి పరవశమందుచుండిరి. ఒక్కొకప్పుడు నేను పథకములను గూర్చి చర్చించుటలోఁ గాని, యుత్తరములు వ్రాయుటలోఁ గాని ప్రొద్దు పుచ్చెడివాఁడను. ఇంతలో భోజనములు సిద్ధమగును. భోజనములు ముగించి మఱల మా యాత్రిక దళము తఱువాతి మజిలీఁ జేరుటకు బయలుదేరును" వారు సాయంకాలమున కావలి బసఁగూడి రాత్రి యటఁ గడిపి, మఱల సూర్యోదయముననే తరలిపోవుచుండిరి.

ఈ త్యాంగ్‌బోచ్ ప్రయాణము, యాత్రికుల కధికోల్లాసము గొల్పుచు, ముమ్ముందు జఱుగవలసిన కఠోరదీక్షకు నవరసము

నూతన శిక్షణాశక్తుల వారి కిచ్చుటయే కాక, పరస్పర స్నేహబాంధవ్యాభివృద్ధి కెంతయో తోడ్పడుచుండెను. ఉపాధ్యాయులు, సైనికోద్యోగులు, వ్యాపారులు, వైశ్యులు, శాస్త్రజ్ఞులు, సాంకేతిక విద్యానిపుణులు మొదలైన బహుముఖ జీవితముల కలవడిన నేర్పరు లీ పర్వతారోహక దళమునఁ గలరు. అన్యోన్యసంపర్కముచేఁ బరిచయములు స్నేహములై శాశ్వతములుగఁ బరిణమించెను. ప్రత్యేకవ్యక్తిగత మానసిక ప్రవృత్తులు, దత్పరస్పర సంపర్క ఫలితాభిరుచులు గానవచ్చెను. వారివి యేకోన్ముఖ భిన్నదృక్పథములు. హృదయాహ్లాదముఁ గొల్పు రమణీయప్రకృతి వారి హృదయసీమల, జీవితపర్యంతము సర్వతోముఖాభివృద్ధిఁ బొందగల మధురస్నేహము, సంఘీభావము, కార్యాసక్తత, తద్దీక్షాపరతంత్రత, మొదలగు వీరలక్షణములఁ బెంపొందింపఁజేసెను. దినములు గడచుకొలది వారి మనోభావముల నెయ్యపుదియ్యఁదనము వృద్ధియయ్యెను. చిన్నచిన్న స్నేహితబృందము లేర్పడుచుండెను. సర్ జాన్ హంట్ తనదళములో దినదిన ప్రవర్ధమానమగు స్నేహసంఘీభావములఁ బరిశీలించుచుఁ గార్యసాఫల్యమున కివి శుభశకునములుగదా యని సంతసిల్లుచుండెను. విరామకాలమందు సాధారణముగఁ బర్వతారోహణసమస్యలఁ దర్కించుకొనుచుండిరి. మఱికొన్ని సమయములలోఁ బ్రాణవాయుసాధనముల నుపయోగించుట కలవడుచుండిరి. ప్రయాణములో దినమున కొకని వంతునఁ బ్రాణవాయుసాధనముల నుపయోగించుచుండిరి. ఇతఃపూర్వము దీనినెఱుఁగని వానికిని నవ్యానుభవమును గూర్చుచుండెను.

యాత్రికదళము తొమ్మిదవనాఁటికిఁ, దొమ్మిదివేలయడుగుల యెత్తులోనున్న సోలాఖుంబూమండలములో నడుగువెట్టెను. పరిసరములలో మార్పుస్పష్టముగ వారు గమనించిరి. పర్వతము లత్యున్నతములై

నిట్రములుగనుండును. కనుచూపుమేరలో నచ్చటచ్చటఁ జిన్నిపొలములు, గుడిసెలు గాన్పించుచుండును. ప్రజలవేషములుగూడ మార్పు జెందును. మార్గము నిమ్నోన్నతముగనుండును. ఇదియే షేర్పా జన్మభూమి. ఇంతవఱకు యాత్రికులు ప్రాచ్య దిశోన్ముఖ గమను లగుచుండిరి. ఇఁకమీఁదట ధూద్‌కోశీనది లోయలో దిగవలసియున్నది. ఇట్టిదియేగదా మహామహుఁడు, ప్రవరాఖ్యుఁడుగాంచిన,

'నికట మహాగ్రతట నిర్గత నిర్ఝర ధారఁబాసి, లో
యకుఁ దలక్రిందుగా మలఁకలై దిగుకాలువవెంటఁబూచు మ
ల్లిక లవలంబనంబుగ నలిప్రకరధ్వని............'

రేగు నమరసౌందర్యసీమ! ఈనది ఎవరెస్టు శిఖరప్రాంతమునుండి పరిశుభ్రనీల జలముల మహోద్ధృతముగఁ బ్రవహించుచుండును. పండ్రెండువేల యడుగులయెత్తునుండి యాత్రికదళ మిపుడు క్రిందికిదిగి యుత్తరముఖముగఁ బయనింపవలయును. హిమాలయప్రాంతములలోఁ బెక్కునదీప్రవాహము లెన్నియో వంపులుదిరిగి ప్రవహించుచుంట నవి మార్గమును బలుచోట్ల నడ్డగించుచుండును. అందుచే నీవలిగట్టునుండి యావలిగట్టుకుఁ ద్రాటివంతెనలు, వెదురువంతెనలు నిర్మించికొని, యందలిప్రజలువానిని దాటుచుందురు. ధూద్‌కోసీనదిని వెదురువంతెన దాటి యాత్రికులు సాగిపోయిరి. ఇపుడు మార్గమంతయుఁ బర్వతముల నాశ్రయించి పెఱిగిన సాంద్రారణ్యములతోను, నిట్రముగనుండు పెద్ద శిలలతోను, నిరుకైన సందులతోను నిండియుండెను. మఱికొన్నిచోట్ల నొకొక్కరు మాత్రమే నడచుటకు వీలగు సన్నని కాలిబాట లుండును. ఆబాట కొకపార్శ్వమునంటి మహోన్నత పర్వత మాకాశవీధినానుచుండ నెదురు పార్శ్వమున బ్రహ్మాండమై చూపఱుల భయకంపితులఁజేయు లోయలుండును. నడచునపు డేమాత్రము జాగరూకతఁ దప్పినఁ గాలు

జారి యమాంతముగ నా లోయలలోనికి దొరలిపోవుట తథ్యము. ఇవన్నియుఁ బర్వతముల సంచరించు నపు డెదుర్కొనవలసిన ప్రమాదములు. ఈ ప్రమాదములను ధూద్‌కోశీ నదిని మఱలమఱల దాటుచు యాత్రికులు చెక చెక సాగిపోవుచుండిరి. ఎటనో దూరమున నున్నత పర్వతాగ్రములనుండి ప్రచండ వేగమునఁ గ్రిందికి దూకు జలపాతముల శబ్దములు పర్వతముల నావరించిన నిశ్శబ్దతను బొఱఁదోలుచుండును. యాత్రికుల బాట విరియఁబూసిన పూల మొక్కలనడుమ వంపుసొంపులు ఒయ్యారములు మీాద సాగుచున్నది. బాట కిరు వైపుల వన్నె చిన్నెలు మీాఱ విరియఁ బూచిన పూల తావి నాఘ్రాణించుచు వారు వెడలు చుండిరి. పర్వతముల దరు లన్నియు మధూదయవేళ రంగుల పూల వస్త్రముల ధరించి తమ సహజ కాఠిన్యమును గప్పిపుచ్చికొనినవి. పర్వతాగ్రముల వీక్షించినను, లోయల నవలోకించినను, వసంతుని వేయి లీలలుః స్ఫాయద్రీతులఁ జూపఱు గన్నులఁ జెదరఁ జేయుచున్నవి. ఆయందములా హిమాలయమునకే చెల్లును! ఈయతిలోక మోహన పర్వత లోకములో నివసించు షేర్పాలెంతటి యదృష్టవంతులో! ఇట్లు ప్రయాణము సేయుచు మార్చి యిరువదియైదవ వాసరమున యాత్రికదళము సోలాఖుంభూ మండలమున ముఖ్యమైన నాంచేబజార్ గ్రామమును బ్రవేశించెను.

యాత్రికదళము నాహ్వానించు నిమిత్తము బంధుమిత్రులు గౌరవ పురస్సరముగ చాంగ్, తేయాకు, పానీయములనిచ్చిరి. చాంగ్ పానీయము బియ్యపుగంజితో తయారుసేయుదురు. అది షేర్పాల పానీయములలో నొకటి. పాశ్చాత్యులకుగూడ నీపానీయములు గౌరవభాజనముగ నొసఁగిరి. నాంచేబజారుగ్రామము సోలాఖుంభూ మండలమున ముఖ్యకేంద్ర మైనను, నెక్కువగృహములు లేవు. రంగురంగుల వస్త్రములు ధరించి షేర్పాలా గ్రామమునకు వచ్చుచుఁబోవుచునుందురు. ఈగ్రామము

చుట్టును దుహినాంబరముల వల్లెవాటుగ ధరించిన యుత్తుంగశృంగములు, గూడి యాపురినిఁ గాచుచుండును. అచట భారత ప్రభుత్వము నకుఁ జెందిన రేడియో నిలయమున్నది. ఎవరెస్టు శిఖరారోహణమున నీ రేడియో నిలయము యాత్రికుల కెన్నివిధములతో సాహాయ్యము జేసెను. దానఁజేసి సర్ జాన్ హంట్ రేడియో అధికారులకు దన కృతజ్ఞత నుచితరీతిని వెలిఁబుచ్చెను.

నామ్చే బజారు గ్రామమున నున్నప్పుడు పర్వతారోహకదళము ఇంజాఖోలా (Inja-khola) నది కావలిప్రాంతముఁ జూడఁ గుతూహల పడి యొక కొండనెక్కిరి. తలపని తలంపుగ ఎవరెస్టు శిఖరసార్వభౌముఁడు, దన శత్రువీర ప్రకాండులకుఁ బునర్దర్శనభాగ్యమును గలుగఁ జేసెను. ఇపుడు ఎవరెస్టు శిఖరమునకు మఱింత దగ్గఱగనుండుటచే దాని సహజరూపవిశేషముల బాగుగ, బరిశీలింపఁగలిగిరి. తచ్ఛిఖరాగ్ర భాగముమాత్రము వారికగపడుచుండెను. పరిసర శిఖరములపై నధికార మొనర్చు సార్వభౌమునివలె ఎవరెస్టు మహోన్నతస్థాన మాక్రమించి యుండెను. దానిముందుఁ గొదమ శిఖరములు భృత్యులవలె నణఁగి మణఁగి యున్నటులుండెను. హిమము దానినాచ్ఛాదింపక పోవుటచే శిఖరాగ్రభాగ మంధకారవర్ణముతో నొప్పుచుండెను. శిరముఁ జక్కగ వంచి మహాదర్పమునుజాటు శత్రువును జూచి పర్వతారోహకుల యుత్సాహ మతిశయించెను. ఒక్కొక్కరికిని నదృష్టముండినఁ దామే యాశిఖరాగ్రముపై నిలిచి, నలుదిక్కులఁ బరిశీలింపఁగలమేమో యను నాశలు వారిహృదయ సరోవరములఁ బద్మములవలె వికసించుచుండెను. కొంతకాలమా శిఖరమునువీక్షించి వారువెనుకకు మఱలిరి.

యాత్రికదళము నాంచేబర్ గ్రామమును వీడి ఖూమ్జంగ్ గ్రామము జేరెను. అచటఁగూడ వీరికి బంధుమిత్రపరివారము, క్రొత్త

వారిని వింతగాఁజూడ నుత్సుకపడుచు, స్వాగతము రచించెను. ఆగ్రామము పేస్పుట త్యాంగ్ బోచ్ గ్రామము. పాశ్చాత్య పర్వతారోహకుల దృష్టిని త్యాంగ్ బోచ్ గ్రామము లోకోత్తరసౌందర్యరాశి. ఆగ్రామపాన్న త్యము సుమారు పండ్రెండువేల యడుగుల దరిదాపున నుండును. అటఁ బ్రఖ్యాతిగాంచిన బౌద్ధమఠము గలదు. మఱియు విశాలమైన మైదాన మున్నది. దాని కొకవైపునఁ గొంచెమెత్తుగ బౌద్ధమఠము, దానిచుట్టు గొన్ని యిండ్లును గలవు. ఆ మఠమునకెదురుగఁ గొలఁదిదూరమున నాకు పచ్చని చిన్నిచిన్ని పొదలు, (Birch Fir) బర్చ్ ఫర్ వృక్షములు దట్ట ముగఁ బెరిగియున్నవి. గ్రామమునుజుట్టి యెత్తైన తెల్లనిగోడలవలెఁ బర్వతము లున్నవి. గ్రామముమధ్యనిల్చి చుట్టు గలయఁజూచిన నెవరెస్టు నంగరక్షకు లనఁదగు లోట్సె (Lhotes), నూప్సె (Nuptse), శిఖర ములు, వానిముఖములనుండు హిమానీనదులు, మిక్కిలి యచ్చెరు వొందఁజేయు సహజసౌందర్యముతో నలరారు అమాడబ్లాం శిఖరము, నాగ్నేయదిక్కున కాంగ్ టేగా, తామ్ సేర్కూ శిఖరములు, నైఋతి దెశను క్వాంగ్ డి శిఖరము గనుపించును.

పర్వతప్రాంత సహజలావణ్య ముట్టిపడుచుఁ, బ్రశాంతమై, యాహ్లాదము గొల్పు త్యాంగ్ బోచ్ గ్రామమున మార్చి యిరువదేడవ నాటికిఁ జేరి పర్వతారోహకులు దమ ముఖ్యశిబిరము నచ్చోటనే నిర్మించిరి.

చుట్టును దుహినాంబరముల వల్లెవాటుగ ధరించిన యుత్తుంగశృంగములు, గూడి యాపురినిఁ గాచుచుండును. అచట భారత ప్రభుత్వము నకుఁ జెందిన రేడియో నిలయమున్నది. ఎవరెస్టు శిఖరారోహణమున నీ రేడియో నిలయము యాత్రికుల కెన్నివిధములనో సాహాయ్యము జేసెను. దానఁజేసి సర్ జాన్ హంట్ రేడియో అధికారులకు దన కృతజ్ఞత నుచితరీతిని వెలిఁబుచ్చెను.

నామ్చే బజారు గ్రామమున నున్నప్పుడు పర్వతారోహకదళము ఇంజాఖోలా (Inja-khola) నది కావలిప్రాంతముఁ జూడఁ గుతూహల పడి యొక కొండనెక్కిరి. తలపని తలంపుగ ఎవరెస్టు శిఖరసార్వభౌముఁడు, దన శత్రువీర ప్రకాండులకుఁ బునర్దర్శనభాగ్యమును గలుగఁ జేసెను. ఇపుడు ఎవరెస్టు శిఖరమునకు మఱింత దగ్గఱగనుండుటచే దాని సహజరూపవిశేషముల బాగుగ, బరిశీలింపఁగలిగిరి. తచ్ఛిఖరాగ్రభాగముమాత్రము వారికగపడుచుండెను. పరిసర శిఖరములపై నధికార మొనర్చు సార్వభౌమునివలె ఎవరెస్టు మహోన్నతస్థాన మాక్రమించి యుండెను. దానిముందుఁ గొదమ శిఖరములు భృత్యులవలె నణఁగి మణఁగి యున్నటులుండెను. హిమము దానినాచ్ఛాదింపక పోవుటచే శిఖరాగ్రభాగ మంధకారవర్ణముతో నొప్పుచుండెను. శిరముఁ జక్కగ వంచి మహాదర్పమునుజాటు శత్రువును జూచి పర్వతారోహకుల యుత్సాహ మతిశయించెను. ఒక్కొక్కరికిని నదృష్టముండినఁ దామే యాశిఖరాగ్రముపై నిలిచి, నలుదిక్కులఁ బరిశీలింపఁగలమేమో యను నాశలు వారిహృదయ సరోవరములఁ బద్మములవలె వికసించుచుండెను. కొంతకాలమా శిఖరమునువీక్షించి వారు వెనుకకు మఱలిరి.

యాత్రికదళము నాంచేబ ర్ గ్రామమును వీడి ఖూమ్‌జంగ్ గ్రామము జేరెను. అచటఁగూడ వీరికి బంధుమిత్రపరివారము, క్రొత్త

వారిని వింతగాఁజూడ నుత్సుకపడుచు, స్వాగతము రచించెను. ఆగ్రామము పేమ్పుట త్యాంగ్ బోచ్ గ్రామము. పాశ్చాత్య పర్వతారోహకుల దృష్టిని త్యాంగ్ బోచ్ గ్రామము లోకోత్తరసౌందర్యరాశి. ఆగ్రామౌన్న త్యము సుమారు పంద్రెండువేల యడుగుల దరిదాపున నుండును. అటఁ బ్రఖ్యాతిగాంచిన బౌద్ధమఠము గలదు. మఱియు విశాలమైన మైదాన మున్నది. దానికొకవైపునఁ గొంచెమెత్తుగ బౌద్ధమఠము, దానిచుట్టు గొన్నియిండ్లును గలవు. ఆ మఠమునకెదురుగఁ గొలఁదిదూరమున నాకు పచ్చని చిన్నిచిన్ని పొదలు, (Birch Fir) బర్చ్ఫర్ వృక్షములు దట్ట ముగఁ బెరిగియున్నవి. గ్రామమునుజుట్టి యెత్తైన తెల్లనిగోడలవలెఁ బర్వతము లున్నవి. గ్రామముమధ్యనిల్చి చుట్టు గలయఁజూచిన నెవరెస్టు సంగరక్షకు లనఁదగు లోట్స్ (Lhotes), నూప్స్ (Nuptse), శిఖర ములు, వానిముఖములనుండు హిమానీనదులు, మిక్కిలి యచ్చెరు వొందఁజేయు సహజసౌందర్యముతో నలరారు ఆమాడబ్లాం శిఖరము, నాగ్నేయదిక్కున కాంగ్ టేగా, తామ్ సేర్కూ శిఖరములు, నైఋతి దిశను క్వాంగ్ డి శిఖరము గనుపించును.

పర్వతప్రాంత సహజలావణ్యా ముట్టిపడుచుఁ, బ్రశాంతమై, యాహ్లాదము గొల్పు త్యాంగ్ బోచ్ గ్రామమున మార్చి యిరువదేడవ నాఁటికిఁ జేరి పర్వతారోహకులు దమ ముఖ్యశిబిరము నచ్చోటనే నిర్మించిరి.

---

# 6

# సమస్య

ఇంతవఱకుఁ బదియాత్ర లీ ఎవరెస్టు శిఖర మధిరోహింప జరిగి నప్పటికిని విజయము చేకుఱలేదు; చిక్కినటు చిక్కి తుదకు జారి పోవుచుండెను. మానవ పాదస్పర్శఁ దగులనీక యింతకాల మీ యెవరెస్టు శిఖరాగ్రమును రక్షించు ప్రబలశక్తు లిట్టివని తెలిసియు మానవులు వానిని జయింప లేకున్నారు. శిఖరారోహణ సంబంధ సాంకేతిక విజ్ఞాన నైపుణ్యాభివృద్ధి యత్యద్భుత మైనప్పటికినిఁ, దదౌన్నత్య సంబంధకారణములే, శిఖరాగ్రమును జేరుట కడ్డపడుచున్నవని పర్వతారోహకులు పలువు రభిప్రాయపడుచున్నారు. అత్యున్నత పర్వతారోహణ సాధింపఁ బూనుకొను సాహసవర్తనుల నెదుర్కొను నవరోధములు మూడు విధములు. ఇవి ప్రబలతమనైసర్గికములు. అందు నిట్టనిడివైన మహోన్నత పర్వతముల నధిరోహించుట మొదటిది. క్షణక్షణమునకు మార్పులుచెందు వాతావరణ పరిస్థితి రెండవది. ఆరోహణ మార్గమున హిమానీ నదులు, గండశైలములు బిలద్వారములు గలిసి మూడవది. హిమాలయమువంటి మహాపర్వతాంతర సీమలో నీ యవరోధములఁ దరించుట కత్తిపై సామువంటిది.

ఆ మూఁట మొదటిది, యౌన్నత్యము. ఎవరెస్టు శిఖరాగ్ర భాగము లత్యున్నతము లగుటచే నందలి వాయుసాంద్రత చాల స్వల్పముగ నుండును. దానఁజేసి ప్రాణవాయువుకూడఁ దగ్గియుండును. అట్టి గాలి పీల్చుటవలనఁ బర్వతారోహకులు బహు కష్టముల పాలగుచుందురు. వారి గమన వేగము క్రమగతి క్షీణించును. అయోమయ పరిస్థితి యేర్పడును. అధైర్యము హెచ్చును. ఆహార నిద్రా పానీ

యావశ్యకత తగ్గును. ఈలక్షణము లన్నియు, సుమారిరువదివేల యడుగుల యెత్తులోనే పర్వతారోహకుల బాధింప మొదలిడును. ఇంకఁ పై వాతావరణస్థితిఁ దత్ఫలితములఁ గూర్చి చెప్పవలయునె? కావుననే యీయవరోధము దాటుట కేదైన యుపాయ మొకటి యవసరము. నూత్న వాతావరణమున కభ్యాస పడుటయే యుపాయము. క్రమముగ నున్నత స్థలములలో సంచరించుటచే నచ్చటి వాతావరణ పరిస్థితులకు మన శరీర మలవాటు పడును. ఈ పద్ధతి కాలయాపనానుసరణీక మైనను మిక్కిలి యుపయోగకరమైనది. పూర్వయత్నములలోఁ బర్వతారోహకు లన్నివిధములనే వర్తించిరి. కాని యది పూర్తి ప్రయోజనకారి కాలేదు. 1924 లో నార్టన్ ఇరువ దెనిమిదివేల నూట యిరువదారడుగుల వఱకే వెళ్ళఁ గలిగెను. సామాన్యముగ నిరువ దెనిమిదివేల యడుగుల మేరకు వెళ్ళ నోపిన పర్వతారోహకుల శక్తి పూర్తిగ వినియోగ మగును. కావుననే యిరువదివేల యడుగుల వఱ కధిరోహించిన పర్వతారోహకులకు నొకటి రెండు దినములు విశ్రాంతి యవసరము. తత్సంపాదనకై గుడారములఁ బ్రత్యేకాహార పానీయములఁ, బడక సంచులు, నాయెత్తునకుఁ జేర్చు సహాయ వస్తువాహక పర్వతారోహక వర్గ మత్యవసరము. ఇవన్నియు నేర్పడినచో శిఖరాగ్రమును జేరఁగల యవకాశ ముండవచ్చును. పూర్వ పర్వతారోహకుల యనుభవ జ్ఞానమును బట్టి ప్రాణవాయు సాధనము లిరువదివేల యడుగుల యెత్తునుండియే యుపయోగించుట క్షేమకరమని తేలినది.

మఱియొక విశేషము గూడ గలదు. సుమారిరువదివేల యడుగుల పైని వాతావరణావరోధము లుండుటచే శిబిరములు దగ్గఱ దగ్గఱగా నిర్మించుటయు, అవసరమైన సామగ్రి నందుఁ జేర్చుటయు వలసిన పనులు. ఈ పనులు చాల నెమ్మదిగ జరుగవలసినవి కావు,

# 6

## సమస్య

ఇంతవఱకుఁ బదియాత్ర లీ ఎవరెస్టు శిఖర మధిరోహింప జరిగినప్పటికిని విజయము చేకుఱలేదు ; చిక్కినటు చిక్కి తుదకు జారి పోవుచుండెను. మానవ పాదస్పర్శఁ దగులనీక యింతకాల మీా యెవరెస్టు శిఖరాగ్రమును రక్షించు ప్రబలశక్తు లిట్టివని తెలిసియు మానవులు వానిని జయింప లేకున్నారు. శిఖరారోహణ సంబంధ సాంకేతిక విజ్ఞాన నైపుణ్యాభివృద్ధి యత్యద్భుత మైనప్పటికినిఁ, దదౌన్నత్య సంబంధకారణములే, శిఖరాగ్రమును జేరుట కడ్డపడుచున్నవని పర్వతారోహకులు పలువు రభిప్రాయపడుచున్నారు. అత్యున్నత పర్వతారోహణ సాధింపఁ బూనుకొను సాహసవర్తనుల నెదుర్కొను నవరోధములు మూడు విధములు. ఇవి ప్రబలతమనైసర్గికములు. అందు నిట్టనిడివైన మహోన్నత పర్వతముల నధిరోహించుట మొదటిది. క్షణక్షణమునకు మార్పులుచెందు వాతావరణ పరిస్థితి రెండవది. ఆరోహణ మార్గమున హిమానీ నదులు, గండశైలములు బిలద్వారములు గలిసి మూడవది. హిమాలయమువంటి మహాపర్వతాంతర సీమలో నీ యవరోధములఁ దరించుట కత్తిపై సామువంటిది.

ఆ మూఁట మొదటిది, యౌన్నత్యము. ఎవరెస్టు శిఖరాగ్ర భాగము లత్యున్నతము లగుటచే నందలి వాయుసాంద్రత చాల స్వల్పముగ నుండును. దానఁజేసి ప్రాణవాయువు కూడఁ దగ్గియుండును. అట్టి గాలి పీల్చుటవలనఁ బర్వతారోహకులు బహు కష్టముల పాలగుచుందురు. వారి గమన వేగము క్రమగతి క్షీణించును. అయోమయ పరిస్థితి యేర్పడును. అధైర్యము హెచ్చును. ఆహార నిద్రా పానీ

యావశ్యకత తగ్గును. ఈలక్షణము లన్నియు, సుమా రిరువదివేల యడు గుల యెత్తులోనే పర్వతారోహకుల బాధింప మొదలిడును. ఇంక ఁ బై వాతావరణస్థితిఁ దత్ఫలితములఁ గూర్చి చెప్పవలయునె? కావుననే యీయవరోధము దాటుట కేదైన యుపాయ మొకటి యవసరము. నూత్న వాతావరణమున కభ్యాస పడుటయే యుపాయము. క్రమ ముగ నున్నత స్థలములలో సంచరించుటచే నచ్చటి వాతావరణ పరి స్థితులకు మన శరీర మలవాటు పడును. ఈ పద్ధతి కాలమూనానుసర ణికమైనను మిక్కిలి యుపయోగమైనది. పూర్వయత్నములలోఁ బర్వతారోహకు లిట్టిపద్ధతి వర్తించిరి. కాని యది పూర్తి ప్రయో జనకారి కాలేదు. 1924 లో నార్టన్ ఇరువ దెనిమిదివేల నూట యిరువదారడుగుల వఱకే వెళ్ళఁ గలిగెను. సామాన్యముగ నిరువ దెనిమిది వేల యడుగుల మేరకు వెళ్ళ నోపిన పర్వతారోహకుల శక్తి పూర్తిగ వినియోగ మగును. కావుననే యిరువదివేల యడుగుల వఱ కధిరోహించిన పర్వతారోహకుల కు నొకటి రెండు దినముల విశ్రాంతి యవసరము. తత్సంపాదనకై గుడారములుఁ బ్రత్యేకాహార పానీ యములుఁ, బడక సంచులు, నాయెత్తునకుఁ జేర్చు సహాయ వస్తువాహక పర్వతారోహక వర్గ మత్యవసరము. ఇవన్నియు నేర్పడినచో శిఖరాగ్ర మును జేరఁగల యవకాశ ముండవచ్చును. పూర్వ పర్వతారోహకుల యనుభవ జ్ఞానమును బట్టి ప్రాణవాయు సాధనము లిరువదివేల యడుగుల యెత్తునుండియే యుపయోగించుట క్షేమకరమని తేలినది.

మఱియొక విశేషము గూడ గలదు. సుమా రిరువదివేల యడుగుల పైని వాతావరణావరోధము లుండుటచే శిబిరములు దగ్గఱ దగ్గఱగా నిర్మించుటయు, అవసరమైన సామగ్రి నందుఁ జేర్చుటయు వలసిన పనులు. ఈ పనులు చాల నెమ్మదిగ జరుగవలసినవి కాన,

నున్నత పర్వతారోహణానుభవముగల వస్తువాహకు లధికముగ నుండ వలయును.

ఈవిధముగ నున్నత శిబిరములు, సహాయ పర్వతారోహకులు, ప్రాణవాయు సాధనములు, నీత్రివిధాంగకములతో నౌన్నత్యావరోధముల జయప్రదముగ నెదుర్కొన వచ్చును. ఇఁక రెండవదైన వాతావరణావరోధ మత్యంత ప్రధాన ప్రమాద భయంకర పరిస్థితులతోఁ గూడుకొనునది. సాధారణముగ ఎవరెస్టు శిఖరారోహణ మసాధ్య మగుట కీ వాతావరణావరోధమే ప్రబలకారణము. సర్ జాన్ హంట్ ఎవరెస్టు యాత్రను గురించి ప్రఖ్యాత పర్వతారోహకుఁడైన మేజర్ జనరల్ హెచ్ విలియమ్స్, ఈ క్రింది విధముగ నభిప్రాయపడెను. "సర్ జాన్ హంట్ విజయ మంతయు ననిర్వాచ్య వాతావరణ పరిణామములపై నాధారపడియున్నది. వాతావరణావరోధము దప్ప మిగిలిన వేవియు వారి నెదుర్కొనఁజాలవు. వాని నన్నిఁటిని జయింపఁగల యుపాయాదికము లన్నియు వారికడ నున్నవి." ఈ వాక్యములఁబట్టి యెవరెస్టు శిఖరారోహణలోఁ దద్వాతావరణ మెంత ప్రబలతర శత్రువో, యూహింపనగును. సాధారణముగఁ బర్వతారోహణలో నావాతావరణ మొక గొప్ప యడ్డు. ఈ వాతావరణము దుర్భర శీత వాతములచేఁ గొన్ని వేళల నారోహకుల మార్గాంతర, తలాంతరములఁ గొనిపోయి వేయిచిక్కులఁ బాల్పడఁజేయును. సాధారణ పర్వతారోహణలోఁ దదంతర వాతావరణ మేదైన నిట్టి మాయలఁ బన్నిన నిఁక హిమాలయ సానుతలాంతర వీథుల నెన్ని విచిత్ర వేషములఁ దాల్చి, తాల్పించి, నెందఱ నెన్ని రీతుల బాధించెడిదో!

ఎవరెస్టు శిఖరారోహణ చరిత్రఁ బరిశీలించినఁ దదారోహణానుకూలమైన కాలము, మే, యక్టోబరు మాసములు మాత్రమని దెలియు

నాను. అదియుఁగాక యారోహణ ప్రయత్నము లన్నియు ముఖ్యముగ మే లోనే జరిగియుండుట మనము చూతుము. స్విస్ పర్వతారోహకదళము మాత్రము 1952 అక్టోబరులో ద్వితీయారోహణముఁ గొనసాగింప యత్నించెను. గాని యచిరకాలముననే విఫలమాయ్యెను. ఇట్టి పరిస్థితులకుఁ గతమేదియో యొకింత గమనింతము.

నవంబరు మాసమునుండి మార్చినెల కొనవఱకు ఎవరెస్టు పరిసరములలో వాయవ్య దిశనుండి శీతల ఝంఝా మారుతములు నిరాఘాటముగ వీచుచుండును. ప్రళయ ఘోషణములు గల యా వాయవ్య పవన వేగముఁ జూడఁ దచ్ఛిఖరమునే బ్రద్దలుసేసి యాకాశ వీథుల నెచ్చోటికిఁ గొనిపోవునో యన్ భ్రాంతి జనించును. అటు లా పవనములు ఎవరెస్టు ఉత్తరముఖమును దాకి దక్షిణ ముఖముపై ముమ్మరముగ మంచును గ్రుమ్మరించుచుండును. దక్షిణ ముఖముపై నిట్లు గుమ్మరింపఁబడిన మంచు త్వరలో గడ్డ కట్టును. అప్పు డప్పుడీగడ్డమంచు బీటలు వాఱి, తావు తొలఁగ బ్రహ్మాండమైన గండశైల రూపమున గ్రింది కశనిపాతమువలె దూకును. శీతకాలములో నిట్లు నిరంకుశముగ నీ వాయవ్య పవనములు శీతగిరి పరిసరముల వీచుచుంట నీకాలములోఁ బర్వత శిఖరారోహణ దుస్సాధ్యము.

ఇఁక మే కొననో, జూన్ మొదటనో, నైఋతి ఋతుపవన సమేతమై వేసవి రంగమునఁ బ్రవేశించును. తత్ఫలితముగ హిమవత్పర్వత శ్రేణుల సాంద్రనీహార మావరించును. అటు పిమ్మటఁ గ్రొక్కారు మొయిళ్లా పర్వతముల నాచ్ఛాదించును. అనంతరము కుంభవర్షములు, హిమవృష్టి, ప్రచండ పవనములు, ఎవరెస్టు శిఖర ప్రాంతముల మంచి లేవనెత్తును. కొన్ని కొన్ని సమయములలో మేఘముల వెనుక నున్న పర్వత శ్రేణుల దాఁచును. ఆ ప్రాంతము లన్నియు మహా భయంకర

దృశ్యములతో నిండి యుండును. కావున శిఖరారోహణ కది తగిన సమయముగాదు. సెప్టెంబరు మాసాంతము వఱకీ ఋతుపవన ప్రభావ మందుఁ గాన్పించుచుండును. అక్టోబరు మాసములోఁ బర్వతారోహణ కనుకూల వాతావరణ మేర్పడునుగాని ప్రాచ్యహిమాలయోత్తుంగ శృంగారోహణ యపుడు సాధ్యము గాదు. వీని నిట్లు బరిశీలించినచో శిఖరారోహణ కనుకూలించు వాతావరణము సంవత్సరములోఁ జాల పరిమితముగనే యున్నట్లు మనకు విశదమగును. ఈరీతి నౌన్నత్యవాతావరణములు రెండును నేకమై పర్వతారోహకుల శక్తిని హరించుచుఁ గాల విలంబనమునకు దారిఁ దీయుచు, వారి యుత్సాహమును, జల్లార్చి యాత్మవిశ్వాస నాశమునకుఁ గారణభూతము లగుచున్నవి. అయినచో నీ యవరోధముఁ దరించు మార్గ మేది? గమనవేగాభివృద్ధి వాతావరణాభ్యాసము, నను పద్ధతులే యాచరణయోగ్య మైనవి. అదియుఁ గాక యున్నత పర్వతారోహకుల కవసరమగు వాతావరణ రక్షణ విశ్రాంతుల సమకూర్చవలెను. ప్రాణవాయు వీ యవరోధశక్తుల కవధు లేర్పఱచి పర్వతారోహకుల పాలిటి పెన్నిధి యగుచున్నది.

పైఁ జెప్పిన త్రివిధావరోధములఁ జిట్టచివర దానినిఁ గూర్చి చర్చింతము. ఇయ్యది ముఖ్యముగ ఎవరెస్టు శిఖరాగ్రమున కేఁగు మార్గమును గూర్చి వివరించునది. . అందుచే ముందుగ ఎవరెస్టు శిఖర భౌతిక పరిసరముల విచారణ యవసరము. ఎవరెస్టు శిఖర మొక సార్వభౌముఁడు. ప్రపంచ పర్వత సామ్రాజ్యమునకు సార్వభౌమ పదవి నలంకరించినది ఎవరెస్టు. అతని దుర్గము హిమాలయము. నేపాళదేశము, భువనైక సుందర, మాతని రాచనగరు. లోట్సే, నూప్సే, మకాలు, చోవోయు, అన్నపూర్ణ, నందాదేవి, నంగ పర్వత్ గౌరీ శంకర్, కామెట్, మొదలగు శిఖర నికరములు సామంతులు.

అసంఖ్యాక దీర్ఘపర్వతశ్రేణులు దుర్గమారణ్యాక భూములు, ఆభీలము లైన లోయలు, భయోత్పాదకములైన హిమనీనదులు, నాచక్రవర్తి చమూపతులు. హిమము, తద్వృష్టి తుషారములు, ప్రచండ ప్రళయ భీకర ఝుంఝూమారుత పయోధరము లాతని యంగరక్షకులు. ఇట్టి మహా వైభవముతో నా సమ్రాట్టు పర్వత సామ్రాజ్యము నేలు చున్నాడు. ఇట్టి మహోన్నత పర్వత సార్వభౌము నెదిరి, పోరి, గెల్చుట సామాన్యమే! ఈరాజేంద్రు గర్వాతిరేక పడచుట కెన్ని ప్రయత్నములో జఱిగినవి! విశ్వాస పాత్రులైన యాతని యంగ రక్ష కులనే గెలువ జాలరైరి!

ఎవరెస్టు సమీపమునుండి యెట్లు కాన్పించును? ఈ కౌతుకమే యెల్లర హృదయముల నే క్రొంచెమైన స్పందింపక మానదు భూమ్యా కాశముల నొకటిఁ జేయుచున్నదో యను సంతతి యజాండాకార ముతోఁ జూపరుల నాశ్చర్యచకితులఁ జేయఁగల శిఖర మీ యెవరెస్టు. దాని పరిమాణ మింతయని చెప్ప నెవరి తరము. అయ్యది చుక్క లకుఁ, జుక్కలతేనికిఁ గ్రీడారంగమా యను విభ్రాంతి కలుగక మానదు. అదియొక మహాశిల. దూరమునుండి చూచిన నింతేనా యనిపించును; గాని సమీపించిన కొలఁది యీ మహోన్నత శిలా పరిమాణము వృద్ధిఁజెందుచు,

"శా. ఇంతింతై, వటుఁడింతయై, మఱియు దానింతై, నభోవీథిపై
నంతై, తోయదమండలాగ్రమున కల్లంతై, ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై, ధ్రువుని పైనంతై మహర్వాటిపై
నంతై, సత్యపదోన్నతుం డగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై."

శ్రీమదాంధ్ర మహాభాగవత పురాణ గ్రంథాంతర్గత వామనావ తార కథా ఘట్టిత పద్యభావమును స్ఫురణకుఁ దెచ్చుచుండును,

అట్టి హిమశిలా రాశినిఁ బశ్చిమదిశనుండి సాగి, దక్షిణ దిశకు మఱలి తదగ్రముఁ జేరు నా మార్గమేదియో తెలిసికొనవలయును. నేపాళ టిబెట్టు దేశముల సరిహద్దుల నిలిచియున్న ఎవరెస్టు, లోట్సె, నూప్సె అను పేరఁ బఱగు శిఖరత్రయమున ఎవరెస్టు ప్రధానమైనది. ఈ శిఖర త్రయ మనుంగు మిత్ర త్రికమువలె నొకదాని నొకటిఁ బెనవైచి కొని, యన్యోన్య సహాయ క్రియల వర్ధిలుచున్నదా యను భావమును స్ఫురింపఁజేయుచుండును. వాని పరస్పర సామీప్యము చిత్రముగఁ గాన నగును. పూర్వాభిముఖులై నిలిచి యీశిఖర మిత్రత్రయ మును గాంచెదము. మనచూపు కెదురుగ లోట్సె శిఖరము గనిపించు చున్నది. దక్షిణపార్శ్వమున నూప్సె శిఖరము, నుత్తరపార్శ్వమున ఎవరెస్టు శిఖరము నుండి దానిఁ గాపాడుచున్నవా యనిన ట్లుండును. వీని నడుమ నొక యఖాతమైన లోయకలదు. దీనినే పర్వతారోహ కులు పడమటి లోయ (Western C W M) యని వ్యవహరింతురు. ఈలోయ పశ్చిమాభిముఖముగ సాగిపోవుచున్నది. దీనిజన్మస్థానము లోట్సె శిఖర పాదముకడ నున్నది. లోట్సె శిఖర ముఖోపరిభాగ మున హిమానీనది యొకటి బయలుదేరి, తత్పాదముల కడనుండు పడమటిలోయను గూడి పశ్చిమ దిశగఁ బ్రవహించుచున్నది. కావునఁ బడమటి లోయ కాకర స్థానము, లోట్సె శిఖర హిమానీనదియే యని చెప్పవలెను. ఈలోయను కబంధుని బాహువు లనఁ జెల్లు. ఆనూప్సె, ఎవరెస్టు దీర్ఘోన్నత బాహువులు బంధించియున్నవి. దాని కుత్తర దక్షిణ దిశల ఎవరెస్టు శిఖర పశ్చిమశ్రేణియు, లోట్సె, నూప్సె, శిఖ రముల సంధించు పర్వతశ్రేణియు, మహా దుర్గప్రాకారములవలె నిలిచి యున్నవి. ఇట్లు శిఖరత్రయమునఁ గేంద్రపీఠ మలంకరించు లోట్సె శిఖరపాద మాకరముగను, ఎవరెస్టు, నూప్సె శిఖరము లుత్తరదక్షిణ ముల సరిహద్దులుగను, గలిగి పశ్చిమాభిముఖమై ప్రవహించు పడ

వివిధ కార్యముల నిమగ్నులై యుండ ఛాయాగ్రాహక యంత్రము వెంట నిడికొని టాం స్టోబార్ట్ పర్వతారోహక కృత కార్యముల చిత్రములఁ దీయుచుండెను. నేను టైమ్సు పత్రికకు వార్తలు వ్రాయుచు లెఖలు పరిచూచుకొనుచుంటిని. యాత్రికదళము వెంట వచ్చిన మైక్ వార్డుకు తీఱిక దొరకుటయే లేదు. అతఁ డనేక రోగార్తుల కౌషధ సేవఁ జేయించుచుండెను."

త్యాంగ్ బోచ్ గ్రామమునఁ గల బౌద్ధమతాధికారుల యాహ్వానముపై నాటి మధ్యాహ్నము టెన్జింగ్ - ఛార్లెస్ వైలీలఁ దోడ్కొని సర్ జాన్ హంట్ మఠమును దర్శింపఁబోయెను. అచటి, మఠాధికారులు వీరిని యథోచితముగ సత్కరించిరి. భోజనానంతరము వారి రిష్ట గోష్ఠిలోఁ గాలముఁ గడుపుచుండఁ బ్రసంగవశమున మంచు మానిసి (Snow man) ప్రసక్తి వచ్చెను. హిమాలయ పర్వతముల మానవాకారమున మసలు వింతజంతువునే మంచు మానిసి యని వ్యవహరించు చున్నారు. ఇయ్యది కొన్ని సంవత్సరములుగాఁ బ్రపంచము నాశ్చర్య పెట్టుచున్నది. ఈ వింతజంతువును గూర్చి మఠాధిపతి యీ క్రింది విధముగ వర్ణించినట్లు హంట్ చెప్పుచున్నాఁడు. కొన్ని సంవత్సరముల క్రితమీ యేతి (Yeti) (షేర్పాభాష-మంచుమానిసి) త్యాంగ్ బోచ్ గ్రామ పరిసరములకు వచ్చిన విధ మతఁడు చెప్పెను. 'ఆ మఠాధిపతి మనసు కొన్ని సంవత్సరముల నాఁటి సంఘటనల వెదకుచు వెనుకకు మఱలి పోయినట్లుండెను. ఆలోచనాపరవశుఁడై యతఁడు దూరమునఁ బచ్చిక బయటిపైనుండు మా గుడారములఁ జూచెను. శీతకాలమున నొకనాఁడా చెట్ల గుబురులను నాటి బయటి కేతెంచి 'యేతి' చేసిన చేష్టలను, జర్యలను జక్కగ ననుకరించుచుఁ గన్నులఁ గట్టినట్లతఁడు వర్ణింప నారంభించెను. 'యేతి' యయిదడుగుల యెత్తుగల నాల్గుకాళ్ళ జంతువు.

చుట్టి పెట్టెను. మాసామాను లన్నియు గురుతుల ప్రకార మక్కడక్కడ నమర్చితిమి. మేము కొని వచ్చిన యిరువది గుడారముల నట నిర్మించితిమి. సామాను పెట్టెయల నొకదానిపై నొకటి యమర్చి చిన్నగదిఁ జేసి దానిపై టార్పాలిన్ (Tarpaulin) గప్పి వంట సాల నేర్పాటుసేసి, తాండూప్ వంటలో మునిఁగి యుండెను. మాతో వచ్చిన షేర్పాస్త్రీలఁ గొందఱు వంటపాత్రల శుభ్రము చేయుచుండిరి. కొందఱు దమ బట్టల బాగుచేసికొనుచుండిరి. మఱి కొందఱు తీరికఁ గూర్చొని శిరోజములఁ జిక్కుఁదీసి జడ లల్లికొనుచుండిరి.

మా యుదయాహారమైనది. పర్వతారోహకులెల్లరు గొన్ని జట్లుగ నేర్పడి తలకొకపనిఁ జేయుచుండిరి. మైక్ వార్డ్, బోర్డిలాన్ గలసి కొందఱికిఁ బ్రాణవాయు సాధనోపయోగముల నేర్పుచుండఁ గొందఱ షేర్పాల నొకచోఁ జేర్చి టెన్సింగ్ సహాయముతో కుక్స్, ప్రిమస్, స్టౌల నుపయోగించు పద్ధతులను ఎడ్మండ్ హిల్లరి ప్రదర్శించుచుండెను. మధ్యాహ్నము రేడియో ప్రదర్శనార్థము జార్జి బ్యాండ్ సన్నాహపడుచుండెను. బిలద్వారముల దాటుటకుఁ దెచ్చిన నిచ్చెనల నుపయోగించు విధమును మైకేల్ వెస్ట్‌మేకట్ కొందఱ షేర్పాలకు నేర్పుచుండెను. రెండు బండలపై నడ్డముగ నిచ్చెనఁ బెట్టి యుండ నొక షేర్పా దానిపైఁ బ్రాకుట నేర్చుచుండెను. ఒకచోఁ బర్వతారోహక వేషధారణాపరికరముల నెండలోఁ జక్కఁగ నారఁబెట్టి యుంచిరి. అప్పటికే యొక రిద్ద ఱా పరికరముల నొక టొకటిగా ధరించి తిరుగుచుండిరి. ఇవాన్స్, చార్లెస్ వైలీ లిద్దఱు వివిధ కార్య నిర్వహణ భారము పైఁబడుటచే విధివిరామము లేక యొకరితో నొకరు సంప్రదించుకొనుచుండిరి. వాతావరణాభ్యాస దళములకు వలయు భోజన సామాగ్రుల జార్జిబ్యాండ్ పంచిపెట్టుచుండెను. ఈ రీ విధముగ

# 7

## త్యాంగ్ బోచ్

మార్చి నెల యిరువదేడవ దినమున యాత్రిక దళము త్యాంగ్ బోచ్ గ్రామము చేరెను. రెండువారములు నిరంతరము పర్వతము లెక్కుచు, దిగుచుఁ బ్రయాణము చేసిన పిమ్మట రమణీయ దృశ్య విలోకనా జనిత హృదయాహ్లాదకరమౌ నీ గ్రామము వారికి స్వర్గ ధామముగ నుండెను. చైత్రయాత్రకు వెడలుట కవసరమైన సన్నాహములు చేసికొనుటయు, నూత్న వాతావరణము నలవఱచికొనుటకును, బరిపూర్ణ విశ్రాంతి గొనుటకును, త్యాంగ్ బోచ్ మజిలీ మిక్కిలి యోగ్యముగ నుండెను. ఆగ్రామము చేరినపిమ్మట యాత్రిక దళ నాయకుఁడు, సర్ జాన్ హంట్ పదినమున కాదినము జఱుగు కార్యములఁ దన దిన చర్య పుస్తకమున రచించుచుండెను. ఆపుస్తకమున మార్చి యిరువదెనిమిదవ దివసము త్యాంగ్ మజిలీ విశేషము లీ విధముగ నున్నవి.

“ రేపటి దినమున వాతావరణాభ్యాస (acclimatization) ప్రథమ దళము పర్వతములకుఁ బయనము గావలయును. కూలీలు మోసికొని వచ్చిన సామానుల సర్దుకొనవలసి యున్నది. అందుచే నెవ్వరికిఁ దీరిక యేమాత్రము లేకుండెను. ప్రతి మనుజుఁడు తేనెటీఁగ వలె నేదో యొకపనిఁ దీర్చికొనుచుండెను. కూలీల కీయవలసిన కూలి నిచ్చి వారినిఁ బంపివేసితిమి. మా పెట్టెలు, మేము, మా వేషములు, నాగ్రామస్థుల నెక్కుడుగ నాకర్షించెను. గుంపులు గుంపులుగ, మా వ్యవహార మెల్లఁజూడ నాగ్రామీణులు వచ్చిరి. ఆగుంపుల దూరముగ నుంచు నుద్దేశముతోఁ గొంత ప్రదేశము చుట్టును కెట్టింగ్ పెద్ద త్రాడు

ప్రస్తుత యాత్రికులు నూతన పథకమును రచించికొనిరి. అయినను వీరు గూడఁ బూర్వులవలె విషమ పరిస్థితుల కెదురీదుచు నా యెవరెస్టులో ముడిఁబెట్టికొనియున్న త్రివిధావరోధముల సాధింపవలయును.

గతమైన యెవరెస్ట్ యాత్రలలో సిద్ధహస్తులైన పర్వతారోహకులు గొంచె మించు మించు నిరువ దెనిమిదివేల మూఁడువందల యడుగుల వఱ కధిరోహింపఁ గలిగిరి. కర్నల్ నార్టన్, స్మిత్, వైన్ హారిస్, వేజర్, లాంబర్ట్, టెన్సింగ్, అను వారందరీ హద్దుకడ నిల్చిరి. ఆనాటి కామేర నధిగమించుటయే బహుతర కష్టసాధ్యమయ్యెను. సమగ్రముగ నాలోచించిన, నిఁక మిగిలిన యేడెనిమిది వందల యడుగులు మాత్రమే తరింపవలయును. ఇంద ఱెన్ని ప్రయత్నములు సేసినను, నామేరఁ దరింప లేకపోవుట కేమి కారణము ? ఏత ద్ప్రాంత వాతావరణమే ప్రబలావరోధముగాక ! అటులైనఁ బ్రాణవాయుసాహాయ్యమున నీమహార్ఘ్యావరోధమును దరింపవలెనని సర్ జాన్ హాంట్ నిశ్చయించెను.



కాల్ శిబిరమున విశ్రాంతిఁ గొనుచుండ వారికి సాహాయ్యముగ మఱి కొంద ఱరిగి దాదాపు రెండువేల యడుగులపైన మఱియొక శిబిరమును స్థాపించి క్రమ్మఱ సౌత్ కాల్ శిబిరమునకు రావలయును. ఏతచ్ఛిబిర నిర్మాణము సత్వర విజయ సాధనోపాయమగుట నిస్సందేహము.

సౌత్ కాల్ పర్వతముపై శిబిరస్థాపనమైన పిమ్మట శిఖరాగ్రమునుండి సౌత్ కాల్ వఱకు సాగివచ్చిన యాగ్నేయశ్రేణి (south-east ridge) ని దాటవలయును. ఈ శ్రేణి శిఖరాగ్రమునుండి సౌత్ కాల్ వఱకు సాగుచు మధ్యేమార్గమునఁగల దక్షిణశృంగము (South Peak) ను దాటుచున్నది. ఈ దక్షిణ శృంగౌన్నత్య మిరువదెనిమిదివేల యేడువందల యడుగులు. కనుక సౌత్ కాల్ పర్వతారోహణానంతర మాగ్నేయశ్రేణి నిర్మలాకృతి కానరాదు. దక్షిణ శృంగమునుండి శిఖరాగ్రమువఱకుఁగల మూఁడువందల యడుగుల దూరమే యారోహణాసాధ్యము గాదను సందేహము నాయకుల ధైర్యసంకలితహృదయములఁ జలింపఁజేయుచుండెను; గాని వైమానికులు గొని వచ్చిన ఛాయాచిత్ర పరిశీలనానంతర మాగ్నేయశ్రేణియే ప్రమాదమైనదని తేలెను. ఈశ్రేణికిఁ దూర్పుభాగమునఁగల ప్రపాతపుటంచుల నానికొని పవనములచేనేర్పడి దాదాపిరువదైదడుగుల మేరకు గడ్డమంచు సముద్రతరంగములవలె గాలి లోనికి విస్తరించియుండును. చిన్నహిమానీనదివలెనుండు నీమంచు మఱల నొక ప్రబలావరోధము. మఱియు దక్షిణ శృంగమునుండి ఎవరెస్టు శిఖరముఁ జేరుట కనన్యసాహసక్రియాదక్షు లేకాగ్రచిత్తులై యధిరోహింపవలయును. అట్టి పర్వతారోహకసాహసమూర్తులఁ దీర్చి దిద్దుటకు కృషి యవసరము!

ఎవరెస్టు శిఖరారోహణలోఁ బూర్వపర్వతారోహకు లెల్లరీ కష్టములఁ జవిఁ జూచినవారే! వారి యనుభవములఁ బురస్కరించుకొని

తప్పించుకొనెను. కాని యీహిమశైలపతనమే యెదురుగు షేర్పాలఁ దనపాట్టఁబెట్టికొని శాంతిఁ జెందెను. కావున నీ హిమశైలపత నములు హిమాలయ దుర్గరక్షకులైనను నపరమృత్యు దేవతారూపము లనఁదగును.

ఎటులనో పడమటి లోయను దాటి దాని పుట్టినిల్లగు లోట్సెను సమీపించితిమి. లోట్సె పశ్చిమ ముఖ మెట్లున్నది? ఎవరెస్టు శిఖర మును స్పృశించుట కా శిఖరముఖముపై కి నడచినఁగాని వలనుపడదు. లోట్సె పశ్చిమముఖము నిట్టనిడివిగ దాదాపు నాల్గువేల యడుగుల యెత్తుగలది. అయ్యది సర్వదా హిమప్రావృతమైనది. కనుక తదా రోహణ మతివిషమ ఘట్టము. అదృష్టవశమున దాని నాని కొని మిత్రునివలె సౌత్ కాల్ పర్వతమున్నది. లోట్సె ఎవరెస్టు శిఖర ముల సంధించు పర్వతశ్రేణికి సౌత్ కాల్ అనిపేరు. ఇది యిరువదారు వేల యడుగుల యున్నతిని సర్వకాలముల హిమాచ్ఛాదితమైయుండును. నిట్రముగ వియత్తలవీథులకెగసి యుండుటచేఁ బర్వతారోహకులు మెల్లగ దీని నధిరోహించవలెను. సౌత్ కాల్పైఁ జేరుసరికిఁ బర్వతారోహకుల యలసట హద్దుమీఱిపోవును. ఒకటి రెండు దినముల విశ్రాంతి వారి కపు డత్యావశ్యకము. తదనంతరము మూడువేల యడుగుల యెత్తు కెక్కిన శిఖరాగ్రమును జేరవచ్చును. సౌత్ కాలపర్వతమును దాటి ఎవరెస్టు శిఖరాగ్రభాగముల శిబిరములు నిర్మించుటకు వస్తువాహక పర్వతారోహకులు పలువు రవసరము. శిఖరాగ్రభాగము నధిరోహించు వారి విశ్రాంతి కవసరమైన యాహార పానీయాదుల నాసౌత్ కాల్ శిబిరమునకు దీసికొనిరావలయును. పర్వతారోహకుల పాట్లెటులున్నను వస్తువాహకుల శరీరము లాపాదమస్తకము లత్యాయాసవశమున నిర్వీ ర్యము లగును. శిఖరాగ్రము నేరఁబోవు పర్వతారోహకులు సౌత్

ఇది లోట్సె శిఖర పాదముల జన్మించి యిరువది రెండు వేల యడుగుల యెత్తునుండి పశ్చిమాభిముఖియై ప్రవహించి క్రమముగఁ బందొమ్మిదివేల యడుగుల వఱకు దిగుచున్నది. ఇచ్చోటనే యీ పడమటి లోయ సింహద్వార మనఁబఱగు ఖుంబూ హిమానీనది (Khumbu Icefall) జన్మించుచున్నది. ఇయ్యది దటఁ బుట్టి కొంతదూర మేఁగి యొకచో నమాంతము దలక్రిందులై నెమ్మదిగ దిగి పోవును. దీని జన్మస్థలమున మంచు కొన్ని యడుగుల లోతువఱకు గడ్డవడి యుండును.

అటుపిమ్మట నది యెడమవైపునకు మఱలి కొండలఁ జుట్టుచు నెటకో పోవును. ఈ ఖుంభూ హిమానీనది పతనస్థలమే పడమటిలోయను బ్రవేశించుకొఱకు స్వతస్సిద్ధముగ నేర్పడిన సింహద్వారము. ఇయ్యదె వారికి దుస్సాధ్య సమస్య. ఏలనన ఖుంబూహిమానీనద్యుపరిభాగము బీటలువాఱి యనేకభయంకర విస్తార రంధ్రములతో నడుగడుగున కసాధ్య క్లిష్టతర విషయములతోఁ గూడియుండును. కనుఱెప్పపాటులో నున్నపై, నడచుట కనువైన స్థలముల గభీర బిలద్వారము లుద్భవించును. అవి విస్తృతమగుట కాని, సంకుచితమగుట కాని హఠాత్సంఘటనలే పర్వతపు టంచుల నంటియు నంటనటులున్న పెద్ద పెద్ద గండశైలము చూచుచుండఁగనే చెవులు బ్రద్దలు సేయు ఫెళ ఫెళా రావములతో విరిగి క్రిందికి దొరలుచు, దారిలో నడ్డగించు పర్వతములను మంచు ముద్దల మహోద్ధృత వేగమున ఢీకొని, ఛిన్నభిన్నములై నలువైపుల కెగిరిపోవును. ఇట్టి హఠాత్సంఘటన లనేకములుగ నాఖుంబూ నదీప్రాంతములలో జరుగుచుండును. ఒకప్పుడు జార్జ్ మేలరీ ఎవరెస్టు శిఖరారోహణ యత్నమున నార్త్‌కాల్......(North col) పర్వతము నధిరోహించుచుండ నిట్టి హిమశైల పతన మాతనిపై విరిచికొని పడెను ; గాని సిద్ధహస్తుఁ డగుటఁజేసి చాకచక్యముగఁ బ్రమాదము పాలుబడక

మటిలోయ, ఎవరెస్టు శిఖరారోహణలో నెక్కవలసిన ప్రథమసోపానము; ఎదుర్కొనవలసిన ప్రథమ ప్రబలావరోధము! ఈ లోయ ఎవరెస్టు పాదములవఱకు వ్యాప్తము. ఇయ్యదెట్లు ప్రబలావరోధముగ నేర్పడినదో, యొకింత చర్చింతము. పడమటి లోయ హిమానీనదినిఁ బోలియుండును. హిమానీనది (Glacier) యన నెట్టిదో తెలిసికొనినఁ బడమటిలోయ నైసర్గికాది లక్షణముల నరయుట సులభము. ఉన్నత పర్వతాగ్ర నితంబస్థలులనుండి యధోముఖముగఁ బ్రవహించు హిమవాహినికే హిమానీనది యను నామాంతరము గలదు. హిమవాహిని యగుటంజేసి, యిది ధవళచ్ఛాయల మెఱయుచుండును. హిమరూపముఁ దాల్చిన కతన, నీ వాహిని, చలన రహితమై యుండును. అయినచో దీనినిఁ బ్రవాహ మను టెట్లు? చలన రహితముగఁ గన్పట్టినను, జలన మున్నది. ఇయ్యది దృష్టి కగోచరమగా తిన్నని నడక, వాతావరణ పరిణామాను సార మొక్కొక్కపరి దినమునకు ద్వాదశాంగుళదూరము గదలిపోవును. తదీయోపరితల మద్దము వలె నునుపై యుండుటచే, దానిపై నడచుట మహాప్రమాద హేతువు. హిమాలయమును వేసవి యుష్ణతరంగము లలమికొన నీ హిమవాహినుల రూపములు మార్పులకు లోనగుచుండును. ఉష్ణతరంగముల తాకిడిచే నవి బీటలువాఱి, క్రమముగఁ గఱిగి, నిర్మల జలమై పొంగి పొరలుచుఁ బ్రవహించును. అట్టితరి హిమవాహినులపై గంభీర బిలద్వారము లేర్పడును. మిట్టపల్లములు విశేషముగ నుండును. ఇట్టి తీవ్ర విచిత్ర పరిణామములా పడమటిలోయలో నిరంతర సంభవములు. ఎవరెస్టు దక్షిణ ముఖారోహణలో నిదియే గొప్ప ప్రతిబంధకము. ఎవరెస్టు శిఖరాంగరక్షకవర్గమున భయంకర హిమప్రచ్ఛాదిత బిలద్వారాది ప్రమాదమయమగా నీపడమటి లోయయొక ప్రత్యేకత నార్జించినది. కాని దీనిఁ బ్రవేశించు టెట్లు?

దాని శరీర మంతయు ధూసరవర్ణరోమములతో వికృతముగ నుండును. కొన్ని సమయముల నది వెనుక కాళ్ళతో నడచుచుండ ముందరి కాళ్ళను వ్రేలాడఁజేయును. మఱియొకప్పు డది మామూలుగ నడచును." దాని చేష్టలఁ జక్కఁగ ననుకరించుచు నా మఠాధిపతి చెప్పఁదొడఁగెను. "యేతి యొకచో నిలిచి యొంటిపై గోకికొని, మంచు ముద్దల నెత్తి, యెగురవేసి, నాలుగైదు సారు లఱచెను. ఇదంతయుఁ జూచి, భీత చిత్తులై మఠాధిపతులు, యేతినిఁ బర్వతములలోనికిఁ దఱుమ యత్నించిరి. శంఖము లూదిరి. ఇతర వాద్యముల మ్రోయించిరి. అంత నది చెట్ల గుబుళ్ళలోనికిఁ బరుగిడెను.

టిబెట్టులో నొకప్పుడు యేతులను దారుణముగ హత్యఁ జేయుచుండిరనియుఁ దఱువాతఁ బ్రభుత్వ మా క్రూర కార్యమును నిషేధించిరనియు, నాతఁడు సెప్పెను. బౌద్ధసన్న్యాసుల ప్రభావముచే, ఇంఝూ నది లోయల వన్యమృగములు స్వేచ్ఛగ సంచరింపగలవు. మృగముల వేట యచట నిషిద్ధ మగుటచే నవి నిర్భయముగ సంచరింపగలవు.

త్యాంగ్‌బోచ్ గ్రామములో మూఁడు వారములు గడపవలెనని సర్ జాన్ హంట్ నిర్ణయించెను. ఈ మూఁడు వారములలో నౌన్నత్య వాతావరణావరోధముల నెదుర్కొనుట కవసరమౌ వాతావరణాభ్యాస మొనర్ప వలెనని యతని యుద్దేశము. కొంత కాలము పాటు పర్వతారోహకులు పర్వతముల కరిగి ప్రాణవాయు సాధనద్వయమును, నారోహణ వేషములను ధరించుట యలవఱచు కొనవలయును. అనంతర మా పరికరము లెట్టి ఫలితము నిచ్చునో, పరిశీలింపవలయును. వానినిధరించి ఫలితములఁ బరిశీలింప నే మేమి లోపములు గాన్పించునో, తెలిసికొన వలసియున్నది. ఈఫలితము

లన్నియు వాతావరణాభ్యాసము వలనఁగాని తేట తెల్లముగావు. పూర్వ యాత్రికులు వాతావరణాభ్యాసము పట్ల నింత శ్రద్ధవహింపలేదు. వారి యనుభవముల సునిశిత విమర్శనాబుద్ధితో బరిశీలించి సర్ జాన్ హంట్ తన యాత్రలో నీ నూతన పద్ధతి ప్రవేశపెట్టెను. వాతావరణాభ్యాసముకొఱకు జిన్న పథకములను వారు చేసిరి.

పర్వతారోహక దళమును మూఁడు భాగములుగ విభజించి, యొక్కొక్క భాగమున కొక్కొక్క నాయకుని, నియమించిరి. ఛార్లెస్ ఇవాన్స్, ఎడ్మండ్ హిల్లరి, సర్ జాన్ హంట్ అను నాయకత్రయము, తమ తమ దళముల వెంట నిడుకొని, వారము దినము లా పరిసర పర్వతముల నధిరోహించవలయును. మఱల నెనిమిదవ నాఁటికి దళములన్నియు త్యాంగ్ బోచ్ గ్రామమున సమావేశమై యొకటి రెండు దినములు విశ్రమించి, దళముల మార్చుకొని మఱల వేర్వేరు త్రోవలఁబడి పోవలయును. అట్లు బయలుదేరినవారు మఱియొక వారాంతమున శిబిరమునకు మఱలవలెను. అంతటితో నీ వాతావరణాభ్యాస కార్యక్రమము ముగియఁగలదు. ఏతత్కార్యక్రమ ఫలితముల సమగ్రముగ విమర్శించి యవసరమైన సవరణలఁ జేసికొని భావికార్యముఁ గూర్చి కదలి పోవలెను.

మార్చి యిరువది తొమ్మిదవనాఁడు ఛార్లెస్ ఇవాన్స్ నాయకత్వమున టాం బోర్డిలో, జార్జిబాండ్, మైకేల్ వెస్ట్‌మేకట్ అను వారలు ప్రాణవాయు సాధనద్వయ సహితముగ బయల్వెడలవలసి యున్నది. అందుకు దగిన సన్నాహములు చేయుచుండఁ దలవని తలంపుగాఁ బదునైదు ప్రాణవాయుగుంభితపాత్రలు ఖాళి యైనట్లు దెలిసెను. మార్గమున మధ్య నవి యెచ్చటనో చెడి యందలి వాయువు బహిర్గత మయ్యెను. ఈ నష్ట మనిష్టకారి యని హంట్ ప్రభృతులు

కలవఱపడుచుండ ఖాట్మాండూ నగరమునకు జిమ్మీ రాబర్ట్సు కొన్ని ప్రాణవాయు సాధనములఁ గొనివచ్చె నను రేడియో వార్త వారి యాందోళనను దొలఁగఁ జేసెను.

మార్చి ముప్పదవనాఁడు మఱి రెండు దళములు నిడికొని వేర్వేరు త్రోవలఁ బడి సర్ జాన్ హంట్, ఎడ్మండ్ హిల్లరీలు తరలిరి. అప్పటి వాతావరణము దోషరహితముగ నుండెను. సర్ జాన్ హంట్ పక్షములో ఆల్ఫ్రెడ్ గ్రిగరీ, ఛార్లెస్ వైలీ అనువారు వెడలిరి.

ఛార్లెస్ ఇవాన్స్ తన యనుచరులతో బయలుదేరి ఆ మాడబ్లాం శిఖర దక్షిణ పార్శ్వము క్రిందుగ నేదో యొక గొప్పలోయ గల దను ననుమానముతో నాప్రాంతమును, బరిశోధింప వెడలెను. ఇవాన్స్ దళ పరిశోధనల మూలముగ 'మేరాకాల్' అను పర్వత మొకటి బయల్పడుటయు, వా రనుమానించిన లోయ లేదనియు, స్పష్టముగ ఋజువయ్యెను. సుమారు బందొమ్మిది వేలయడుగుల శిఖరాగ్రమును టాం బోర్డిలాన్, అసహాయశూరుఁడై యధిరోహించెను. ఇవాన్స్ దళము ప్రాణవాయు సాధనము లుపయోగించుటలోఁ గొంత శిక్షణఁబొందెను. పరిసర మనోహర దృశ్యముల ఛాయాచిత్రములను గూడ నతఁడు సేకరింపఁ గలిగెను. ఇవాన్స్ దళములోని, జార్జి బాండ్, మైకేల్ వెస్ట్ మేకట్, హిమవత్పర్వతముల లోనికి వచ్చు టిదియే ప్రథమముగాన నౌన్నత్యఫలితముల వా రనుభవింపక తప్పలేదు.

ఇఁక హంట్ హిల్లరీ దళములు త్యాంగ్ బోచ్ లో మార్చి ముప్పదవనాఁడు బయలుదేఱవలసి యుండెను. కాని సరిగా నాదినమునకు ఎడ్మండ్ హిల్లరీ జ్వరపీడితుఁ డయ్యెను. అతని కంఠముగూడ సరియైన స్థితి నుండలేదు. అందుచే రెండు దినములపాటు విశ్రాంతి

యాతనికవసర మయ్యెను. కావున నాతని దళమునకు నాయకత్వము వహించవలసిన బాధ్యత విల్‌ఫ్రెడ్ నాయిస్ భుజస్కంధములపై బడెను. విల్‌ఫ్రెడ్ తనదళమును దోడ్కొని యీశాన్య దిశాభిముఖుఁడై పోయెను. త్యాంగ్‌బోచ్ గ్రామమున కీశాన్యమున (Chola kola) ఛోలా కోలా లోయ కలదనియు, దానిఁ జేరఁగల్గిన, తావీచ్ శిఖరము జేరవలయుననియు హిల్లరీ యభిమతము. హిల్లరీ స్వస్థతఁ జెందినంతనే జాగుసేయక యొకా యొకని బయులుదేరి యప్పుడే ఛోలాకోలా లోయలో విడిసియున్న దళమును గలసికొనెను. నిర్ణీత ప్రకారము హిల్లరీదళము ఛోలాకోలా లోయను దాటి తావీచ్ శిఖరమునుజుట్టి, సుమా రిరువది వేల యడుగులపైఁబడిన కాంగ్‌చో శిఖరము నధిరోహించిరి. అటులనే మఱియొక శిఖరమును గూడ వారధిరోహించిరి. వారి యారోహణాప్రావీణ్యమున కీశిఖరము గీటురాయి. హిల్లరీ దళ మీా వారము దినములలోఁ బ్రాణవాయు సాధనము లుపయోగించి దానివలని పూర్తిప్రయోజనముల ననుభవించెను.

సర్ జాన్ హంట్ తన దళమును వెంటనిడికొని మార్చి ముప్పదవనాఁడు ఇంర్ఖానదిలోయ కరుగ నముకట్టెను. ఈ లోయ నూప్సె లోట్సె శిఖరముల సంధించు పర్వతశ్రేణి సమీాపమునఁగలదు. పునరాలోచనానంతరము హంట్‌దళము నూప్సెశిఖరము క్రిందుగానుండు హిమానీ నదీతీరమును జేరఁబోయి, యా నాఁటిరాత్రిఁ బదేనువేల యడుగుల యెత్తునఁగల డింగ్‌బోచ్ గ్రామమున విడిసెను. 'ఆమా దబ్లాం' శిఖర వాయవ్యముఖము వారి కట్టెదుట నుండెను. తచ్ఛిఖర పార్శ్వములు నిట్రమువేలి హిమాచ్ఛాదితమై నిగనిగలాడు రజత పర్వతమువోలె నొప్పుచుండెను. ఏతచ్ఛిఖర నిర్మాణమునుగాని, వెండిని బోలు నా తెల్లని రాయిగాని చూడఁ జూడ ముచ్చటఁ గొల్పుచుండెను.

డింగ్ బోచ్ గ్రామ మతి సారవంతక్షేత్రమున వెలసియున్నది. ఆ లోయలో నదీ ప్రవాహముల వచ్చు నొండ్రుమట్టి యందందు నిలిచి పేరుకొని యుండి వ్యవసాయమునకు జాల సహకరించుచున్నది. వేసవిఁ బరిసర గ్రామీణు లీ గ్రామమునకు బోయి యా సుక్షేత్రములలో బంగాళ దుంపలు బార్లీ, మొదలైన పంటల విరివిగఁ బండింతురు. బార్లీని వేయించి పిండిచేసిన ' త్సాంపా ' యను పదార్థము వచ్చును. షేర్పాల ముఖ్యాహార మిదియే. ఏటేట షేర్పాల మతగురువైన లామా డింగ్ బోచ్ గ్రామమునకు వేంచేసి కృషీవలుల కృషి సఫల మగునట్లు దీవించును. ఆనాఁడు షేర్పాలకు మహా పర్వదినము. అతిథిగా వచ్చిన లామాను ప్రత్యేకభవనమున నుంచెదరు. అది పర్వతములో నొక సురక్షిత స్థలమున నుండెను. హంట్ దళము డింగ్ బోచ్ గ్రామములో విడిసిన మఱునటిదినమే లామా యాశీస్సులు షేర్పాలకు లభించిన దినము.

హంట్ దళమా ప్రాంతములో నైదు దినములు ప్రాణవాయు సాధనముల నుపయోగించుచు వాతావరణాభ్యాస మొనర్చెను. వారి వెంట నున్నత పర్వతముల నధిరోహించఁగల వస్తువాహకు లుండిరి. ప్రతివాఁడును ప్రాణవాయు సాధనములతో నలఁతి యలఁతి శిఖర ముల నధిరోహించుచు వేగమును దెలుసుకొనుచుండిరి. ప్రాణవాయు వొకవైపు బలము గలుగఁ జేయుటయేకాక ప్రకృతి సౌందర్య విభూతుల ననుభవింపఁగల మానసిక శక్తులఁ గూడ వారి కొసఁగుచుండెను. ఒక్కొకచోట వా రారోహణ మార్గములఁ గనుఁగొనవలసి వచ్చుచుండెను. ఈ యనుభవము భావి యత్నములకుఁ బునాది యగునని వా రట్టి వాని నధికేచ్ఛలతోఁ జేసిరి. ఉన్నత వాతావరణము వారి యారోగ్యమును జెఱచలేదు. సాధారణముగ నా ప్రదేశములలో

క్షుద్బాధ తీవ్రముగ నుండెను. కాని యదేనియుఁ బర్వతారోహకు లనుభవింప లేదు. సంపూర్ణారోగ్యవంతులవలెనే వారు మిక్కిలి యిష్టముతో భుజించుచుండిరి. ఆహారములో తొన్నైదు పౌనుల బరువు హెచ్చినట్లు సర్ జాన్ చెప్పుచున్నాఁడు. కాని వారికి నిద్ర మాత్రము సులభముగఁ బట్టుచుండెడిదికాదు. సర్ జాన్ హంట్, టెన్జింగ్, కలిసి పర్వతారోహణఁ జేయుట కిదియే మొదటిసారి. ఈవాతావరణాభ్యాస యత్నములోనే సర్ జాన్ హంట్, టెన్జింగ్ పర్వతారోహణ ప్రజ్ఞా విశేషముల కద్భుతావహచిత్తుఁ డయ్యెను. భావికార్య సాఫల్యమున కతని సామర్థ్యము పురోగామి యని యతఁడు తలపోసెను.

నిర్ణీతకాలమునకు సరిగఁ బర్వతారోహకు లెల్లరు థ్యాంగ్ బోచ్ శిబిరముఁ జేరిరి. వాతావరణాభ్యాసముకొఱకుఁ జేసిన ప్రయత్నములు సత్ఫలితము లిచ్చినవి. ప్రాణవాయు సాధనముల లాభములు స్వల్పకాలములో నిరుపమానములని స్థిరపడెను. పర్వతారోహకు లీ వారము దినములు యథేచ్ఛగ నేకు నిముసములుగఁ గడిపిరి. అన్యోన్య స్నేహ సౌహార్ద్ర భావలతలు పర్వతారోహకుల నొకరినొకరినిఁ బెనవైచికొని శాశ్వత బంధము లైనవి. భావికార్య సాధనభార మెంతటి గురుతరమైనప్పటికిని, నకుంఠిత దీక్షా విశ్వాసములతో సఫలీకృతముగఁ జేయఁగలమను నాశలు పర్వతారోహకుల హృదయ క్షేత్రముల మొలక లెత్తుచుండెను. వారిలో సంఘీభావౌన్నత్యము ఎవరెస్టు శిఖరమునే మించి పోవుచుండెను !

థ్యాంగ్ బోచ్ శిబిరములోఁ బర్వతారోహకులెల్లరు సమావేశమై తమతమ యనుభవముల నొకరొకరితో ముచ్చటించుకొనుచు, విశ్రాంతిఁగొనుచు నుండిరి. దళనాయకుఁడు, సర్ జాన్ హంట్, హిల్లరీయు, ద్వితీయ వాతావరణాభ్యాసకార్యక్రమము సిద్ధము చేయు

చుండిరి. ఈమూడు దళముల సభ్యుల మార్పు జరిగెను. ఎడ్మండ్ హిల్లరి, జార్జిలో, జార్జి బాండ్, మైకేల్ వెస్ట్ మేకేట్ కలిసి యొకదళ ముగ నేర్పడిరి. ఈ దళ మాచరింపవలసిన కార్యక్రమము ముఖ్యమైనది. వాతావరణ ధ్యానము కన్న ముఖ్యమైన ఖుంబూ హిమానీ నది (khumbu Ice fall) పరిశోధన కార్యము వీరి వంతు పడెను. ఎవరెస్టు శిఖరారోహణలో నిది యొక ప్రబలావరోధముగాన నేతత్పరిశోధన మవశ్యకర్తవ్యము. తరువాత సౌత్ కాల్‌పై శిబిరముల స్థాపించుట కొఱకు విశాలానుభవజ్ఞులు, షేర్పా లవసరమని పూర్వమే నిర్ణీతమయ్యెను. అట్టి షేర్పాల కిపుడు ప్రాణవాయు సాధనముల నుపయోగించు పద్ధతుల బోధింపవలసియున్నది. కావున ఛార్లెస్ వైలీ పన్నరు షేర్పాల నెన్నికొని వారి కవసరమైన శిక్షణ నీఁదొడఁగెను. సర్ జాన్ హాంట్ దళములో మైకేల్ వార్డ్, టాంబోర్డిలన్, విల్ ఫ్రెడ్ నాయిస్, అనువారు గలరు. వారు ఖుంబూ హిమానీనది పరిశోధన కేఁగు హిల్లరీదళము ననుగమించి వారికి సహాకరింప నిశ్చయించిరి. ఈదళ మేప్రిల్ మాసాంతిక దివసమున డింగ్ బోచ్ గ్రామములో మజిల విడిసెను. ఛార్లెస్ ఇవాన్స్ దళముగూడ వీరితో నుండెను. ఆ గ్రామములో బెన్జింగ్, చార్లెస్ వైలీ లిరువురు గలసి షేర్పాలకు ప్రాణవాయు ప్రయోగముల బోధించిరి. అప్పటి వాతావరణ పరిస్థితులు దృప్తికరముగ లేవు. నేలపై మంచు దట్టముగఁ బేరికొనిపోయెను. ఆకాశమున మేఘములు విరివిగఁ గ్రమ్ముకొని యొకదాని నొకటి ఢీకొనుచు సింహారావము లుప్పతిల్ల మహోగ్రసంగరము సల్పుచుండెను. ప్రమాదాగమన చిహ్నితమైనను, నీ వాతావరణము సర్ జాన్‌హాంట్ పురోగమనము నాటంకపఱచలేదు. వారు పురోగమించి ఆంబూగ్యాబ్ జేన్ (19,500) అడుగుల శిఖర మధిగమించిరి. అంతటితో నాగక వారు మంచు కరిగి మార్గమధ్యమునఁగల చిన్నచిన్న పర్వత హిమానీ

నదులఁ దరించుచు జనునాల్గవ వేడీన ఖుంబూహిమానీ నద్యుత్తర తీర మున విడిసిరి. మఱికొంత దూరమేగునరికి, పుమోరీ శిఖరము, ఎవరెస్టు ఉత్తర శృంగము, (North Peak) లోలాశిఖరమును జూడఁ గలిగిరి. వీరికి ఎడ్మండ్ దళమును గలసికొనవలసి యున్నది.

ఎడ్మండ్ హిల్లరీ దళము ననుసరించి, డాక్టరు పుగ్, స్టోబార్ట్, వెడలిరి. ఈదళ మాచరింపవలసిన కార్యక్రమము అధిక మగుటచేతను, ప్రబల భౌతికావరోధక మగుటను, ద్రాటి నిచ్చెనలు, త్రాళ్లు, నాహార సామగ్రి, గుడారములు, మొదలైన పరికరముల విరివిగఁ గొని పోయిరి. మొత్తమున కాదళములో షేర్పాలు, కూలీలు, పర్వతా రోహకులను గలసి, యేఁబదిమంది కలరు. వీరందఱి వెంట నిడికొని హిల్లరీ బయలు వెడలెను. కాని యాదిలో హంసపాది యనునట్లు హిల్లరీ బయలుదేరినదే తడవుగ వాతావరణ పరిస్థితులు విషమించి నవి. తలపని తలంపుగా విపరీత హిమవృష్టి యారంభించెను. నేలపైఁ బొడిమంచు దట్టముగఁగప్పికొని యుంట వారి కాళ్లు దిగఁబడుచుండెను. షేర్పాల కాళ్ళకు జోళ్లు లేని కారణమున వారి కష్టము రెట్టింప య్యెను. ఇట్టి ప్రతికూల పరిస్థితులు రాఁగలవని పర్వతారోహకు లూహింపని కారణమునఁ గూలీలకుఁ గాలిజోళ్లను, గంటిజోళ్లను నొసఁగలేదు. అటులనే వారు పురోగమించి రెండవనాఁటి సాయం కాలమునకు, దుర్భర వాతావరణ విపర్యాస ఫలితముగఁ జాల యలసి శైత్యముగు కతన శక్తిహీనులైరి. వారిలోఁ బలువురకు హిమవృష్టి ఫలితముగ దృష్టిమాంద్యము సంప్రాప్తించెను. ఆరాత్రి కొకచో విశ్రమించుటకుఁ జాలినన్ని గుడారములైన వారికడలేవు. కూలీలలో స్త్రీలు గూడఁ గలరు. వీరంద ఱా రాత్రి నతిక్లిష్టపరిస్థితులలో నిద్రింప వలసి వచ్చెను. కొందఱు కూలీలు, గుడారములులేమిఁ బెద్ద బండల

క్రిందనో, చాటుననో, బహిష్ఠులీ ప్రకృతి వైకృత చర్యలకు దలతొయ్గి నిద్రించిరి. తెల్ల వారఁగనే గత రాత్రి యనుభవముల రవంతైన మనసులలో నుంచికొనక యధాప్రకారముగఁ గూలీలంద ఱుత్సాహముతో బయలుదేఱిరి.

పూర్వము స్విస్ దళము పురోగమించిన మార్గమునే వీరు సైత మనుసరించి పోవుచుండిరి. కనుచూపు మేరలోఁ బచ్చని చెట్టు గాని, పచ్చికగాని, యేదే నొకజీవరాశిగాని వారికి గన్పట్టుట లేదు. జంతువృక్ష క్రిమికీటకాదు లాప్రదేశములలో జీవింపఁజాలవు. మార్గ మంతయు మంచుమయమై, యిరువైపుల, బహుసంఖ్యాకములుగఁ జిన్న చిన్న మంచుశిలలు, నిక్కఁబొడిచికొని యున్నవి. దూరము నుండి చూచినచో వికృతాకారములతోఁ గ్రమవిరుద్ధముగ నిచ్చ వచ్చినరీతి నమర్చిన మంచుబొమ్మలకొలువో యనున ట్లాదృశ్య మొప్పు చుండెను. అచ్చటచ్చటఁ గొన్ని మంచుకంబములు, నూరడుగుల యెత్తువఱకుఁ బెరిగియున్నవి. సూదిమొనఁబోలు నా కంబపుఁ గొనలపై విశేష పరిమాణముఁగల హిమశిలాఖండములు నామ మాత్రముగ నాసీనములై యెప్పు డేవేళ నే మందమారుత వీచికల తాకిడిచే ఫెళ్ళని విరిగి, క్రిందఁబడునో యనున ట్లున్నవి. వానిఁ జూచు కొలది, యపుడే కనుఱెప్పపాటుననే క్రిందికి జారునో యను భీతిఁ గొల్పుచుండును. సూర్యకిరణ సంయోగ క్రియచే నేర్పడిన యీ చిన్ని కంబములఁ జూచిన యీ భూమిలో మంచు మొక్క లేవైన విరివిగ మొలచిన వేమోయని తోఁపకమానదు. అదియొక సృష్టివైచిత్ర్యము. సర్ జాన్ హాంట్ దీనిఁ జైతన్య శూన్య చంద్రమండల దృశ్యములఁ బోలిన దని వర్ణించెను. హిల్లరీ దళము పురోగమించి యచిరకాలమున లోలా కనుమను సమీపించెను. దాని దరిదాపులందే స్విస్ దళము

నిర్మించిన ప్రథమ శిబిర శిథిలములు వంటచెఱకు తునకలు వారికిఁ గాన్పించెను. అచ్చోటికి ఖుంబూ హిమానీనది యనతిదూరముననే యుండెను. ఏప్రెల్ పండ్రెండవనాఁడు ఖుంబూ హిమానీనది మలుపు కడ హిల్లరీ ప్రభృతులు శిబిరమును నిర్మించిరి. ఇఁక మీఁదఁట నానదీ పరిశోధన జరుగ వలయును.

ఇంతవఱకుఁ బ్రయాణ మాహ్లాదకరముగ నుండెను. వాతావరణ విపర్యాసముల బాధ చాల స్వల్పమనియే చెప్పనగును. వాస్తవమున శిఖరారోహణ యనునది యింతపర్యంతము లేనేలేదు. ఎవరెస్టు శిఖరారోహణ సమస్య ఖుంబూ హిమానీనదివద్దనే ప్రారంభము. ప్రస్తుత మీనదీ భౌతిక నిర్మాణము గూర్చి స్థూలముగనైనఁ దెలియ వలయు. లోట్సె శిఖర ముఖమునుండి సాగుచున్న హిమానీనది ఎవరెస్టు పశ్చిమశ్రేణికి నూప్సె శిఖరోత్తరముఖమునకు మధ్య నొదిగి, యొకింత దూర మరిగి, యొక్కపరి క్రిందికి దొరలుచున్నది. ఈ హిమానీనదికి దక్షిణదిశఁగల నూప్సెశిఖర పార్శ్వముల నంటి యుండు మంచుగడ్డ లపుడపుడు ఎగిరి పడుచుండును. ఆనదిపై మంచు ముందు కరుగుట కెంతమాత్ర మవకాశమీయదు. మిట్టపల్లములసంఖ్య బహుళముగా నుండును. హిమశైల పతనములు సైత మసంఖ్యాకమై పతన వేగముచే భీతిఁ గొల్పుచుండును. దానఁజేసి యటమార్గము సుగమము గాదు. ఆరోహణ సమస్య యనిననో యతివిషమమై యున్నది. ఈ యవరోధములఁ దరించికదా సుగమమార్గ మన్వేషింపవలయును.

మార్గాన్వేషణ కార్య మారంభించుట తడవుగా జార్జ్‌లో; మైకేల్ వెస్ట్ మేకట్, వరుసగ రోగపీడితులైరి. కార్యభారమా! గురుతరము. ఆరోహకుల సంఖ్య క్షీణించినది. ఇదివరకున్న ధైర్యవిశ్వాసము లొకింత సడలినవి. అయినను హిల్లరీ ప్రభృతులు చలింపలేదు.

కార్యరంగములోనికి దూకిరి. హిమనిపాత (Icefall) పరిశోధన రంగమున కరిగిరి. 'తగిలిన వ్రేలికే తగులు' నను మాడ్కి వాతా వరణము వారిని ముప్పతిప్పలఁ బెట్టసాగెను. ప్రతిదినము మధ్యాహ్న మాదిగ మంచు గురియ సాగెను. అత్యంతశ్రమతో నిన్నఁ గని గుర్తిం చిన మార్గము నేఁటి కదృశ్య మగుచున్నది. షేర్పాలుఁ బర్వతారోహ కులు, నుదయాస్తమాన మధికప్రయాసల కోర్చుచు, మెట్లు సెక్కుచుఁ దప్పత్రోవలఁ ద్రొక్కుచుఁ, జుట్లు దిరిగితిరిగి, మఱల మొదటికే వచ్చుచు, నాల్గుదినములు శరీరములు విడిచికొని పనిఁజేసి, ఏప్రిల్ పదునారవ తేదినాటికిఁ బందొమ్మిదివేల నాల్గువందల యడుగులలో రెండవశిబిరము నిర్మించిరి. దీనితో, ఎవరెస్టు శిఖరారోహణఁ బ్రథ మావరోధ మధిగమించుటయ్యెను. ఆరాత్రి యచ్చోట విశ్రమించి, యుదయమే ఎడ్మండ్ హిల్లరీ, జార్జ్ ఇవాన్స్, జార్జిలో, అనుమువ్వురు పడమటి లోయననుకఁ బరిశోధనార్థము వెడలిరి. సర్‌జాన్‌హంట్ వారిపురోగమనమును బరిశీలించుటకే, ఆంగ్ నాంగ్యాల్, అనుషేర్పాను టాంస్టోబార్ట్‌ను వెంట నిడికొని బయలుదేఱెను.

ఇంకను సుగమమార్గ మేర్పడని కారణమున వారు మంచు గడ్డల నడుమ వంకరటింకరగా నుండు నిరుకైన మార్గము ననుసరించి బహుదూరము ప్రయాణము సేయవలసి వచ్చెను. వీరికి మున్నే వెడలువారు త్రోవలోఁ జిన్నచిన్న పతాకముల నటనట నాటి యుండుటచే, వెనుక వచ్చు వారి కవి సుగమమార్గ సూచకములుగ నుండెను. సర్‌జాన్‌హంట్ పురోగమించుకొలది భూతలము నిట్ట నిడివిగ మారుచుండెను. అట్లగుచో నారోహణము కష్టసాధ్యముఁ, బ్రమాద భరితాత్మకముఁ, గావున వారుమువ్వురును బాదరక్షల యడు గున నినుపమేకులు బిగించిన బిళ్లలఁ దగిలించికొని యొకరినొకరు

త్రాటితో బంధించికొనిరి. వారికెదురుగ ననతిదూరమున నొక పెద్ద బిలములోనికి మెట్లు చెక్కఁబడి యుండెను. బిలములోని కొకత్రాడు వ్రేలాడుచుండెను. దీనిని దాటుట కత్యధికసామర్థ్యము వలయును. మఱికొంతదూరమున నెగిరి గంతువేసి దుముకుట కసాధ్యమైన యగాధబిలముల సంఖ్య హెచ్చుగ నుండెను. నిచ్చెన లడ్డముగ వానిపై నమర్చి దాటవలసి యుండెను. ఒకచోఁ బదిరెండడుగుల వెడల్పుఁగల బిల ముండెను. దానిపై నిచ్చెనఁ బఱచి, తిన్నగఁ బ్రాకుచు దాటిరి. మఱికొంతదూరమున నతిగంభీరభయంకర బిలమొకటి వారికిఁ గాన్పించెను. దానిమధ్యఁ బెద్ద హిమశైల మొకటి, యాబిలము లోయంచుల గట్టిగ నానికొని యుండెను. ప్రమాదవశమున నొకవేళ నాబిలము విస్తరించికొనెనా, యాహిమశైలము తటాలున నడుగునఁ బడిపోవును. ముందుఁ బోయిన వారీ హిమశైలముపై మెట్లు చెక్కిరి. సర్ జాన్ హంట్ ప్రభృతులా బిలమును దాటుటకు ముందున కరిగిరి. ప్రమాదము వాతఁబడకుండు టచ్చోటఁ జాలయరుదు. ఏమైన నావలిగట్టును జేరవలయును. గావున మంచును జెక్కి చేపట్లు గొన్ని తయారుసేసి వాని సాహాయ్యముతో దానిపై నడచిరి. ఈరీతినే త్రోవలో నట నట బిలములు, మంచుగడ్డలు, వారి నాటంకపెట్టుచుండెను. ఒకనాఁ డున్నట్లు మఱొకనాఁ డాబిలము లుండవు, నేడు పెద్దశిలాకారము దాల్చిన మంచు తేపటి కదృశ్యమగుచుండును. నేలపై నన్నని యిరుకైన నీటికాలువల వలె బిలము లేర్పడును. మఱికొన్నిచోట్ల మార్గమును సూచించు పతాక లదృశ్యమగును. ముఖ్యముగ రాత్రికాలమున గంభీరశబ్దములు చేయుపెద్దపెనుమంచు బండ లూడిపడుచుండును. ఈ హిమలోక వైచిత్ర్యములఁ జూచుచు, నవరోధముల దాటుచుఁ, బ్రమాదములఁ దప్పించికొనుచు, వారుముప్పురు మధ్యాహ్నకాలమునకు రెండవ శిబిరమును జేరఁగల్గిరి.

రెండవ శిబిరములో నెవ్వరును గానరాలేదు. పడమటిలోయ మీఁదుగఁ బ్రచండమారుతము వీచుచుండెను. అతితీవ్రముగ నలసి యుంట వారొకింత విశ్రమించి మఱల బయలుదేరిరి. ఇంతలోఁ గొంత మానవ సంచార సూచకములైన యస్పష్టవాక్కులు వినవచ్చెను. వారటు లామాట లాలకించుచుండ, ననతికాలములోఁ బూర్వగామి యారోహకత్రయము కొండదిగి వచ్చుచుండెను. ఎదురెదురుగఁ బయ నించు నా యారోహకవ్రాతము శిబిరమునకు మున్నూరడుగుల పైని గలసికొనిరి. వారిసంభాషణలఁ బట్టి పడమటిలోయ దనుక వారు వెళ్ళఁగల్గిరనియుఁ, దదారోహణలో సాంకేతిక సమస్య లనల్పము లనియు హాంట్ గ్రహించెను.

డింగ్‌బోచ్ గ్రామమును వీడిన ఛార్లెస్ ఇవాన్స్ దళము ఇంఝూ లోయలోఁ గొన్ని శిబిరముల నధిరోహించెను. ప్రతికూల వాతావరణము వారినిఁగూడఁ జిక్కుచిక్కుల పాల్సేసెను. రాత్రి కాలములలో నిద్రించుటకు వారు చాల శ్రమపడవలసివచ్చెను. పంద్రెండుగురికి సరిపోవు గుడారములలో నొదిగియొదిగి యిరువది మంది నిద్రించిరి. ఛార్లెస్ఇవాన్స్ దళములో నిపుడు "లండన్ టైమ్స్" పత్రికా విలేఖరి జేమ్స్ మారిస్ కలిసెను. ఎవరెస్టు శిఖరా రోహణ వార్తల నెప్పటి కప్పుడు దెలుపు నిమిత్త మీతనిఁ బ్రత్యేక ముగఁ బంపిరి. ళ్యాంగ్‌బోచ్ గ్రామములో మిక్కిలి యవసరములైన కార్యము లెక్కువగ నుండుటచే ఇవాన్స్ దళము త్వరగ వెను దిరిగెను.

హాంట్ హిల్లరీ దళములు ఖుంబూ హిమానీనదిపైని హిమ నిపాతమువద్దను, శిబిరములు నిర్మించుటయందును, హిమనిపాతా

గ్రముపైఁ దృతీయ శిబిర స్థాపనకార్యమందును, నిదివరలో హిల్లరీ క గొనిన మార్గమును సుగమ మొనర్చుటయందును సంపూర్ణముగ నిమగ్నులై యుండిరి. ఏప్రెల్ ఇరువది రెండవ దినమున · ఎడ్మండ్ హిల్లరీ జార్జ్ లౌండ్ తృతీయ శిబిర స్థానముగూర్చి పురోగమింప సర్ జాన్ హంట్, మైక్ వెస్ట్ మేకట్ వారిని వెంబడించిరి. పొడిమంచు నవాంగుళ దఘ్నముగ నేలపైఁ జేరికొనియుంట దానిఁ జీల్చికొని దారిసేసి కొనుచుఁ, బోవలసియుండెను. ఇంతకు ము న్నేర్పరచి యుంచిన మార్గ మేదేని నందుఁ గానవచ్చుటలేదు. కొన్నిచోట్ల వారు మోకాటిలోతు మంచులో నడచిపోవుచుండిరి. మార్గమధ్యమునఁ జిన్నచిన్న హిమశిఖరములు, హిమశైలములును, వారిగమనము నడ్డుచుండెను. శైలము కన్నను హైమమే వారి గమనశక్తిని సరి కట్టుచున్నది. మఱికొంత దూరమేగునరికి గంభీర నిమ్నస్థలిని వారు చూచిరి. దాని యడుగువఱకు మెట్లు చెక్కఁబడి యుండినవి. త్రాటితోఁ బరస్పరము బంధించికొని మెట్ల యాధారమున లోనికి దిగిరి. ఇక నధోభాగమునుండి యెదుటి గోడ నెక్కి పైకి రావలయును. ఆ గోడ నానికొని మంచు వివిధ భయానక శిలారూపములనతి మందపవన స్పర్శకే విరిగి పడుచున్నట్లుండెను. ఒక రాయి విరిగినచో, యిఁక రెండువందల యడుగుల యెత్తైన గోడ యంతయుఁ గుప్పఁ గూలును. అట్టిదానిని వారు సాహసించి దాటిపోయిరి. ముందుకు సాగిన కొలది మార్గము క్రమగతిని లేదు. మంచుశిలల దాటుచుఁ గదలిపోవలయును.

అటులే పురోగమించి పర్వతారోహకులు హిమనిపాతము నరఁ జేరిరి.. పడమటిలోయ యాగ్రప్రదేశమునసే యంతమగుచున్నది.

అచ్చోట సైతమ మీా హిమమే పెక్కు వంతలకు గారణభూతము. అప్పటికప్పుడే వాలిన మంచుచే భూతల మెన్నియో మార్పులు జెందియున్నది. అటనుండి క్రమక్రమముగ మార్గపుమట్టు మెత్తగు చుండెను. నిట్రమైన ప్రపాతములఁబోలు హిమశైలము లొక్కొక్కచో నలువది యడుగుల యెత్తుగ నుండెను. వాని నెక్కుట కలలోనివార్త. ఎత్తైన రెండు మంచు శిలల మధ్య నన్నని మార్గము వారికిఁ గాన్పించెను. నిజమున కదియొక లోతైన బిలద్వారము. బిలద్వారమే చీకట్లు గ్రమ్ముచు భయానకమై యొప్పుచుండెను. దానిని దాటుటకు బ్రయత్నించుచుండఁ బైనుండి మంచుపెచ్చులు జారి పర్వతారోహకులమీాదఁ బడవచ్చును. ఒకవేళ యట్లు గాకున్నను హిమశైల తన మారంభమాణమగును. హిమశైలపతనమే యొకభయానకదృశ్యము. ఆశ్చర్యచకితులఁ జేయు పెద్దరొదతోఁ బ్రారంభమై, భూమిఁ గంపింపఁజేసి, మిన్ను విరిగి మీాదఁ బడినట్లు హిమశైలములు పైనుంచి విరిగి పైఁబడును. అట్టిది జరిగినచో మరణము తథ్యము. కావునఁ బ్రక్కగా నొకింత దూర మేగి కొంచె మేటవాలుగా గోడను బట్టికొని, పైకిఁ బ్రాకి, సురక్షితముగ నాబిలమును దాటిరి. పిమ్మటఁ ద్రాళ్ళ సాయమున వస్తువులను బైకి చేదికొని, మఱికొంతదూర మేఁగి, యొకస్థలములో నిరువదివేల రెండువందల యడుగుల యెత్తున మూడవ శిబిరమును నిర్మించిరి.

ఎవరెస్టు శిఖరారోహణ మార్గమున నీహిమనిపాతము, దానిఁ జేరఁగల మార్గము, మిక్కిలి ముఖ్యమైనవి. ఎందరో షేర్పా లెన్నియో వస్తు సముదాయముల మోసికొని యెన్నిమారులో యీాప్రమాదాస్పదమైన హిమమార్గముపైఁ బయనింపవలయును. దినగండమువలె నామార్గమున నేక్షణములో నేమి యవాంతరము వాటిలఁగలదో, యను భీతి యెల్లర, నెల్లవేళలఁ బీడించును.

దానాంగ్యాల్, వెస్ట్‌మేకట్, హిల్లరీల నచటవదలి సర్ జాన్ హంట్ ఖుంబూహిమానీనదియొద్దనుఁగల ప్రథమ శిబిరమును ఏప్రిల్ యిరువది రెండవనాఁడు చేరఁబోయెను. అప్పటికే పర్వతారోహకు లెల్ల రచ్చోటికి విచ్చేసి యుండిరి. ప్రాణవాయు సాధనము లచటికి జేరినవి. దావాతోందూప్, అంగ్‌న్యీమా అను నిరువురు షేర్పాలు యాత్రలోఁ బాల్గొనుటకై యటకు వచ్చిరి. సకల వస్తుచయము లచ్చోటికిఁ జేర్పఁబడినవి.

ఇఁక నవిరతముగ శిఖరారోహణ కార్యక్రమ ప్రారంభమున కెట్టియాటంకము లేదు.



# 8

## నిర్మాణము

ఎవరెస్టు శిఖరారోహణ కార్య మించు మించు మూఁడు భాగములుగ విభక్తమై యున్నది. అందుఁ దొలుదొల్తఁ జేయవలసినది ఖుంబూ హిమానీనదీతీరమునఁ బ్రథమ శిబిర స్థాపన. త్యాంగ్‌బోచ్ శిబిరము, వాతావరణాభ్యాసముకొఱకే స్థాపిత మయ్యెను. ఇప్పుడు వస్తుచయమెల్ల ఖుంబూహిమానీనదికడ నున్నది కావున నిఁక జరుగవలసిన పని పడమటి లోయ నొకటిరెండు శిబిరములు నిర్మించి తదనంతరము లోట్సె ముఖము నధిరోహించి సౌత్-కాల్ పర్వత భాగమును బ్రవేశించి, యట నొక శిబిరము స్థాపించుట. ఇదియే రెండవ భాగము. సౌత్ కాల్ శిబిరమును వీడి తిన్నగ శిఖరాగ్రముఁ జేరుట మూఁడవది.

పర్వతారోహకులు లండన్ నగరమునఁ గుదిర్చిన పథకము ననుసరించి శిఖరాగ్రారోహణమునకు ముందు పడమటి లోయ శిబిరముల స్థాపించి, వస్తుసామగ్రి నటఁజేర్చుట కథమపక్షము యిరువది దినములు పట్టును. ప్రయాణమున నవకాశము లభించిన, ఇవాన్స్ హిల్లరీలతో సర్ జాన్‌హంట్ అవసరమైన విషయములఁ జర్చించుచునే యుండెను. శిఖరాగ్రారోహణారంభమునకుఁ బూర్వము పర్వతారోహకులకు బరిపూర్ణ విశ్రాంతి యవసర మని యుద్దేశ్యము. అదియు నున్నత పర్వతప్రాంతములఁ గాదు. అల్పోన్నత్యములనే యట్టి విశ్రాంతిఁ గూర్పవలెను. అట్టి విశ్రాంతి వారి శక్తులఁ బునరుజ్జీవింపఁజేయుటయే దీని ప్రయోజనము. వారి ప్రాథమిక పథకము మే నెలఁ బదునైదవ నాఁటినుండి శిఖరాగ్రారోహణ ప్రారంభింపవలసి

ష్టా దేశించుచున్నది. మే యారంభమునుండి భారతీయ ప్రభుత్వము వై నందిన వాతావరణ పరిస్థితులను, భావి పరిణామ రీతులను, దెలియఁజేయుట కంగీకరించెను. అదియుఁగాక మున్ముందు వాతావరణ మేత్రోవల నడచునో, యూహింపఁగాదు. ఋతుపవనము లెపుడు విరిచికొని పిడుగువలెఁ బై బడునో తెలియుట లేదు. ఇట్టి కాలములో నున్నత పర్వత ప్రాంతముల నుండుట తగదు. అందుచే శారీరక బాధ లధికతరముగాఁగల సందర్భములు గూడఁ గలవు. కావున నాహారాది సకలవస్తుపరికరములను 'మే' యారంభమునకే పడమటిలోయఁ జేర్పవలయునని సర్ జాన్ హంట్ తన యనుచరుల కాజ్ఞాపించి తదవసరమైన పథకములఁ గూడ ననుభవజ్ఞులతోఁ జర్చించెను.

ప్రారంభ దశలోఁ బ్రథమ శిబిరమునుండి హిమనిపాతము కడ నుండు తృతీయశిబిరమున కాహారాది వస్తుసామగ్రిఁ జేర్పవలెననియుఁ దదనంతర మాశిబిరమునుండి పడమటిలోయ కయ్యవి కొనిపోవలె ననియు, వారి పథకము నిర్దేశించుచున్నది. ప్రస్తుత మా ముప్పది తొమ్మండ్ర షేర్పాదళమున నిరువదెనిమిది మందిని మాత్ర మీపనికై వినియోగింపఁ దీర్మానించిరి. వీరిని నాలుగుజట్లుగ విభజించి యొక్కొక్క జట్టు కిరువురఁ బర్వతారోహకుల, నాయకులుగ నియమించిరి. మూఁడుజట్లు ప్రథమశిబిరమునుండి హిమనిపాతము దనుక వస్తువములదాయముఁ గొంచు, మంచున మాసిపోవుమార్గమును మఱల మఱల వరిదిద్దికొంచు నుండును. నాల్గవజట్టే వస్తువులఁ దన్నిపాతమునుండి పడమటిలోయకుఁ జేరవేయవలయును. మొదటిమూఁడు జట్లును, టాం బోర్డిలాన్, చార్లస్‌వైలీ, మైక్ వార్డ్, వెస్ట్ మేకట్, జార్జిబాండ్, బ్యాండింగ్, అనువారల యధీనమునఁ బనిచేయుదురు. ప్రారంభదశలో

నీపనులన్నియు నేప్రెల్, యిరువదినాల్గవనాఁటినుండి మే రెండవనాటి
లోపల జరుగవలయును.

రెండవదశలో, మే మూఁడవనాటి మొదలైదవనాఁటి వఱకుఁ
బడమటి లోయలోఁ బని జఱుగును. ఈదశలో మూఁడవ శిబిరమునుండి
నాల్గవశిబిరమున కాహారాది వస్తుసామగ్రిఁ జేర్పవలయును. ఈ నాల్గవ
శిబిరములో సకలవస్తుసామగ్రి యుండును. ఇట్లు మే పదునాల్గవ
నాఁటికి సకలపర్వతారోహక వస్తుసామగ్రులు నాల్గవశిబిరమున నుండ
వలయును. అటుపిమ్మట లోట్సె, సౌత్ కాల్ పర్వతముల ప్రసక్తి
యుండనే యున్నది. సౌత్ కాల్ పర్వతముపై శిబిరము నిర్మించి యట
శిఖరాగ్రారోహణ కవసరములయిన వస్తువులఁ జేర్చుటతో రెండవ
దశ సమాప్తి యగును; గాని సౌత్ కాల్ యొక్క నిజమైన రూప
రేఖ లింతవఱ కజ్ఞాతములుగనే యున్నవి. లోట్సె పశ్చిమ ముఖము
దాటినఁ గాని సౌత్ కాల్పై నడుగిడుట కవకాశములేదు. మఱిలోట్సె
ముఖమెట్లున్నదో! ఈపరిశోధన యింతవఱకు జరుగలేదు. పర్వతా
రోహకుల యారోహణ నైపుణ్యా నిశితత్వమున కీ లోట్సె, సౌత్ కాల్
పర్వతద్వయము ప్రబలతర దుర్ఘట పరీక్షలు. ముఖ్యావసర వస్తు
సామగ్రి మాత్రమే భుజముల నిడికొని, యీ రెంటిని దాటుట
దుష్కర కార్యము. కావున నీపని మూఁడవ దశఁ జేర్చుటకు సర్ జాన్
హంట్ తీర్మానించెను. ఈ పథకమంతయుఁ దన యనుచరులకు,
షేర్పాలకును, నితఁడు బోధించి వారి హృదయపూర్వక సహకారము
జూరఁగొనెను. కారణాంతర ప్రాబల్యముచే నొకవేళ సర్ జాన్ హంట్
శిఖరారోహణ యాత్రకు నాయకత్వము వహించఁ జాలనిచో,
ఛార్లెస్ ఇవాన్స్ అతని మాఱుగ నీ భారమంతయు వహింపవలసి
నట్లుగా నిశ్చయము జరిగెను.

ద్వితీయ దళ నారంభించుటకు మున్నొకటి, రెండుపనులు నవరింపవలసియుండెను. ద్వితీయశిబిరమునుండి తృతీయశిబిరము, (అన, హిమనిపాతము) వఱకుఁగల బిలద్వారముల దాటుటకై నిచ్చెనల నేలపై బఱచియుంచిరి. అయ్యవి పడమటిలోయ నుపయోగించుటకుఁ దీర్మానించిరి. అటులైన నచట త్యాంగ్ బోచ్ పరిసరములనుండి తెచ్చిన కలపదుంగల నుంచివచ్చుటకై చార్లెస్‌వైలీ కొందఱు షేర్పాలను వెంటఁగొని వెడలెను. మధ్యేమార్గమున రెండు పర్యాయములు షేర్పాలు బిలద్వారములఁ దఁతాలునఁబడిరి. అదృష్టవశమునఁ బ్రమాదములకు దప్పిరి. ఇట్టిప్రమాదము లచటఁ దఱచుగ సంభవించుచుండును. సామాన్యులేగాక, విశాలపూర్వానుభవ నైపుణ్య ధురంధరు లెవరేని యిట్టిప్రమాదముల కెరయగుటయు నటఁ బరిపాటియే. ఏప్రెల్ ఇరువదారవనాఁడు టెన్జింగ్ హిల్లరీలు పర్వత మవరోహించుచుండ నొకచో హిల్లరీ తలవని తలంపుగా నొకమంచు పలకపై దుమికెను. అంత టది ఫెళ్ళున విరిగి యతఁ డధోభాగ పతనముఁ జెందెను. హిల్లరీవంటి యనుభవశాలికే యిట్టి ప్రమాదము తప్పనిచో నిక షేర్పాల దేటిమాట! వెంటనే త్రాటితోఁ దన బలము కొలది టెన్జింగ్ ఆతనిఁ బైకి లాగి పట్టుకొన నాటికాగండము తప్పెను.

పడమటిలోయలోఁ బ్రవేశించి దాని మొదలు కొనలఁ బరిశోధించి త్రోవఁ గనుగొను భార మెల్ల ఛార్లెస్ఇవాన్స్, హిల్లరీ, హాంట్, టెన్జింగులపైఁ బడెను. తృతీయశిబిరములోనుండు మైక్ హిల్లరీలనుఁ గలిసికొనుటకై, పై మువ్వు రిరువది నాల్గవనాఁటిప్రాతఃకాలమునఁ బయనమైరి. వారి ననుసరించి విల్‌ఫ్రిడ్‌నాయిస్, గ్రిగరీలు పడమటిలోయఁ బరిశోధనార్థమై నియమితమైన షేర్పాదళము వెంటనిడికొనిపోవుచుండిరి. గతరాత్రి మంచు మితిమీఱి వాలుటచేఁ బర్వతారోహణ

మతిభార మనిపించుచుండెను. శిబిరములను నున్నవారికడ నిపుడు రేడియో యంత్రము లున్నవి. వాని సాహాయ్యమున వాతావరణ పరిస్థితులు స్థలభేదము ననుసరించి యెట్టిమార్పులం జెందుచున్నవో మార్గ మెట్లున్నదో, ప్రమాదములున్నవా, లేవా యను సహస్రాంశ ముల నొకరితో నొకరు విశదీకరించికొనుట వీలగును. హంట్ మూడవ శిబిరమునుండు హిల్లరీతో నాతనిం గలిసికొనుటకు బయలు దేరుచున్నాననియుం, దమకెదు రేగి కలిసికొనవలయుననియు రేడియో ద్వారా, యాతనికిం దెలిపెను. హిల్లరీ నిన్నటిదినము దాను నెఱ వేర్చినకార్యముల హంటుకు దెలుపుచుం బర్వతారోహక షేర్పాల కేమేమి యారోహణ పరికరము లవసరమో, వా రేత్రోవ నీవస్తు వులం గొని సురక్షితముగ రానగునో మొదలయిన విషయములం దెల్పెను. ఇట్లీ రేడియో యంత్రములు భావికార్య నక్రమ నిర్వహణ కెంతయో యుపకరించుచున్నవి.

ప్రథమద్వితీయ శిబిరముల మధ్య, మార్గము సుగమముగాదు అజీర్ణరోగమున బాధనొందు సర్ జాన్‌హంటునకది ముండ్లబాట వలెనుండెను. మంచుతీవ్రముగ వర్షించుచుండ వారు ముందు కేగ వలసి వచ్చెను. ఆనాం డుదయాదిగ హిమవర్షమట్లేయుంట, హంట్ దళము పురోగమింపలేక, రెండవశిబిరము కడనే నిలిచిపోయెను. ఆరాత్రిం బడమటిలోయ కేగు షేర్పాదళముం, దన్నాయకులు, హంట్ ప్రభృతులు, నాద్వితీయ శిబిరముగనే గడపిరి. ద్వితీయ శిబి రము నుండి, తృతీయశిబిరము వఱకుంగల మార్గమును, ఎడ్మండ్ హిల్లరీ చక్కం జేసియుంచెను. కాని నాంటి కది యుపయోగపడలేదు. మఱునాంటి యుదయమున ద్వితీయ శిబిరమున కేగిరి.

తృతీయశిబిరము పడమటిలోయ చివరనున్నది. అచట నింతకుఁ బూర్వము పేన్వాసదళము గొనివచ్చిన గుడారములు నాహారాదిక వస్తు నికరము, భద్రముగ నున్నవి. హంట్, అతనియనుచరులు, నాటి రాత్రి యచట సుఖనిద్రగాంచిరి. మఱునాఁడే మెపిల్ ఇరువదారవదినము సాయంకాలము పడమటిలోయ నెటులున్నదో చూడఁ గౌతుక ముప్పొంగ, హంట్, హిల్లరీ, నాయిస్, ఇవాన్స్, బెన్జింగ్లు, నిశ్రేణి కలవెంటఁగొని పయనమైరి. మార్గమధ్యమున నొకచోఁ బదునారడుగుల బిలద్వారమొకటి వారికంటఁబడెను. నిచ్చెనల సాయముతో వారాబిలమునుదాటి సునాయాసముగ బడమటిలోయను బ్రవేశించిరి. ఈనిచ్చెనలు లేకపూర్వము స్విస్దళమువా రీబిలము దాటుటకై త్రాటినిచ్చెనల నుపయోగించి వానితో మిక్కిలి శ్రమపడిరి. ఆబిలము దరించితిమను సంతస ముప్పొంగ ద్విగుణీకృతోత్సాహులై, యాకస మంధకార ధూమముల నీ యిలపై నూఁద నారంభించినను వారు వెనుఁ దిరుగలేదు. పురోగమన మార్గాన్వేషణాశక్తి ప్రతిక్షణాభి వృద్ధిఁజెంద వారు దమకృషికి స్వస్తిచెప్పుట కొప్పికొనకపోయిరి. కాని యనం ఖ్యాక బిలద్వారములు వారి కృషికి నిరోధకములుగ నుండెను. మఱి కొన్నిస్థలములం దూగిసలాడుచు, నప్పటికప్పుడే విరిగి, దొరలి, తల క్రిందుగఁ బడునేమో యను భీతిగొల్పు హిమశైలము లడ్డంకులుగ నుండెను. త్రాఁటినిచ్చెనల సాయమున నత్యున్నతమైన మంచుగోడల దాటుచుఁ గొంతదూరమేఁగ లోట్సె పశ్చిమముఖము, సౌత్ కాల్ పర్వతము దానియేటవాలు పుమోరీశిఖరము, సంధ్యారాగ రక్తమై యపూర్వసృష్టి సౌందర్యవిభూతులఁ బ్రకటించుచు వారి కన్నులఁబండువు నేసెను. ఇంతలోఁ దరణిదివ్యారుణకాంతుల ప్రభ యుడఁగ భూదేవి గాఢతమసాసుర విక్రమ విస్ఫూర్తుల నవలోకించి, భీతతారకేక్షణయై ఖిన్నయైనది. తరణికిరణప్రభలఁ దళతళ మెఱ

యుగము వంటి పడమటిలోయ యిప్పుడతిభీతిఁ గొల్పెడు చీకటిక్రోవ. దానిని ప్రవేశించుటెట్లు?

తెల్లవారినది. ఉదయారుణకాంతు లుర్విపై సోకి ప్రాణికోటికి నవజీవసంపదలఁ బ్రసాదించుచున్నది. ప్రకృతికాంతి తదరుణ మయూఖ తరంగ వినూత్నాభరణములఁదాల్చి యనుపమానామర సౌందర్యవతియై విరాజిలుచున్నది. నిర్మానుష్య వినిర్మల శాంతి సదనమై మానవ పరమాశయ వలయావృతమహోత్తర శక్తిసాధన రంగమగు నీ హిమాలయోత్తుంగ శృంగరాజచ్ఛాయలలోఁ బర్వతారోహకు లప్పుడు మేల్కొనియున్నారు. వారిచుట్టు వివిధశృంగరాజములు పరివేష్టించి కోటబురుజులరీతి వారిని రక్షించుచున్నవి. అదే విజయోత్సాహోతిరేకములఁ గొల్పు సమయము. పడమటిలోయను గూర్చి వెడలుట కదియే సుముహూర్తమని వారికిఁ దోఁచ, ఇవాన్స్, హంట్, హిల్లరి, టెన్జింగులు ప్రయాణోన్ముఖులైరి. పడమటిలోయ నామూలాగ్రముగఁ బరిశోధించి, లోట్సె శిఖరము దనుక సుగమమార్గము నెలకొల్పుటయే వారి గమనోద్దేశ్యము. వీరి ననువరించి యున్నత పర్వతారోహణ కార్యదీక్షులౌ షేర్పాలు నాల్గవ శిబిర స్థాపన కవసరమైన సకలవిధ వస్తుసంభారములను మోయు నాయిస్, గ్రిగరీలు వారి గొని వచ్చుచుండిరి. సాంద్ర హిమానీపాతమున గమనము సులభముగ నుండలేదు. మోఁకాటిలోతునఁ జేరికొనిన పొడిమంచును, నాఁగటి సాలువలెఁ జీల్చికొని, యడుగు లిడుచు వారు జరిగిపోవుచుండిరి. కొంతదూరమున, నిరుడు స్విస్‌దళము నిర్మించిన శిబిరశిథిలములు వారి కెదురయ్యెను. ఆహారపదార్థములుగాని మఱేయితర వస్తువులుగాని, యట లభించునేమో యను నాశ లూర హిల్లరీ టెన్జింగు లచటికేగిరి.

మున్ముందు మార్గ మవరోధముల పుట్టయి యున్నది. అతి విశాల గంభీరబిలములు, గాజువలె నున్న ని మంచుగోడలు దారి నడ్డగింప, హాంట్, ఇవాన్సు లిరువురు గుడిప్రక్కగాఁ జుట్టు తిరిగి, దాని పొడవునఁ జిన్న చిన్న పతాకల నాటుచుఁ, బడమటిలోయ మధ్యస్థలిని సమీపించిరి. వారున్న స్థలమునుండి లోట్సె, సౌత్ కాల్ పర్వతములు, సుమారు రేడువేల యడుగుల యెత్తుగఁ బడమటి లోయలోఁ గూరికొని యున్న ఎవరెస్టు పశ్చిమ పార్శ్వము గాన్పించుచుండెను. ఇది హిమ పరివృతమై యుండెను. వాయవ్యదిశనుండి వీచు ఝంఝామారుత తీవ్రవేగముల కా మంచుమమారము నంతరిక్షమున కెగయుచుండెను. వీరిరువు లీ దృశ్యమును ఏకధ్యాన నిమగ్నతఁ గనుచుండ హిల్లరీ టెన్జింగులుఁ గలసికొనిరి. స్విస్ శిబిరములో దొరకిన చాకలేట్లు... (Chocolates) వెన్న, మొదలైన రుచ్యముల వారెల్ల అమితానంద మొదవ భుజించిరి. పిమ్మట హిల్లరీ టెన్జింగు లొకింత పురోగమించి ఎవరెస్టు పశ్చిమపార్శ్వచ్ఛాయల నెలకొల్పఁబడిన స్విస్‌దళ నిర్మిత చతుర్థ శిబిరమును, విశీర్ణితమును గనుగొనిరి. అది శీతర్తువున వ్రాలిన మంచులోఁ గూరికొనిపోయినది. అం దేమికలదో యను కౌతుక ముద యింప వారు నలువు రట కేఁగి మంచుఁద్రవ్వి యెన్నియో వస్తువులను వెలికిఁదీసిరి. వానిలో చాకలేట్లు, పండ్లగుజ్జు, వెన్న, పాలపొడి, రొట్టె యింకను వివిధాహార సామగ్రి, చెడిన గుడారము, దుస్తులు, గొన్ని పరికరములు, వారికి దొరకెను. అవన్నియు సేకరించి సూర్యు డనంతా కాశ పశ్చిమవీధినిఁ బయన మారంభించుట తడవుగవారు మూఁడవ శిబిరమునకు మరలిరి. వస్తువాహకులు దమసామగ్రి నాల్గవ శిబిరమున కల నసతి దూరమున నుంచిరి. నాఁటికంతదనుక నావస్తువుల మోసి కొని వచ్చుటయే ఘనకార్యము. అస్తమయకాలము సమీపింప వారు

నజలిపోయిరి. వారు మూఁడవ శిబిరముఁ జేరుసరికి నొకటి, రెండు శిబిరములనుండి తెచ్చినసామగ్రి యటఁ జేరినది.

ఈవిధముగఁ దొమ్మిదినాళ్ళు నిర్ణీతక్రమానుసారము వస్తుసామగ్రి నిదానముగఁ బైకిఁ జేర్చుచుండిరి. తొమ్మిదినాళ్లిట్లు శిబిరములమధ్యఁ దిరుగుటచే వస్తువాహక పర్వతారోహకుల కారోహణానుభవములుఁ జక్కఁగ లభించెను. మంచుతలపెట్టు మాయోపాయములు, విచిత్ర వికృతవేషములు యాత్రికుల కిపుడు పూర్తిగ నవగాహన మయ్యెను. ప్రతిదినముఁ బడమటి లోయలోను, హిమనిపాతము కడను, నెండవేడిమి విపరీతముగ నుండుటయు, నేనాఁటి కానాఁడు సాయంసమయమున మంచువాలుటయుఁ దత్ఫలితముగ, యాత్రికుల మార్గము చెఱిగిపోవుటయు, మఱల నుదయమే, నూత్నమార్గస్థాపనఁ జేయుటయు, నాదినములలోఁ బర్వతారోహకుల శ్రమను సహస్రగుణీకృతము గావించుచుండెను. అందలి యధికోష్ణతచే వారికి బడలిక హెచ్చుగనుండెను. హిమానీనది పరిసరముల నట్టి యాయాసము ప్రకృతిసిద్ధము. మొలలోతుమంచులో దిగి బరువులు మోయుచు ముందుకరుగుట యెంతటిశ్రమకరము! దారిదప్పెనా! దిగఁబడుటయే! హిమనిపాతమువద్ద నీప్రమాద మత్యధికముగా నుండును. అచ్చోటనే హిమశైలము లెక్కువ. వాతావరణ వైపరీత్యముల నిరతిశయశక్తులతోఁ బోరుచు మేనెల రెండవనాఁటికి బడమటిలోయ నడిబొడ్డున నాల్గవశిబిరము నెట్టకేలకు నెలకొల్పిరి. అప్పటి కాశిబిరములో సుమా రేఁబది వస్తుపేటిక లుండెను. సుమారు పదునెనిమిదివేలయడుగుల యెత్తున, వృక్షజాలమండల పరిమితి కావల, హిమానీనదపరివృతమై, నూఫ్సె శిఖరచ్ఛాయలఁ బ్రథమశిబిరము నిర్మించిరి. పరిసరములెల్ల హిమాచ్ఛాదితము లగుటఁ జూడ మచ్చుటఁ గొల్పుటలేదు

వాతావరణ పరిస్థితులైన నాహ్లాదకరముగలేవు. ఒక్కొక్క దినము నెండవేడిమి యతిశయించి గాలివీవదు. మఱికొంతసేపటికి, మేఘ సమూహము లా లోయఁ బ్రవేశించును. వెనువెంటనే మంచు గ్రాలు చుండును. ఎటుచూచినను భయంకరాకారను దాల్చి, యాశ్చర్యము గొల్పు పర్వతశిఖరములు విచిత్రవికృతాకారములు దాల్చిన హిమశైలములు నఖాతములైన లోయలును, దృష్టి కెదురగుచుండును. చూచుచుండఁగనే యామంచు కఱిగి యావిరిరూపమున గాలిఁ గలియు చుండును. అట్లగుట నామంచు నేలపైఁ గొన్నిచోట్ల రాక్షసికోఱల వలెనో, గోపురములవలెనో, కాన్పించుచుండును.

ఇట్టి దుర్భరపరిస్థితులఁ గలిగియున్నను బ్రథమశిబిర మా యాత్రికుల మనసుల స్మరణ మాత్రముననే సంతోషపూరితాంతరంగులఁ జేయుచుండెను. పడమటిలోయ పరిశోధనకై వెడలి, యలిసి, మఱలు పర్వతారోహక నికరముల కది భోజనాదిక సకలసౌఖ్యముల నొసఁగు విశ్రాంతిమందిరము. తాండూప్ చేసిన యమృతతుల్యమైన భోజనము వెచ్చని గుడారములు, మెత్తని పడకలు, పఠన గ్రంథములు, మానసిక కాయిక శ్రమల రూపుమాపు రేడియోగానము, హిమవత్పర్వతారోహకుల నెవరి నాకర్షింపఁజాలవు ? నిశీథసమయ మెంతయో రమణీయముగ నుండెడిది. హిమవర్షముపెలిసి నభోవీథి నావరించిన మేఘ సమూహములు తొలఁగును. నిర్మలేంద్ర నీలాకాశములో రోహిణీ సమేతాభ్యుదయామృతకరుఁడు విచ్చలవిడిగాఁ దావిహరించుచు భూలోకమును సమ్మోహింపఁజేయుచుండును. హిమకరుని రజత మయూఖము లాహిమశైల శిఖరములపై సోకినంత నాపరిసరము లెవ్వియో సురలోక సుందరపర్వత సీమాంతరములభాతి ధగద్ధగాయమానముగ వెలుఁగుచుండును. అట్టి శిఖరముల నావలివైపు గాఢాంధకార మలమి

కొని యుండెను. చీఁకటి వెలుఁగులు రెండును సృష్టిసహజ పరస్పర విరుద్ధలక్షణముల నతిమనోహరముగఁ జాటుచుండెను. ఒకొ్కక్క సమయమున నుష్ణమాపకము —23°C డిగ్రీల యుష్ణము సూచించును. మఱికొన్ని సమయముల నటనట మంచు బ్రద్దలుగఁ జీలుచున్న గంభీర నినదములు, హీనస్వరములు వినిపించుట తప్ప రాత్రికాలమం దచటి నిశ్శబ్దగుంభిత ప్రశాంత వాతావరణము నడ్డుశక్తి మఱొకటిలేదు.

విశ్రాంతి లభించినదే తడవుగఁ బర్వతారోహకులుఁ, గొందఱా సమీపముల నున్న లోబూజ్‌గ్రామమున కేఁగి యందలి సుందర దృశ్యములఁ దనివారఁ గాంచి వచ్చుచుండిరి. ఆ కుగ్రామములో నాలు గైదు పర్ణకుటీరములు మాత్రమే యుండెను. గాని యందు నీటిబుగ్గలు స్ఫాటికజలములు, గనుల మిఱుమిట్లు గొల్పునానావిధ సుందరపుష్ప తతులు, శకుంతజంతుసంతానములు గలవు. నిర్జీవమైతోఁచు మంచు కొండలవీడి యీప్రాంతమున కొకింత విశ్రాంతిఁ గోరి వచ్చిన పర్వతా రోహకుల కీ రమణీయ స్థలము నిరవధికానందము గూర్చుచుండెను. లోబూజ్ గ్రామమునుండి దృక్కులు సాచిన హిమపరీత శిఖరాగ్రము లయస్కాంతమువలెఁ దమ ద్విగుణీకృత సౌందర్యముతోఁ జూపరుఁ నాకర్షించుచున్నవి! మున్ముందు సాధింపఁబోవు మహాకార్యముః కీ విశ్రాంతి యమృతపాన మనుట దోసమే!

# 9

# నిర్మాణము 2

నాల్గవ శిబిరము నిర్మించినతరువాత లోట్సె శిఖర పర్యవేక్షణ జరుపుటకు సర్ జాన్‌హంట్ తీర్మానించెను. దీనిని దాటినంగాని సౌత్ కాల్‌పై నడుగిడ వలనుపడదు. ఏతత్పర్యవేక్షణఫలితములు అనేకములు. దీనివలని సుగమమార్గాన్వేషణ, శిబిర నిర్మాణానుకూలస్థల నిర్ణయము, ప్రాణవాయు సాధనోపయోగములు, పర్వతారోహక వేషధారణఫలితములు, నున్నత సానుప్రదేశాంతర వాతావరణానుకూలతాజ్ఞానము గలుగును. ఈ పర్యవేక్షణ సంఘప్రముఖసభ్యులైన ఛార్లెస్ ఇవాన్స్, టాంబోర్డిలాన్, అనువార లంతర్వాహిక, ప్రాణవాయు సాధనములంగొని లోట్సెముఖ పర్యవేక్షణార్థము వెడలిరి. లోట్సె శిఖరముఖతలమున వీలైన యెత్తులో శిబిరనిర్మాణము సేయవలెననియుం, బిమ్మట సౌత్ కాల్ కేంగవలెననియు వారి సంకల్పము. వీరి కవసరమైన సాహాయ్య మొసంగుటకు చార్లెస్‌వైలీ, మైకేల్ వార్డులు గొందఱు విశాలపర్వతారోహణానుభవ సమన్వితులైన షేర్పాలను బాహిర్వాహిక ప్రాణవాయుసాధనముల వెంటనిడుకొని యనుగమింపవలసినదని నిశ్చితమాయెను.

నేంటి కా నాల్గవ శిబిర స్థలమున నవసరమగు వస్తుసామగ్రిం జేర్చిరేకాని గుడారముల నిర్మింపలేదు. కావున దాని నివాస యోగ్యముగం జేయునిమిత్తము మే మాసారంభ దివసమున టామ్, ఇవాన్స్, హంటులు, ప్రతిభాశాలులైన యార్గురు షేర్పాల వెంట నిడికొని బయలుదేరిపోయిరి. షేర్పాలలో నతి బలాఢ్య శరీరుండౌ దానాం గ్యాల్ రా వలనుపడమి పర్వతారోహకులు ముప్వురు, నొకొక్కక్క-

శేఁబది పౌనులు ... బరువులు మోసికొనుచు ముందుకు సాగిరి. వారు ముఫ్వురును ప్రాణవాయువు నుపయోగించుచుండినను నుదయార్కునలిపెచ్చని కిరణముల ధాటి కోర్చకైరి. క్రొత్తగ వాలిన మంచు పొరలఁజీల్చి త్రోవఁజేసికొనుచు నెట్టకేలకు నాల్గవ శిబిరముఁ జేరిరి.

నాల్గవ శిబిరము ఎవరెస్టు శిఖరాగ్రమునుండి యధోముఖముగఁ బఱుగిడు మహాప్రపాతచ్ఛాయ నోదిగియుండెను. అటనుండి యొక మైలుదూరమునఁ గల పడమటి లోయ పుట్టినిల్లు స్పష్టముగఁ గానవచ్చుచుండెను. వారి కెదురుగఁ బడమటిలోయ దక్షిణతటము నానికొని తూర్పు పడమరలుగ సాగిన నూప్సె పర్వతబాహువు, పడమటి లోయ పుట్టుకకు నంటియున్న లోట్సెముఖము నిజోన్నత మహాగభీరాకృతిఁ బాల్పి యారోహణ సమస్యను విషమతర మొనర్చుచుండెను. తదూర్ధ్వతలము నిట్టనిడివిగ నుండి హిమసమేతమై నిమ్నోన్నత రహితమై నున్నగ నిగనిగ మెఱయుచుండెను. అందొక్కట నొకింత యైన విశ్రమార్హస్థలము శూన్యము. మఱియొకచో నున్నతకుడ్యముల వంటి సోపానము లుండెను. అవన్నియు హిమసంఘాతములే. వాని నెక్కి దిగుట మిక్కిలి ప్రయాసకరము.

ప్రస్తుత మా ముఫ్వురును మే రెండవనాఁడు లోట్సె ముఖపర్యవేక్షణకై బయలుదేఱిరి. వారియొద్ద ప్రాణవాయుసాధనము లుండెను. మార్గము ననుసరించి వారు పురోగమించుచుండిరి. ఎండవేడిమి యొకవంక బాధింప మోకాఁటిబంటి మంచుఁ ద్రోసికొంచు నతిభారముగ వారు నడువవలసివచ్చెను. అట్లు పురోగమింపఁ గొంతదూరమున స్విస్ పంచమ శిబిర శిథిలములు వారికిఁ గానవచ్చెను. అచట మంచులో మఱుగుపడిన యాహార వస్తుపేటిక లుండెను. వారి యంచనా ప్రకార మాశిబిరము సుమా రిరువది రెండువేల యడుగుల యెత్తున నుండెను.

డాని కనతి దూరమున విస్తృత హిమసోపాన మొకటి శిబిర స్థాపన కనుకూలమైనదని పంచమశిబిరము నట స్థాపించిరి.

కొంత సేపటికి వారు లోట్సు శిఖరమును సమీపించిరి. ఇంతలో హిమవృష్టి వేగ మధికము గాఁ దొడఁగెను. తదనుగుణముగ వారి గమనవేగము క్షీణింపఁజొచ్చెను. మిట్టమధ్యాహ్నము లోట్సె ముఖముపై మెట్లు సెక్కుచు నొకానొక ప్రదేశమును జేరి కొంత కాల మట విశ్రమించిరి. కాని వాతావరణ పరిస్థితి సంతృప్తి కరముగ లేదు. పడమటి లోయ మేఘసమూహ సంభృత మయ్యెను. అటనుండి క్రిందికిఁ జూడ వారు నడచి వచ్చిన మార్గము గోచరించుటలేదు. శిఖ రాధిరోహణ యా సమయమునఁ జేయరాదు. మున్ముందీ ప్రాంతపరి శోధన జఱుగ వలసియే యున్నది. అట్లగుట నిపుడే యీవృథాయాస ప్రయాసల పాలగు టేలా? యను భావ ముదయింపఁ దిరోగమనమే కర్తవ్యమని వారికిఁ దోఁచెను. తిరోగమనములోఁ బ్రాణవాయుసాధ నములఁ దీసివైచిరి. భారమెంతయో తగ్గెను. కాని బడలిక మితి మీఱఁ జఱుకు నడక సాగింపలేక యలసి, సొలసి, సాయంకాలము నాలుగు గంటలకు వారు నాల్గవశిబిరమును జేరిరి.

ఏ రీ రీతిఁ బ్రాణవాయు సాధనములతో నున్నతస్థలసంచారముఁ జేయుచుండ టెన్జింగ్ హిల్లరీలు గలిసి యానాటి యుదయమే ప్రథమ శిబిరమును వీడి హుటాహుటినిఁ బయనించుచు మధ్యేమార్గమున విశ్రాంతిఁగొనుచు నైదుగంటల కాలములోనే నాల్గవ శిబిరమును జేరఁ గలిగిరి. ఆనాటి వాతావరణ మేమాత్ర మనుకూలముగ లేదు. పడ మటి లోయ మార్గము సుగమసాధ్యము గాకుండెను. అవరోధము లెన్ని యెదురొడ్డుచున్నను బాహిర్వాహిక ప్రాణవాయు సాధనము లలో ననాయాసముగా టెన్జింగ్ హిల్లరీలు బయనించగల్గి రన వది

వారి యపూర్వ పర్వతారోహణ శక్తి సామర్థ్య విశేష నిరూపణయే యని వేఱుఁగ జెప్పవలయునా? మఱియొక విశేష మేమన వారిరువు రా స్వల్పకాలములో నాల్గవ శిబిరము చేరి, తిరిగి ప్రథమ శిబిరము గూర్చి వెడలుటకై యుబలాట పడుచు నూత్నోత్సాహోద్దీపిత శరీరు లగుచుండిరి. ప్రయాణపు బడలిక యిసుమంతైనను వా రనుభ వించుట లేదు; నిర్ణయానుసారము నాల్గవ శిబిరమును వీడి మఱలి పోయిరి. సర్ జాన్ హంట్ వారిని వెంబడింప నాశించెను గాని లోట్సె ముఖ పర్యవేక్షణకై వెడలి తిరిగి వచ్చినదాదిగ నాతని శరీ రము చాల డస్సియుంట వారి ననుగమింపఁ జాలఁడయ్యెను.

కెప్టెంగ్ హిల్లరీలు బయలుదేఱునపుడే వాతావరణ వికృత రూప చిహ్నము లుదయించినవి. స్వకీయ గవేషిత మార్గ మపుడే హిమవృష్టివలన మాసిపోవుచుండెను. సూర్యాస్తమయమున కిఁక వ్యవధి రెండుగంటలు మాత్రమే. ప్రచండ హిమవృష్టి (Snow storm) ప్రారంభమౌ సూచన లపుడె పొడసూపుచుండెను. ఈ ప్రకృతి సిద్ధావరోధములఁ జూచి రవంతయేని వారు భీతిలక వడివడిగ దిగుచుం డిరి. పడమటి లోయఁ బయనించుట ప్రమాదభూయిష్ఠమై యుండెను. పలుమా రా పర్వతారోహకులు హిమప్రభావమునఁ దప్పు త్రోవలఁ ద్రొక్కుచు హిమనిపాతముకడ కేతెంచుసరికే గాఢ తమఃపటల ములు వారి నావరించెను. గాఢహిమవృష్ట్యంధకారములు వారినిఁ జిక్కులు పెట్టుచున్నను రాత్రి యెనిమిది గంటలకే, మూడున్నర గంటల ప్రయాణము సేసి సురక్షితముగఁ బ్రథమ శిబిరముఁ జేరిరి.

మఱునాఁడు, అనగా మే మూఁడవనాఁడు, లోట్సె శిఖర పర్యవే క్షణ దళము చతుర్థ శిబిరమును వీడి పంచమ శిబిరమును జేరఁబోయెను. లోట్సె శిఖర ముఖోపరిభాగమున వీలైనయెత్తులో శిబిరస్థాపనఁ జేయ

వలసినట్లును, దదనంతరము సౌత్ కాల్ పర్యంత మారోహణానుకూల మార్గ మన్వేషించవలసినట్లును, పర్వతారోహకులకుఁ దెలియఁజెప్పి సర్ జాన్‌హంట్ ప్రథమశిబిరమునకు మజిలిపోయెను. ఆమఱునాఁడే ఛార్లెస్ ఇవాన్స్, మైక్ వార్డ్, టాంబోర్డిలాన్, గలిసి పర్యవేక్షణార్థము పురోగమించిరి. వాతావరణ మనుకూలముగ లేదు. ఆకసమునుండి క్రుమ్మరించు నట్లు మంచు విపరీతముగ వాలుచుండెను. బాహిర్వ్యాహిక ప్రాణవాయు సాధన ముపయోగించుచుండినను, నుచ్ఛ్వాస నిశ్శ్వాసము లతిభార మగుట మైక్ వార్డ్ వెనుదిరిగిపోయెను. ఇపు డీ కార్యభార మెల్ల బోర్డిలాన్, ఇవాన్స్, వైలీల భుజములపైఁబడెను. వారు ముందుకు సాగిరి. మంచు వివిధరూపములఁ దాల్చియుంట వారు చాలశ్రమకు బాల్పడ వలసివచ్చెను. నిట్రముగ నిలిచియున్న ప్రపాతముల నెక్కుచు గజిబిజిగ నుండు మంచు శిలలమధ్యఁ ద్రోవఁ జేసికొనుచు నవసరమైన, మెట్లు నెక్కుచుఁ బురోగమించుచుండిరి. అంత నొకచో ఛార్లెస్ వైలీ ప్రాణ వాయుసాధనము చెడెను. తత్ఫలముగ నతఁడు ముందుకు సాగలేక పోయెను. కావున నచ్చటనే స్విస్ దళ శిబిరస్థలమున నారవ శిబిరము నిర్మించి బోర్డిలాన్ ఇవాన్స్‌ల నట నునిచి మిగిలినవారు పంచమ శిబిరోన్ముఖులైరి. ఆరాత్రి వా రాశిబిరమున నాల్గుప్రాణవాయు సాధన ములఁ ద్రవ్వి వెలికిఁదీసిరి. అయ్యవి ముస్ముందు, వారి కెంతయో యుపయోగపడెను.

మే యారంభమునుండి యెవరెస్ట్ శిఖరారోహకుల యుపయోగార్థము భారతీయ రేడియోశాఖ దైనందిన వాతావరణ పరిణామములఁ బ్రసారించుచుండెను. ప్రథమశిబిరమునఁ గొలఁదిమంది మాత్రమేయుండిరి. అనేకులు విశ్రాంతి విలాసములకొఱకు సమీపములోనుండు లోబూజ్ గ్రామమున కేఁగిరి పడమటిలోయ, లోట్సె

శిఖరముఖములపైఁ బయనించుట కతనఁ గొందఱు షేర్పాలు వ్యాధిగ్రస్తులైరి. ఎవరెస్టు పరిసరములలో నాయాసము, పొడిదగ్గు, పర్వతారోహకుల నెక్కుడుగ బాధించును. అనేకు లట్టిబాధలకు లోనైరి. ఆ ఋతువులలో నచ్చట నావ్యాధి సర్వసాధారణ మైనది. అచటికిఁ బోయిన ఛాయాగ్రహకుఁడు టాంస్టోబార్ట్ ఈవ్యాధిసోకి త్వరితగతిఁ బ్రథమశిబిరమునకు మఱలి వచ్చెను.

మే నైదవనాఁడు మఱల శిబిరస్థాపనకార్య మారంభమాయెను. జార్జ్‌లో, జార్జ్‌బ్యాండ్, మైకేల్ వెస్ట్‌మేకట్, అను వార లున్నత పర్వతారోహణానుభవజ్ఞులైన షేర్పాలతో వస్తువుల నైదవ శిబిరమునఁ జేర్చు బాధ్యత వహించిరి. టెన్‌జింగ్, గ్రిగరీ, నాయిస్ అను ముప్పురు దిగువశిబిరములమధ్య వస్తువుల రవాణాకొఱకై నియమింపఁబడిరి. ఈవిధముగ వస్తువిశేషము లన్నియు మేనెల పదునైదవ నాఁటికి శిబిరములలోఁ జేరియుండవలయునని నిర్దేశింపఁ బడుటచేఁ బనులు చుఱుకుగ సాగుచుండెను.

లోట్స్‌శిఖరముపై మార్గము నన్వేషింప వెడలిన ఛార్లెస్ ఇవాన్స్ దళము మే యాఱవనాటి సాయంసమయమునకు బ్రథమ శిబిరమున కేతెంచెను. ఆశిఖర భౌతిక నైసర్గిక లక్షణము లతి భయంకరములనియు, వానినిఁ దరించి సురక్షితముగ నావలి కరుగుట కలలోని వార్తయనియు, వారు వర్ణించిరి. ఇవన్నియు విన్నమీఁదటఁ బర్వతారోహకుల నొకచో సమావేశపఱచి భావికార్యక్రమనిర్ణయముఁ జేయ సర్ జాన్‌హంట్ సంకల్పించెను. మే యేడవనాఁడు హంట్, ఇవాన్స్, హిల్లరీలు సమావేశమై సర్వవిషయముల వితర్కించుకొనిరి,

అన్ని సంగతులఁ గూలంకషముగఁ జర్చించిన మీఁదటఁ గొన్ని ముఖ్యమైన తీర్మానములతో నొక పథకము సిద్ధమయ్యెను. సౌత్ కాల్‌పై శిబిర స్థాపన యయినవెనుక శిఖరాగ్రారోహణము వెంట వెంటనే రెండు సార్లు సేయవలయుననియు, నవసరమైనఁ ద్వితీయ యత్నము గూడ సేయవలయుననియు వారి తీర్మానములో ముఖ్యాంశములు. శిఖరాగ్రారోహణ నుపయోగింపఁ దగిన ప్రాణవాయుసాధన మెట్టిదను సమస్య పొడసూపెను. శిఖరారోహణ విజయవంత మగుటకీ ప్రాణవాయు సాధనము లత్యంతావశ్యకములను విషయము లోకవిదితమే. బాహ్యాంతర్వాహిక సాధనముల రెంటివలనను బ్రత్యేక లాభనష్టము లున్నవి. అంతర్వాహిక ప్రాణవాయు సాధనముల నుపయోగించినఁ బర్వతారోహకుల సహనశక్తి యతిశయించి దీర్ఘకాల మధిరోహింపఁ గలుగుదురు. అదియుఁగాక యీ యంత్రము బహు భారముగనుండియు, నున్నతస్థలముల శీఘ్రగతి నారోహింపఁగల శక్తిని బర్వతారోహకుల కిచ్చు నవ కాశములు జాలఁగలవు. ఈసాధనములతోఁ బయలుదేరి మూఁడువేల యడుగుల యెత్తున, ననఁగా నుమారొకమైలు దూరములోఁగల శిఖరాగ్రమును జేరఁగలరను నాశగలదు. కాని ఎవరెస్టు శిఖరాగ్రభాగ మధిరోహించునపు డెంత తేలికమైన వస్తువులున్నఁ బ్రయాణ మంత సులభ సాధ్యము గాఁ గలదు.

ఇఁక బాహిర్వాహిక ప్రాణవాయు సాధన మన్ననో, యేసాధనము లేని వానికన్న, నది యున్నవానికే బహువిధలాభములు నేకూఱును. అది యతి భారమైనది గాదు. ఎన్నఁడోకాని సెడదు. కాని, కొన్ని ముఖ్య విషయముల దీనికన్న నంతర్వాహిక సాధనమే మేలు. పర్వత మధిరోహించు కొలఁది యీ సాధనము పర్వతారోహకుని గమనవేగమున క్షీణదశకుఁ దెచ్చుచుండును. అట్లగుటఁ గాల

విలంబనము దప్పదు. తప్పనిచో నున్నతస్థలములలో వాతావరణ ఘటితముగ మహాప్రమాదములు వాటిలు టనివార్యమగును. సౌత్ కాల్ ఎవరెస్టు శిఖరాగ్రముల నడుమ మఱియొక శిబిరమేర్పఱుప నవకాశముగలదు.

టాంబోర్డిలాన్ బాహిర్వాహిక యంత్రమత్యధిక ప్రయోజనకారి యని నిరూపించుటకు బహుకాలముగఁ గృషిసేయుచుండెను. కాఁగాఁ బ్రస్తుత మీ పర్వతారోహక దళీయముఖ్యులు సమావేశమై పై రెండు ప్రాణవాయు సాధనముల సమయానుకూలముగ నుపయోగింపవలసినట్లు నిశ్చయించిరి. సౌత్ కాల్ శిబిరమును వీడి శిఖరాగ్రమునకు వెడలు పర్వతారోహక దళద్వయ మొక టొకటిగ నీరెంటిని వాడవలసినట్లును, శిఖరాగ్రారోహక దళములో నిరువురేసి సభ్యు లుండవలసినట్లును, వారికి సకల సాహాయ్యముల నొనర్చుటకై మఱికొందఱు శిబిరముల కడ నుండవలసినట్లును, నవసరమైనవారికిఁ దోడు పోవలసినట్లును, ప్రథమ దళము శిఖరాగ్రము గూర్చి వెడలిన యనతికాలముననే ద్వితీయ దళము వెన్నంటి పోవలసినట్లును, ప్రథమదళము, యత్నకార్యసిద్ధిఁ బొందనిచో ద్వితీయదళ మాకార్యముఁ గొనసాగింప వలసినట్లును దీర్మానములు గావించిరి.

శిఖరారోహణ కార్యసిద్ధికై పర్వతారోహకు లనుసరించ వలసిన పురోగమన పథకములో నారోహకదళము లిరువదివేల రెండువందల యడుగుల యౌన్నత్యములో నిర్మితమైన నాల్గవ శిబిరము నుండి బయలుదేఱి లోట్స్‌శిఖర పాదసీమ స్థాపితమైన పంచమశిబిర మును జేరి మూఁడవ నాఁ డిరువ దారువేల యైదువందల యడుగుల యెత్తుగల సౌత్ కాల్ పర్వతము నధిరోహించి, యం దొక శిబిరమును స్థాపించి ప్రచండపవనాది వాతావరణ విపర్యాసము లవరోధములు

గల్పింపనిచో గమ్యస్థానము గూర్చి సాగిపోవలయును. కాలాతీతమైన పర్వతారోహకులు శారీరకశ్రాంతి నొందుటయేగాక యాహారపానీయములు గొఱవపడును. ఈ శిఖరాగ్రారోహక దళద్వయము లోట్స్ శిఖరముపై స్థాపించిన పంచమ శిబిరమునుండియే ప్రాణవాయువు నుపయోగింపవలెననియుఁ బడమటిలోయఁ బ్రవేశించినది మొదలు రాత్రి సుఖముగ నిద్రించుటకై పర్వతారోహకులకు జిన్న చిన్న ప్రాణవాయు పూరితపాత్రల నందఁజేయవలయు ననియుఁ దీర్మానించిరి. స్విస్‌దళ మటనట వదలిన గాజుపాత్ర లిపుడు వీరికెంతయో సాయపడుచుండెను. వీనియుపయోగమునఁ బరిపూర్ణ విశ్రాంతి, దుర్భరశైత్య నివారణ, నూత్న చైత్యము, వారికిఁ జేకూఱును.

ప్రస్తుతము లోట్స్ శిఖరముఖమునుదాటి సౌత్ కాల్ పర్వతముపై నడుగిడుట యను క్లిష్టసమస్య వారిని వేధించుచున్నది. మే పదునైదవ నాటికై న సీ శిబిర స్థాపనకార్యము లంతమొందవలయును. ఏడవ తేదినాఁటి సమావేశములో మఱికొన్ని ముఖ్యాంశములఁ జర్చించిరి. శిఖరాగ్రారోహణ దళద్వయములలో నలువురు సభ్యులుండవలసినట్లు నిశ్చిత మయ్యెను. టాంబోర్డిలాన్, ఛార్లెస్ ఇవాన్స్‌లతోఁ బ్రథమదళ మేర్పడినది. వీరింతవఱ కుపయోగించు నంతర్వాహిక ప్రాణవాయు సాధనములతోఁ గార్యము సాధించవలయును. గమ్యస్థానమా, బహుదూరస్థితము! శిఖరమా, మహోన్నతము! వాతావరణమా, భయోత్పాదకము! కావునఁ ద్వరితగతినిఁ గార్యము సాధించుట కీసాధనమే వజ్రాయుధము. దీన నాగ్నేయశ్రేణిపై (South east ridge) శిబిరనిర్మాణావశ్యకత యుండఁజాలదు.

ద్వితీయ దళములో టెన్జింగ్ హిల్లరీలు సభ్యులైరి. వారి పూర్వానుభవమేగాక నేఁటివఱకు వారొనర్చిర యారోహణాది

కార్యములు హంట్ మనసును బూర్ణముగ నాకర్షించెను. ఈదళ ద్వయ ప్రయాణముల నడుమ నిరువది నాల్గు గంటల వ్యత్యాస ముండును. ద్వితీయదళము బాహిర్వాహిక ప్రాణవాయుసాధనమునే కొనిపోవును. వీరికి సాహాయ్యముగ సర్ జాన్‌హంట్ గ్రిగరీలు మఱి నలువురైదుగురు సుప్రసిద్ధ షేర్పాలు వెనుకనే వచ్చుచుందురు. ఈ షేర్పాల కున్నత పర్వతారోహణ శిక్షణఁ గూడ నిచ్చిరి. ఈ సాహా య్యక దళ మూర్ధ్వ శిబిరములకు సామగ్రినిఁ జేర్చు సందర్భముల హిల్లరీ, హంట్, టెన్జింగ్, గ్రిగరీలు వారికి నాయకత్వము వహింతురు.

లోట్సె శిఖరముపైఁగల హిమానీనది మీఁదుగ నెడమవైపు నకు మఱలి జినివాస్పర్ (Geneva spur) దనుకఁ బర్యవేక్షణ జఱి గినఁ గాని పురోగమింప వీలులేదు. ఆపర్వతశ్రేణిపైనుండి నిట్టి నిడివిగఁ గ్రిందికి దిగు రాతిగోడకే 'జినివాస్పర్' అను పేరిడిరి. ఈ పర్య వేక్షణ భారము, జార్జ్‌లో, జార్జ్ బ్యాండ్, వెస్ట్‌మేకట్ అనువారలపైఁ బడెను. యాత్రిక దళమునకు వైద్య సాహాయ్యము సేయ మైకేల్ వార్డ్ నియమితుఁ డయ్యెను. ఇతఁడు ప్రథమశిబిరమునుండి హిమహతా ద్యస్వస్థతాసమస్థలకు విశ్రాంతిఁ గల్పించుచు, నౌషధముల నిచ్చు చుండును.

ఈశిఖరారోహణ పథకానుసారము గార్యసాధన ప్రారంభ మగుటకు బూర్వము నాల్గవశిబిరములో నాహారాదిక వస్తువులఁ బుష్క లముగఁ జేర్చియుండవలయును. ఒకవేళ నారోహణ పథకములోఁ దాత్కాలికపు సవరణలు గల్గుట తటస్థించిన శిఖరారోహణఁ గొంచె మాలస్యము గాఁగలదు. అట్టిచో నాహారపదార్థముల కొఱత యేర్పడఁగలదు. కనుక మున్ముందే నాల్గవశిబిరము నాహారసామగ్రితో నింపవలెను. పడమటి లోయఁగల పంచమశిబిరములో శిఖరాగ్రారో

హణావశ్యకసామగ్రి యుండవలెను. మఱల నీసామగ్రిని సౌత్ కాల్ పైకిఁ జేర్చుటకు సమర్థులైన షేర్పాలును, వారి గోనిపోవుటకు ఛార్లెస్ వైలీ, విల్ఫ్రిడ్ నాయిస్ అనువారలు నియమితులైరి. వీరు తమతమ షేర్పాదళములతో ననుకూలసమయముల బయలుదేఱి పోవలయును.

ఈరీతిగఁ బర్వతారోహక విధ్యుక్త ధర్మనిర్ణయము జఱిగెను. ఒక్కొక్కఁడు జగద్విశ్రుత కీర్తిప్రదాయక మహాకార్య నిర్వహణఁ దనతన ప్రముఖపాత్ర నిర్వహించుట కుత్సహించుచుండెను. ప్రతివీర వర హృదయమున నేదో యొక యనిర్వచనీయానందము వెల్లి విరియుచు నాత్మవిశ్వాసము ప్రబలుచుండెను. స్వార్థసంకుచిత భావ ములకు వారిహృదయము లవకాశ మిచ్చుటలేదు. మానవసామర్థ్య మును బరీక్షించుచు, దానికొక యవధినిర్మించి విజయగర్వాతిశయతఁ దన్మయత్వమునొందు ఎవరెస్టుశిఖర సార్వభౌము నెవ రోడించిన నేమి? అది మానవజాతికే మకుటాయమానమౌ శాశ్వత విజయము. అంతియే!

ఇట్టి భావతరంగములు పర్వతారోహక హృదయాంబుధి నుప్పొంగుచున్నను భావికార్య నిర్వహణ సంబంధమైన భయాందో ళనోత్కంఠల వారి హృదయములు స్పందించుచుండెను.

---

# 10

## సౌత్ కాల్ 1

ప్రథమ శిబిరమున శిఖరారోహణపథకముఁగూర్చి చర్చలుఁ, దీర్మానములు జఱుగుచుండ, జార్జ్‌లో, జార్జ్ బాండ్ మూఁడవశిబిరమున విశ్రాంతిఁ గైకొనుచుండిరి. మే తొమ్మిదవనాఁడు జార్జ్‌లో నిర్వహింపవలసిన కార్యము వివరించి ప్రయాణోన్ముఖుని జేయుఁటకై హాంట్ హిల్లరీలు వెడలిపోయిరి. మార్గము లెన్నియో చిత్రవిచిత్రమైన మార్పుల నలరుచుంట వారు గమనించిరి. ఇతఃపూర్వము మార్గమిరువైపులఁ గాన్పించు పరిచిత దృశ్యము లపుడులేవు. ద్వితీయశిబిర సమీపమున మంచుకంబ మొకటి యుండెను. ఇయ్యది పర్వతారోహకులకు శిబిరస్థానమును గుర్తించుటకును, ననుసరింపవలసిన మార్గముఁ జూపించుటకును, నుపయోగపడుచున్నది. అటులయ్యు దాన నేదొండు ప్రమాదముగూడ లేకపోలేదు. హిమనిర్మితమగుటచే నది యేనాఁడో, యేక్షణముననో, సూర్యకిరణ సంయోగమున కఱిగిపోయెను. కాని దీనికి బదులో యనునట్లు మఱియొకచో నొకవైపునకు వాలి, యాక్షణముననో, మఱుక్షణముననో విరిగి మీఁదఁబడఁగల మంచుకంబము వెలసెను. క్రొత్తగవాలిన మంచు దట్టముగ నేలపై జేరికొనుటఁ బూర్వము గావించినత్రోవ పరిపూర్ణముగ మాసిపోయెను. అందుచే హాంట్ హిల్లరీలు పునర్మార్గాన్వేషణ నిమగ్నులైరి. అట్చటచ్చట విస్తృత బిలములు గొన్ని కానవచ్చెను. వారిరువురు రెండవ శిబిరమున నుండగా షేర్పాదళములుఁగొని యేతెంచిన గ్రిగరి తానొక మహా ప్రమాదమును దప్పికొనిన వృత్తాంతము వివరించెను. ద్వితీయశిబిరమును సమీపించుచుండ హిమశైలమొకటి హఠాత్తుగ జారిపడెను. అదృష్ట వశమున గోరంతలో వారెల్లరు దప్పించికొనిరి. లేనిచో నాఁ డది

మఱపురాని విషాదసంఘటన కాకుండెడిదా! ఇంతటి సూక్ష్మకేశ మాత్రాంతర ప్రమాద మీ యాత్రలోన నాద్యంత మెచ్చటేనిఁ దప్పిపోలేదు.

మే పదియవనాఁటికి లోట్సె శిఖర పర్యవేక్షణ పూర్తిగాఁ గొన సాగించుటకు 'జార్జ్‌లో' సంసిద్ధుఁడయ్యెను. కాని యపుడు వాతావరణ హిమవృష్టులు ప్రబల శత్రువులైనవి. పది, పదునొకండు తేదీలలో వాతావరణము మఱింత తీవ్రరూపముఁ దాల్చెను. హిమవృష్టి విపరీత మయ్యెను. పడమటి లోయలో నూపిరిగాలి యున్నదా యనిపించెను. నేలపై మంచు అడుగు లోతునఁ బేరికొనెను. పండ్రెండవనాఁడు హిమ వృష్టి ఫలితముగ నిన్నాళ్ళు దయారునేసికొనిన మార్గములెల్ల మాసి పోయినవి. పర్వతారోహకుల యుత్సాహము చల్లారినది. లోట్సెశిఖర పర్యవేక్షణార్థము వెడలిన జార్జ్‌లో నడుములోతు మంచులో దిగఁ బడెను. ఇట్టి యాందోళనలో వాతావరణ పరిణామ వార్తలు సంతో షము గొల్పినవి. సాయంకాలము హిమవృష్టినిలిచి నిర్మలముగ నుండుట మొదలిడెను. అంత పంచమ శిబిరము దనుక షేర్పా దళ ములు చుఱుకుగ నడువ సాగినవి.

మే పదియవ నాఁటి మధ్యాహ్నమున టెన్జింగ్, ఆంగ్‌న్యీమా ఆంగ్ నాంగ్యాల్, అను షేర్పాలు వెంటరా, జార్జిలో, వెస్ట్‌మేకట్ పంచమ శిబిరము గూర్చి కదలిపోయిరి. జార్జ్‌లో పని యేమనగా నారవ శిబిరమేర్పఱచి యింత వఱకు మెట్లుచెక్కి త్రాళ్లు గట్టి యుంచుట. అందులకే యతఁడు పదునొకండవ తేదీనాఁడు షేర్పాల వెంటఁగొని పురోగమించెను. కాని హిమవృష్టి తీవ్రత హెచ్చెను, మంచులో దిగఁబడి కదలఁజాలక మెట్లో యూరు వందల యడుగుల యౌన్నత్య మైదున్నర గంటల నధిరోహించిరి. జార్జ్‌లో పంచమ

శిబిరమును వీడి పైకేగెను. ఇంకను వెస్ట్ మేకట్ రాలేదు. అందుచే ననుభవజ్ఞుఁడైన ఆంగ్ న్యీమాను దనకడ నుంచుకొని మిగిలిన వారిని వెస్ట్ మేకట్ సాహాయ్యమునకై పంచమ శిబిరమునకు వెళ్ళ నాజ్ఞాపించెను. వారు వెడలిన పిమ్మట జార్జ్ లో ఆంగ్ న్యీమా, మిక్కిలి డస్సి యుంట నిద్రించిరి. పాపము! వా రెంత శ్రమపడిరోగాని యొక పెట్టునఁ బదునైదు గంటలసేపు నిద్రించిరి. నాటినుండి లోట్సె శిఖర పర్యవేక్షణ రెండురకములుగ జరిగినది. జార్జ్ లో, ఆంగ్ న్యీమాలుగలిసి యారవ శిబిరమున కధోభాగమునఁ గల యారోహణమార్గమును జక్క దిద్దుచుఁ దచ్ఛిబిరోర్ధ్వభాగమున లోట్సె హిమానీనది పుట్టుక పర్యంతము సుగమ మార్గ రచనాయత్నమున నిమగ్నులై యుండిరి. ఇఁక వెస్ట్ మేకట్ పంచమ శిబిరమునుండి జార్జ్ లో కవసరమైన యాహారము, త్రాళ్ళు, ప్రాణవాయు సాధనములు మొదలుగాఁగల వస్తువుల నేనాఁటి కానాఁడు కొనివచ్చుచుండెను. అంతియగాక వారి పథకము ననుసరించి యారవ శిబిరమున వస్తువులఁ జేరవేయుచుండెను. ఇట్లు నూతనప్రదేశములలో నిరవధిక కార్యదీక్షాపరతంత్రులై యుండ వాతావరణము వారినిఁ జిక్కుచిక్కులఁ బెట్టుచుండెను. అసలే, యస్వస్థతచేఁ బీడితుఁడైన వెస్ట్ మేకట్ ఆ వాతావరణము నోర్వలేకుండెను. ఉత్సాహ ముర్విని దాటుచున్నదిగాని శరీరము వాతావరణావరోధముల దాట రానట్లున్నది. వెస్ట్ మేకట్ పంచమశిబిరమువీడి పురోగమింపఁ జాలకుండెను. ఆతనియవస్థఁ గన్నులారఁ గాంచిన వారొట, నాతనికడనుండు షేర్పా లతిభారవస్తువులఁ దమంతట దామె భుజముల నెత్తికొని యారవ శిబిరమునకు వచ్చుచుండిరి. పదమూడవ తారీఖున సర్ జాన్ హాంట్, జార్జ్ లో కృషినిఁ జూడ నుద్దేశించి యారవ శిబిరమునకు వచ్చెను. ఆమఱునటిదినమే యనఁగా బదునాల్గవ తేదీనాఁడు జార్జ్ లో వేయియడుగుల పైకరిగి స్విస్ దళ సప్తమశిబిరముఁగనుఁగొనెను.

లోట్స్ శిఖరపర్యవేక్షణ పర్వతారోహకశక్తిసామర్థ్యాతిశయములకొక యగ్నిపరీక్షవంటిది. ఇట్టి పరీక్షఁ గ్రమక్రమముగ విజయప్రాప్తఁ డగుటచే జార్జ్‌లో ప్రతిక్షణాతిశయ పురోగమనోత్సాహి యగుచుండెను. ఎట్టులైన లోట్స్ శిఖరమును దాటి సౌత్ కాల్ పర్వతముపైఁ గాలు మోపి, యనుకూలస్థల మన్వేషించి సుఖదాయకమగు శిబిరమును స్థాపింపవలయునని యాతని యభిలాష. నిజమున కీకార్య మొనర్చిన గాని యితర కార్యక్రమము కొనసాగదు. అందుచే షేర్పా దళముల నుత్సాహపఱచి వస్తుసామగ్రి నున్నత శిబిరములఁ ద్వరితముగఁ జేర్చుట కారంభించిరి.

పదునైదవనాఁడు విల్‌ఫ్రెడ్ నాయిస్, తనదళముతో జార్జ్‌లోను గలిసికొనెను. ఆనాటిరాత్రి సుఖనిద్రఁజెందుటకై వారిరువురు నిద్ర గుళికల సేవించిరి. వానిఫలితముగ మఱునాఁడు జార్జ్ చుఱుకుదనము నశించెను. ఆరవ శిబిరము వీడి యాఁపువందల యడుగులయెత్తునఁగల సప్తమ శిబిరముఁజేరుటకు రెండున్నరగంటలకాలము పట్టెను. ఆతని నిద్ర మత్తువీడలేదు. కూర్చుండినను, లేచినను, నడచినను నిద్రమత్తతని నశక్తునిఁ జేయుచుండెను. అట్టి పరిస్థితుల నారోహణచేయఁదగదు; చేయుటకు దగు నవకాశములు గాన్పించుటలేదు. ఏదెటులున్నను సహచరునిఁ గాపాడుటయే యవశ్యకర్తవ్యమని భావించి విల్‌ఫ్రెడ్ నాయిస్ ఇఁక నాతనితోఁ బురోగమించుట దుర్లభమని తిరోగమించెను. నాఁటికిఁ జెప్పికొనఁదగిన కృషి జరగలేకపోఁగ నితరుల కిది నిరుత్సాహ జనకమయ్యెను. పంచమ శిబిరము జేరినమీఁదట జార్జ్‌లో గాఢనిద్ర మునిఁగెను. నిద్రగుళికల ప్రభావ మాతనిపైఁ బదునేఁడవ తారీఖు దనుక బ్రసరించినది.

పదునేడవ నాటి ప్రాతఃకాలమున కా నిద్ర గుళికల ప్రభావ మువశమించెను. కాలయాపన లేక విల్ఫ్రిడ్, జార్జ్‌లో, మఱల సప్తమ శిబిరముఁ జూర్చి వెడలిరి. వీరికి సాయముగఁ బదునైదవ తారీఖు నాఁడే ఎడ్మండ్. హిల్లరీ అవసరమయిన వస్తుపరికరములతో నాల్గవశిబి రములో బయలుదేఱి సరాసరి యేడవ శిబిరమునుజేరి, యానాఁడే తిరిగి నాల్గవశిబిరము జేరెను. ఆనాఁటి యాతని యారోహణశక్తి తదితర పర్వతారోహకుల ముగ్ధచిత్తులఁ జేసినది. వారిరువు రట్లు వడి వడిగఁ బురోగమించి, సప్తమ శిబిరమును దాటి, దానికడ్డముగ నిల్చి మఱుఁగుపఱచు హిమశిలా స్తంభమును (Ice pinnacle) దాటి యారు వందల యడుగులయెత్తు కరిగిరి. ఈ పురోగమన మెల్లర హృదయ సీమల సుత్సాహాతిరేక రసపూరితము గావించెను.

మఱునాఁడు సప్తమశిబిరమును వీడి యావలకేఁగిరో, లేదో! తత్‌క్షణమే పర్వతారోహకులు వెనుదిరుగవలసివచ్చెను. నిన్నటిదిన మునకన్న నీనాఁడు — పదునెనిమిదవ తేదీ — వా రొకింత యున్నత ప్రదేశము నధిరోహింపఁ గల్గిరి. అటులయ్యును, వారు పురోగమింప సాహసింపఁ జాలరైరి. కారణము? — అచటి మహాప్రళయము భీకర ఝంఝామారుతమే. దాని వేగాతిశయము వారిహృదయములఁ గలఁచి వైచినది. ఆ భయంకరనినాదమే వారి ధైర్యోత్సాహముల భగ్నము చేసినది. మొండిధైర్యముతో వా రనతిదూరమేఁగిరి గాని యపరిమిత శైత్యకారణమున జార్జ్‌లో కరము హిమహతమయ్యెను.

ఆనాఁడు పందొమ్మిదవ తారీఖు. పదిదినములుగాఁ గొన సాగుచున్న లోట్సెపర్యవేక్షణ యింకను దుదముట్టలేదు. ఎవరెస్టు శిఖరాగ్ర పరిసరముల వీచు పవనవేగము వర్ణనాశక్యము. ఆపవనముల ధాటికిఁ బర్వతములన్ని యొక్కపరి సమూలతలముగ నెటకే నెగిరిపో

గలవేమో యనుభ్రాంతి గలుగుచుండెను. లోట్సె శిఖరముపైనుండి ప్రచండ మారుతములు మహోద్ధత ప్రవాహమువలె 'హోరు' మను గంభీర గర్జారావములతోఁ బరుగులిడుచున్నటు లుండెను. సప్తమ శిబిర మచేతనావస్థ నుండెను. నాల్గవశిబిరములో నాందోళన హెచ్చు చుండెను. కలవులో నధికమాస మనినట్లు నిస్తంత్రీ వార్తా ప్రసార యంత్రము లీ శిబిరములమధ్య స్తంభించిపోయినవి. గోరుచుట్టుపై రోఁకలిపో టన్నట్లు రెండుదినముల క్రితము సప్తమ శిబిరమున కేఁగు షేర్పాదళమునకు నాయకత్వము వహించుట కేఁగిన ఛార్లెస్ ఇవాన్స్ పంచమ శిబిరములోఁ బరిపూర్ణవిశ్రాంతికొఱ కౌషధసేవఁ గావించెను. విధివశమున, నది వికటింప గమ్యస్థానము జేరుట కతఁ డశక్తుఁడై మఱునాఁడే నాల్గవ శిబిరమున కేతెంచెను. ఆతఁడు సురక్షితముగ మఱలి వచ్చెనే కాని యాహార పానీ యముల నొల్లఁ డయ్యెను. అట్టిచో నితఁ డెట్లు శిఖరాగ్రా రోహణ సాధించు టెట్లు? ఈ విషయము సర్ జాన్ హంటును బీడింపసాగెను. అత్యధిక మానసిక వ్యసన కారకము లైన సమస్య లీకొలదియేనా యని కాఁబోలు, నాహారపదార్థముల కొఱత యేర్పడు సూచనలుఁ బొడసూపెను. పర్వతారోహకుల యాహారమే గాక షేర్పాల యాహారము గూడఁ గొఱవఁబడునేమో యను సంశయము దానికిఁ దోడయ్యెను. యాత్రారంభదశలో జూన్ మాసము నగ బడునంత వఱ కవసరమైన యాహార సామగ్రినిఁ గొనివచ్చినను నీభయము దప్పలేదు. ఒకవేళ నట్టికొఱత యేర్పడుపక్షమున నీరెండు యత్నములు నిరుపయోగములై శిఖరాగ్రారోహణ యత్నము మఱి యొకటి యవసరమగును; గాని యీసమస్య ప్రథమ శిబిరము కడ నుండి గొనిరాఁబడిన వస్తుచయ దర్శన లాభముతో తేలిపోయెను. వారి హృదయాకాశము ధైర్యోత్సాహములతో వెల్లివిరిసినది.

ప్రథమ శిఖరాగ్రారోహకదళ మిరువది రెండవ తేదిని బయలు దేరవలయు నని హంట్ తీర్మానించెను. నాల్గవ శిబిరములో శిఖరాగ్రారోహణ కార్యమునకుఁ బూర్వము పర్వతారోహకుల దైనిక జీవితము నీవిధ ముగ సర్ జాన్ హంట్ వర్ణించియున్నాఁడు. "పర్వతారోహకులు నిత్యముదయ మెనిమిది గంట లగుసరి కెల్లరు బడకలు వీడుదురు. అప్పటి కింకను సూర్యకిరణము లాగుడారములపై సోకవు. శీతల మతిబాధాకర ముగ నుండును. గుడారము లోపలియంచులఁ మంచు దట్టముగఁ బూసి కొని యుండుటచే, శ్వేతవర్ణ కాంతులఁ జల్లుచు దుర్భర శైత్యకారణ మగుచుండును. పడకసంచులనుండి శిరము వెలికిఁదెచ్చి, నిద్రమత్తు కతన నరమోడ్పు కనుదోయిచూపులఁ జుట్టు కలయఁజూచుచుండ, గుడారము యొక్క ద్వారపటమును మెల్లగఁ దొలఁగఁద్రోసి, తేనీటి పాత్రలతో షేర్పా యొకఁడు దరహాసితవదనుఁడై కాన్పించును. దాదాపు తొమ్మిదిగంట లగుసరికి నులివెచ్చని సూర్యకిరణములు గుడారములపైఁ బ్రసరించి వెచ్చఁదనమిచ్చును. గుడారములవీడి వెలుపలికి రావలయు నని మనసొప్పదు. బహుయత్నానంతరమే వారు పడకలు వీడు చుండెరి. ఆదినములలో వాతావరణ మాహ్లాదకరముగ నుండుటచే నాకాశము నిర్మలాకృతి నిగనిగ మెఱయుచుండెను. పరిసర పర్వత గిరులు మిహికాంబరములు ధరించియుండుట కతన రవికిరణ స్పర్శోల్ల సితములై యవి కనుల మిఱుమిట్లు గొల్పుచుండును. భానుఁడు మింటి కెగయు కొలఁది ప్రకాశ మతితీవ్రమై కనుచూపులు చెదరిపోవునట్లు సేయును. అందుచే వారు కంటియద్దములు ధరించి లోట్సె ముఖపరి శీలనఁ జేయుదురు. అది పూర్తి యగులోపల నుదయాహారము సిద్ధమగును. అందఱును బెద్దశిబిరముఁ జేరి యనుకూలస్థలములలో సుఖాసీనులై, యానాఁటి కార్యక్రమాది విశేషములఁ గూర్చి దీర్ఘచర్చలు, గోష్ఠులు, జరుపుచు భుజింతురు. దుర్భిణీ యంత్రము

ధరించి లోట్సె శిఖరముపైఁ బర్యవేక్షణజులుపు పర్వతారోహక ద్వాయ పురోగమన విశేషములఁ బరిశీలించుచు, ఛార్లస్ .ఇవాన్స కాలక్షేపము సేయుచుండును. మాధ్యాహ్ని కాహారమునకు వేళ యగువఱకు, నెవరికివారు నియమితకార్య నిర్వహణనిమగ్నులై యుందురు. భోజనసమయములో నానా డంతవఱకైన వివిధసంఘటనాది విషయములపై వ్యాఖ్యానము చేయుదురు. సాయంకాలము నాల్గుగంటల కల్పాహారపువిందు జరుగును. తదనంతర మున్నత శిబిరములఁగూర్చి వెషలు దళములు తిన్నగ బయలుదేరును. ఆదృశ్యములఁ దనఛాయాగ్రాహక యంత్రముతోఁ జిత్రములఁ దీయుటకై శిబిరమున కావల నేదో యొక మిట్టపయిని యంత్రసమేతుఁడై స్టోబార్ట్ కాచికొని యుండును. ఇంతలో సూర్యాస్తమయకాల మాసన్నమగును. సంధ్యారాగరక్తిమ పరిసర శృంగాగ్రములపైఁ బ్రసరిల్లును. సంజ కెంజాయలు నూప్సె శిఖరపార్శ్వములపై నలమికొనును. చూచునంతనే యా సంజ కెంజాయలు పడమటిలోయ బలిమి నాక్రమించును. నేత్రముల మిఱుమిట్లు గొల్పు శ్వేతకాంతులకు మాఱుగ నిపుడు నల్లనినీడ లెల్లయెడల నావరించి యాపర్వతప్రాంతముల రూపమును మార్చును. ఎవరోయొక పర్వతారోహకుఁ డలసి, సొలసి శిబిరమున కేతెంచును. తదితరు లాతనిఁ జుట్టుముట్టి నాఁటి విశేషములఁ గూర్చి ప్రశ్నవర్ష మాతనిపై గురిపించుచు, నాతని పెదవుల దాటు మాటల నుత్కంఠతో వినుటకు సిద్ధముగ నుందురు.

సూర్యాస్తమయమగును. ప్రపంచ మంధకారబంధుర మగును. అంతశ్శైత్యమతి శయించి దుర్భరమగును. పంచమ శిబిరమున వస్తువులఁ జేర్చిమఱలివచ్చిన సభ్యులఁగలసి రాత్రిభోజనమున కేఁగుటకు సంసిద్ధులై యుందురు. ఇంతలో నెవరో యొకరు రేడియోయంత్ర

ముచు ద్రిప్పుదురు. ఎవరెస్టు యాత్రికులకొఱకు వాతావరణ వార్తా ప్రసారసముచు మదియే. ఆవార్తల సేకరించిన పిదపఁ గొంతవిరామ ముండును. ఏదేని రచనలుగాని, పఠనములుగాని యానమయములలో జఱుగుచుండును. ఇంతలో నాహారము సిద్ధమైన దనువార్త వెలువడును. అత్యుత్సాహముతో సభ్యులెల్లఱుఁ బెద్దగుడారములోని కేఁగుదురు. మేజాబల్లచుట్టుఁ గూర్చుండి భోజనమున కుపక్రమింతురు. దుర్భర శైత్యము కతన గుడారముద్వారము మూసివైతురు. కొందఱు భోజనాంతర మేదేనొక గోష్ఠిని నిమగ్నులగుదురు. కొందఱు వెచ్చని పడకసంచులలో నిద్రాసుఖానురక్తులై యాలస్యము సైపలేక తత్క్షణమే యరిగెదరు. నేను (సర్ జాన్ హంట్) తాండూప్ దగ్గఱ మైనపువత్తినిఁ బెచ్చి దినచర్య వ్రాయుటకై కలమును దీసికొందును; కాని కలము చుట్టును మంచుగడ్డ మయియుండును. సిరాజారదు. నిమిష నిమిషమున కాకలమును దీపికపై వెచ్చఁజేయుచు నానాఁటి సంఘటనల రచింతును. అనంతర మొక నిద్రగుళిక సేవించి, దీపమార్చి పడకఁ జేరుదును. అంతటితో మఱొక దినము గడచును. ఇఁక నెన్ని దినము లీవిధమున నీప్రదేశములో గడపవలయునో ? ”

జార్జిలో, మైకేల్ వార్డ్, మేనెల పందొమ్మిది, యిరువది తేదీ లలో లోట్సేశిఖరమునుదాటి సౌత్ కాల్ పై నడుగిడుటకు సర్వప్రయ త్నములు సేసిరి. పదునొకండుదినములు ప్రకృతిశక్తులతో హోరా హోరిగఁ బోరాడినను వారు సఫలమనోరథులుగాలేదు. వారియోరిమి నశించెను. కొంతదూర మేఁగిరి. గాని ప్రచండవాయువ్య తీవ్రవాత ములు వారినిఁ దఱుమఁగొట్టినవి. వాతావరణ మతి దుర్భరమయ్యెను. వారి వజ్రకాయములు డస్సినవి. కొందఱు రోగార్తులైరి. అయినను వారి ధైర్యసాహసము లత్యంత ప్రశంసాపాత్రములు :—

---

# 11

## సౌత్ కాల్ 2

మే నెల సప్తమ దివసము నాఁడు గుదిర్చిన పథకానుగుణముగ సౌత్ కాల్ శిబిరములోఁ దదారోహణార్థము వస్తు విశేషములఁ జేర్చ వలసి యున్నది. ఈ కార్య మాలస్యమైనచోఁ బథకమెల్ల చెదిరి పోవును. కావునఁ ద్వరితగతి నాటంకముల సరకుగొనక సౌత్ కాల్ శిబిర స్థాపనాది కార్యము లొనరింపవలెను.

మే నెల యిరువదవ నాఁడు నాల్గవ శిబిరములో ఛార్లెస్ వైలీ విల్ఫ్రెడ్ నాయిస్, తదితర షేర్పాలు పురోగమనార్థము సంసిద్ధు లగు చుండిరి. ఆకసము తుడిచిపెట్టినట్లు పరిశుభ్రముగ నుండెను. వాయవ్య పవనములు మాత్రము నిరాఘాటముగ విజృంభించుచున్నవి. పర్వత ముల నా ప్రచండానిలములు ఢీకొనఁ బ్రళయార్భాట గర్జానినాద ములు సెవుల బ్రద్దలుసేయున ట్లుండెను. ఇతఃపూర్వము నాయిస్ వైలీల వెంట వస్తువుల మోచికొని సప్తమ శిబిరమున వదలి మఱలి వచ్చిన షేర్పాలు మిక్కిలి డస్సియున్నను మార్గాంతరము లేక మఱల వారినే యీ భారముల మోయ నియమించిరి. ఎవరెస్టు యాత్రార్థము నియ మింపఁబడు షేర్పా లొక్కొక్కరు ముప్పది పౌనుల బరువులతో లోట్సె శిఖర మధిరోహించ వలసినట్లు తీర్మానమయ్యెను; గాని వాస్తవము నకు వారేఁబది పౌనుల బరువులతో సప్తమ శిబిరమును, బ్రహ్మాండ మైన యేటవాళ్ళను, బ్రాణవాయు సాధనములతో నిమిత్తము లేకయే దాటఁగల్గిరి. ఆర్యావర్త జనసామాన్య భుజబలోత్సేక మన నిట్టిదా! షేర్పా భుజబల సహన శక్తుల కీ సాహస కార్య మొక మహా ప్రమా ణము! ప్రస్తుత మీ దళములలోఁ బదుమువ్వురు షేర్పాలుమాత్రమే

కలను. తలపని తలంపుగ నాటంకములు సంభవించినఁ జిక్కులేర్పడు నను భావము తోఁప పెన్జింగ్ వైలీలు నల్వురు షేర్పాల నధికముగ నావశ్యమునఁ జేర్పఁ దీర్మానించిరి. అట్లే నాఁటి యుదయమునఁ బది యేమ్వురు షేర్పాలతో విల్‌ఫ్రెడ్ నైలీలు చతుర్థ శిబిరమును వీడి తరలి పోయిరి.

సూర్యుఁడు పడమటి దెసకు పయన మారంభించు వేళకు సరిగ నిరువురు షేర్పాలు సప్తమశిబిరమును వీడి నాల్గవ శిబిరమున కేతెంచిరి. వారు గొనితెచ్చిన వార్త ధీరహృదయములఁ గలవర పెట్టునదిగ నుండెను. సప్తమ శిబిరమునఁగల ప్రాణవాయు సాధనములు చెడిపోయినవి. శిఖరారోహణకుఁ బ్రాణప్రదములైన ప్రాణవాయు సాధనములు చెడుట యన నిఁకఁ గార్య సాధన నిరాఘాటముగ జరుగ దనియే కదా! టామ్‌బోర్డిలాన్ కలవరపాటు హెచ్చినది. సర్ జాన్‌హాంట్ వ్యసనపడసాగెను. ఇంకను సప్తమ శిబిరము నుండి నిస్తంత్రీ ప్రసారిత వార్తలు రాఁగల యవకాశములు గాన్పించుటలేదు....కాని, వీరి ట్లాందోళనా సంభరిత వైకల్యహృదయులై వ్యసనపడిన మీఁదట నాసాధనము లంత నిరుపయోగములు గావను వార్త వారి సంకటముల హరించెను.

పదునొకండు రోజులు నిద్రాహార వివర్జితులై కఠోర దీక్షఁ బూని కృషి సల్పినను సౌత్‌కాల్ మార్గములో నర్ధభాగమైనఁ బూర్తి సేయలేకపోయిరి. స్విస్ యెవరెస్టు యాత్రలలో నపాయముల ప్రోవని ప్రతీతిఁ గాంచిన సౌత్‌కాల్ పైఁ బయనించుట కెవరు ముందంజ వేయుదురు? మహాధ్య విశ్వాస పూరిత మనస్కులు షేర్పాలా సౌత్‌కాల్ పర్వత మధిరోహింప నీయకొందురా యను సంశయమునకు దావు

లేక పోలేదు. భావికార్య నిర్వహణోపాయాంతరముల సర్ జాన్ హాంట్ ఆలోచించు చుండెను.

మే మాసములో నిరువదొకటవ దివసము. నాటి సూర్యోదయ కాల మతినిర్మలమై యానంద భాజకముగనుండెను. ఉన్నత స్థలముల వాయువేగ మధికముగ లేదు. ఉదయము పదిగంట లగుసరికి సప్తమశిబిరమునుండి యిరువురు పర్వతారోహకులు మంచులో మెట్లు సెక్కుచు మందవేగమున లోట్సెశిఖరముఖమున్పైఁగల హిమానీనది పుట్టుకవైపున కరుగుచుండిరి; వారే, అనల్లు, విల్‌ఫ్రెడ్ నాయిస్. వారికి సహాయముగ టెన్జింగ్ హిల్లరీల సంపుటకు నాయకుడు తీర్మానించి కోరఁగా వా రిరువురుఁ బరమానంద భరితులైరి. నేఁటి వఱకు టెన్జింగ్ ఏవేవో చిల్లరపనులు చక్కబెట్టుటలో నిమగ్నుఁడై యుండెను. సర్వదా యాతనివ్హృదయము సాహసకృత్య నిర్వహణమునకే యుప్పొంగుచుండును. పర్వతారోహణలో నతని సంతోషమునకు మేరలేదు. అట్టివాని కిట్టి యవకాశము గల్గినది. గనుక నతఁడు హిల్లరీతోఁ బర్వతారోహక వేషధారుఁడై మధ్యాహ్నకాలమునఁ దరలి పోయెను. వా రిరువురు మే రెండవనాఁ డొనర్చిన యత్యద్భుతారోహణ -మింకను హాంట్‌స్మృతిపథమునుండి దొలఁగలేదు.

టెన్జింగ్ హిల్లరీలట్లరిగిన యనంతరము నాల్గవ శిబిరవాసులు విల్‌ఫ్రెడ్ నాయిస్ గమనాభివృద్ధిని గమనించుచుండిరి. అతఁ డమిత వేగమున నధిరోహణ చేయుచుండెను. కాని వా రెట్లు పోవుచున్నది తేటపడుట లేదు. శిబిరములోని వా రెల్ల రానాఁడు నాయిస్, అనల్లూ పురోగమన పరిశీలన కార్యములోఁ గడపిరి. నాధిక కాలానంతరము వారు సౌత్ కాల్ పర్వతమును సమీపించుచున్నట్లుఁ జూచాయగఁ దెలియవచ్చెను. .................... మఱికొంత

కాలము గడచినది. అరుగో! యిరువదారువేల యడుగుల యౌన్నత్యమునఁగల సౌత్ కాల్ పర్వతమున నిలిచిరి. ఎవరెస్ట్ యాత్రలో ఘట్టమొక యనర్ఘోధమును విజయవంతముగ నెదుర్కొనిరి. మానవుల కందరాని ఫలమును సమీపించుచున్నారు. అగుచో నెవరి హృదయ మాశల నువ్విళ్ళూరదు? ఇఁక మూఁడువేల యడుగులే! వచ్చినంతదూర మిఁక లేదు. ఎవరెస్టు శిఖరాగ్ర మిపుడు వారి కందియు నందనట్లున్నది. ఆయిరువురుధీరు లా శిఖరాగ్రము వైపు నాశాదృగ్వీచికలఁ బ్రసరించుచు, నే తన్మహోన్నతాజేయాకార శక్తులఁ గని ముగ్ధులై, విగత చైతన్య చేతస్కులైరి. ఈయాత్ర నిపుడు దామే కదా యీస్థలమున కేఁగిన ప్రముఖులుఁ, బ్రథములును. ద్వాదశ దివస పర్యంత ఘోరసంఘ ప్రవర్తిత నిరంతర కృషి నేఁటితో ఫల సమాప్తి నొందినది.

తదనంతరము వారొక పల్లమున దిగి వెన్నంటి వచ్చువారికై త్రాళ్ళఁ, జేపట్లు, నిసుపయూఁచ లచ్చటచ్చట నాటిరి. ఆ చుట్టు ప్రక్కలనే స్విస్ దళ శిబిర శిథిలములు గానవచ్చెను. జీర్ణగుడారములు, నారోహణావేష పరికరములు నుండెను. వాతావరణ మానందదాయకమగుటఁ గొంతకాల మచటఁ గడపి, ప్రదోషకాలమునకు ముందే నష్టమ శిబిరమునకు మఱలి వచ్చిరి. ఈ సౌత్ కాల్ ప్రయాణము దన జీవితమున నత్యంతానందానుభవోపేతమైన దనస్కైవిల్ట్రెడ్ నాయిస్ వ్రాసుచ్చెను. ఇంచుమించా సమయముననే విజయావహులగు నా టెన్సింగ్ హిల్లరీల కడకు ఛార్లెస్ వైలీలు వస్తువాహక దళముతో నచటికేతెంచిరి. వారుఁ బరస్పర మత్యుత్సాహముతో నభినందించికొనిరి. సౌత్ కాల్ పర్వతారోహణ సాధించిన యనంతర మెల్లర హృదయాంబర వీథుల విజిగీషా వీచికలు వెల్లి విరిసెను.

ఆరాత్రి సంతోష సంభరితులై సప్తమ శిబిర వాసులు సుఖ నిద్రా పరవశులైరి. మేనెల యిరువది రెండవనాఁటు సూర్యోదయారుణ కిరణావళి హిమవత్పర్వతశ్రేణీ శిఖరముల గిలిగింతలు పెట్టుచున్నది. మఱియొక యెవరెస్టు దిన మారంభ మైనది. నిన్నటి విజయసంఘటన, నేఁటి పునఃప్రయత్నము నతివేగముసఁ బురికొల్పుచున్నది. సప్తమ శిబిర మప్పుడే కలకలలాడుచుండెను. పర్వతారోహక షేర్పాలిపుడు స్వీయకార్యముల నెట్టి స్వల్పవిలంబనకే తావులేక పోవుచుండిరి. సౌత్ కాల్ పర్వతముపై కురుక వారుద్యమించుచుండిరి. సప్తమ శిబిర మేలాగో నిశ్చలముగ నున్నదను శంక నాల్గవ శిబిరములో రూపొంద మొదలిడెను. నిన్నటి విశేషములు వీరి కెఱుకలేవు. కుతూహలాతిశయచిత్తులై చతుర్థ శిబిరావాసు లుదయాదిగ లోట్సె శిఖరమునే పరిశీలించుచున్నారు. సరిగా నెనిమిదన్నర గంటలకు సప్తమ శిబిరమును వీడి యిరువురు వ్యక్తులు ముందంజవేసిరి. హిమకృతఫలిత శ్వేతవర్ణ రాజత్పర్వత సానుదేశములపైఁ జలిత నక్షత్రములభాతి వారు దృగ్గోచరమగుచుండిరి. ఎందులకై వారట్లు కదలుచున్నారు? ఎటకేఁగుచున్నారు? ఏమి కానున్నదో? అను ప్రశ్నలు వారి హృదయ సాగరములఁ దరంగముల వలె నుదయించుచున్నవి. మెల్లగ నొకరి వెంట నొకరు శిబిరముల వీడి వెలుపలికి వచ్చుచున్నారు. ఇఁక ననుమానమేల? సౌత్ కాల్ పర్వతశిబిరస్థాపనార్థమే వీ రేఁగుచున్నారు. క్రమముగఁ బదునేఁడుగురు వ్యక్తులు చీమలబారు బలె నెమ్మదిగఁ గదలి పోవుచుండిరి. వారి గమన వేగమును బట్టి యారోహణ మెంతటి కష్టసాధ్యమో నాల్గవ శిబిరవాసులే తెలిసికొనఁగలిగిరి. ఆహారలోపమునఁ బర్వత మెక్కుట వారికి బహు కష్టముగ నుండెను. ప్రతి వాఁ డొకటి, రెండడుగు లెక్కి యాయాసముచే నిలిచి, మంచు గొడ్డలిపై శరీర భార

మెల్ల మోపి, క్షణకాలానంతర మూపిరిఁగొని ముందుకు సాగుచుండెను. ఇది జరిగినంతవఱకు మిగిలిన వారందఱు వేచియుండవలసినదే !

అవ్విధముగ వారా యేటవాలును దాటుచుండిరి గాని యేలాంగో యొక్క పేర్వామాత్రము వెనుకఁ బడెను. ఎంత యత్నించినను నాతఁ డొక యంగుళమైనఁ గదలిపోలేకుండెను. ఆతని బాధను గమనించి కాంబోలు ఫ్లాన్లెక్స్ వైలీ యాలస్యముసేయక నాపేర్వా మోయుభారముఁ దన భుజములపై నిడికొని పురోగమించెను. మధ్యాహ్నము రెండుగంటలకు వారు సౌత్ కాల్ పై నడుగుపెట్టిరి. ప్రయాణాయాసము, స్వల్పాహార జనిత బాధయు, దుస్సహము లయ్యెను. అందుచే నాలస్యముసేయక వస్తువుల నచటఁబెట్టి సప్తమ శిబిరమునకు మఱలిరి. ఆరోహణ మెంతటి కష్టసాధ్యమో, యవరోహణయు నంతటి కష్ట సాధ్యముగనే యుండెను. మందగమనమున రాత్రి యేఁడు గంటలకు వారెల్ల సప్తమ శిబిరమునకు వచ్చేసిరి. వారిశరీరములు తూలి పడుచుండెను. గతరాత్రి నిద్రాహార విశ్రాంతి వారికి సరిగ లేదు. నేఁ డనిననో వాయవ్యదిశనుండి ఝంఝామారుతము వీచుచుండెను. గుడారము లా పవనవేగమునకు తాళలేక నూగిసలాడుచు నెపు డేవేళ గాలిలోని కెగిరి పోవునో యను భీతిగొల్పుచుండెను. గుడారముల క్రిందఁ దలలు దాచుకొనువారి భయాందోళనలు వర్ణనాతీతములు. దాన గుడారము లెగిరిపోకుండ వాని ప్రక్కల నానికొని గట్టిగ నొక్కి పట్టి యుండిరి. ఆరాత్రి యాబాధ ననుభవించుటకు భీతిలి 'దావా తాండూప్', చతుర్థశిబిర సుఖనిద్రాభిలాష జనింప నా ప్రళయమున కెదురేఁగ సాహసించెను. ఆతని ననుగమించుటకు పేర్వాలు మఱి కొందఱు నడుములు గట్టిరి. పెనుగాలికి వెనువిడు ( ప్రాణములఁ

బిడికిళులం బెట్టికొని, యూపిరి బిగఁబెట్టి మెల్లగఁ జతుర్థశిబిరమును జేరఁ గొనిరి.

ఇఁక టెన్జింగ్ హిల్లరీల శక్తిసామర్థ్యము లనన్యసామాన్యములు. పర్వతము లనినను, దదారోహణ మనినను, వారికి మంచినీళ్లప్రాయము. పర్వతారోహణకాలములోనే వారి సహజ లక్షణములు ప్రకటిత మగుచుండును. పర్వతముల నెక్కుచో గాలిలోఁ దేలిపోవు టనుభవింతు రేమో యనునంత మోదానుభవము వారి నేత్రాంచలముల ద్యోతక మగుచుండును. మే యిరువది రెండవనాఁటి మధ్యాహ్నము చతుర్థ శిబిరములో బయలుదేఱి, నేఁటి యుదయము సౌత్ కాల్ వఱకు జెఱిగిపోయిన మార్గమును నరిదిద్దుచుఁ బోయి తిరిగి మాఁపటి వేళకు నా శిబిరముఁ జేరిరి. అనఁగా ముప్పది యాఱు గంటలలో సుమారిరువది యొక్క-వేయి యడుగుల నుండి యిరువది యాఱువేల యడుగుల యెత్తు కెక్కి- దిగివచ్చిరి!

శిఖరాగ్రారోహణ కవసర సన్నాహములు సిద్ధమైనవి. శిఖర సార్వభౌముఁడు శిరము వంచు సమయ మాసన్నమైనది!

అది మే నెల యిరువది మూఁడవ రోజు. ఆనాఁటి సాయంకాలమే శిఖరాగ్రారోహణార్థమై ప్రథమ దళము బయలుదేఱనున్నది. చతుర్థ శిబిరములో బయలుదేఱి టామ్, ఇవాన్స్, సర్ జాన్ హంట్ లు ముగ్వు రున్నత శిఖరారోహణార్థమై ప్రత్యేకింపఁబడిన షేర్పా లిరువుర వెంటఁదీసికొని యిరువది రెండవనాఁటి యస్తమయ సమయమునఁ బంచమ శిబిరమును బ్రవేశించిరి. వాయవ్య పవనము లపు డతివేగముగ వీచుచుఁ, బ్రతిక్షణ ప్రవర్ధమానము లగుచుండెను. ఆ వేగతీవ్రతను బొడిమంచు నలువైపుల నూర్ధ్వతలమున కెగురుచుండెను శీత బాధ క్రమక్రమముగ దుర్భరమగుచుండెను.

ఇరువది మూఁడవనాఁటి యుదయ మెనిమిదన్నర గంటలకు దానాంగ్యాల్, ఆంగ్ షెన్సింగ్, అను షేర్పాలతో బహిర్వాహిక ప్రాణవాయు సాధన సహితుఁడై సర్ జాన్ హాంట్, లోట్సె శిఖర శిబిరములఁ గూర్చి పయన మయ్యెను. ఇప్పటికే పలువు రామార్గముఁ ద్రొక్కియుంటఁ గాలి యడుగులు మంచులో స్పష్టమైన యచ్చులుగ నేర్పడి యుండెను. దారి పొడుగున 'మలిలా' త్రాళ్లు గట్టఁబడి యున్నవి. వీని సాహాయ్యమున నారవ శిబిర స్థలమును వారు సులభ ముగఁ జేరిరి. పూర్వమీ శిబిరస్థలము నిరుపయోగముగ నెంచి జార్జిలో దానిని విసర్జించెను. సర్ జాన్ హాంట్ అచటఁ గూర్చుండి, విశ్రాంతిఁ గొంతఁగైకొని సప్తమ శిబిరమున కరుగ నుద్యుక్తుఁడగు చుండఁ బ్రథమ శిఖరాగ్రారోహక దళసభ్యులు, టాంబోర్డిలాన్, ఛార్లెస్ ఇవాన్సులు ఏతెంచిరి.

సప్తమ శిబిరము వఱకుఁగల మార్గము నిట్టనిడివిగ నుండెను. మంచుపైఁ దిన్నగఁ బ్రమాదకరమైన ప్రదేశముల దాటుచు వారు పురోగమింప సౌత్ కాల్ పర్యవేక్షకదళము వారి కెదురు వచ్చెను. వారితో వచ్చిన ఛార్లెస్ వైలీ, సర్ జాన్ హాంట్‌లఁ జూచి యుత్సాహ వచనములఁ బలికెను. ఆపలుకు లాలించి సర్ జాన్ హాంట్ సప్తమ శిబిరమున కేఁగెను. ఆమార్గము హిమాచ్ఛాదితమై యేటవాలుగ, నగమ్యముగ నుండెను. సప్తమ శిబిర పరిసర పర్వతశిఖరములఁ గూర్చి నాయకుఁడైన సర్ జాన్ హాంట్ ఇట్లు వర్ణించి యున్నాఁడు. "ఇంచు మించు నిట్రము దేలియుండు లోట్సె శిఖర ముఖ భాగమున సప్తమ శిబిరము స్థాపిత మయ్యెను. ఈస్థలము నింతకుమున్నే స్విస్ పర్వతా రోహకులు కనిపెట్టిరి. అట రెండు గుడారములకు మించిన స్థలమే లేదు. అయినను ప్రస్తుత మెనిమిది గుడారము లచట నిర్మింపఁ గలి

గిరి. ఆచటినుండి నూప్సేశిఖరశ్రేణిని నేను జూచితిని. ఏతచ్ఛిఖరాగ్రము కృపాణాగ్రమువలె నాశ్చర్యభయములఁ గూర్చుచుండెను. పూర్వము వాతావరణాభ్యాస కాలములో నూప్సె, లోట్సె, శిఖరముల సంధించు పర్వతశ్రేణి, సౌత్ కాల్ పర్వతము, ఎవరెస్ట్ శిఖరాగ్ర భాగములను, ట్యాంగ్ బోచ్ గ్రామపరిసరములనుండి మేము పరిశీలించితిమి. ప్రస్తుత మీ స్థలమునుండి ట్యాంగ్ బోచ్ పరిసరములఁ జూడఁ గోరితిని. కాని యా సౌందర్యము లెట దాగి యున్నవో!

పై దృశ్యము లన్నియు సప్తమ శిబిరస్థల దక్షిణాగ్రము నుండియే నేను పరిశీలించితిని. నేత్రపర్వము గొల్పు నీ దృశ్యములఁ జూచి, యానందించి, యుత్తరాగ్రమున కేఁగి, యెవరెస్ట్ శిఖర దృశ్యములఁ జూడఁ గోరితిని. నేఁ జూచిన దృశ్యము నేమని వర్ణింతును! పర్వతాగ్ర దృశ్యముఁ జూచి ముగ్ధుఁడనైతిని. ఆ పర్వతము నా కతి సమీపమున నున్నటు దోఁచెను. ఆ యున్నత ప్రాంతములలోఁ బవనము లతివేగముగ వీచుచుండెను. అట్టితఱి శిఖరారోహణ సాధ్యమా! ఆగ్నేయ పర్వతశ్రేణి పొడవున నీహారధూమము, శ్వేతాంబరము వలె నాచ్ఛాదించి యుండెను. ఎవరెస్ట్ శిఖర మతిసమీపమున నున్నట్లు సౌత్ కాల్ పర్వతము దీర్ఘదూరములో నున్నట్టు లుండెను. ఆ పర్వత లోక సుందర దృశ్యముల, నాఛాయాగ్రాహక యంత్రముతో టామ్, ఇవాన్స్ లేతెంచువఱకుఁ జిత్రించుచుంటిని. ఆదృశ్యములఁ జూచి నేను బరవశత్వము జెందుటయే గాక నవ నవోత్సాహవంతుఁడ నైతిని.'' ఇంతలో వారిరువు రచటి కేతెంచిరి.

ఆనాఁటి సాయంకాలమునఁ జతుర్థ శిబిరమునుండి నిస్తంత్రీ వార్తాప్రసరణము యథావిధిగఁ బునర్జీవింపఁ బడెను. దాఁదాపు వారము, పది దినములనుండి యీ యంత్రము తృప్తికరముగఁ బనిఁజే

యుటలేదు. ఇవిగాక యితర వస్తుపరికరముల నాఁటి సాయంకాలము నకు జార్జ్ బ్యాండ్ సప్తమశిబిరవాసుల కందఁజేసెను.

అది మే మాసములో నిరువదినాల్గవ ప్రాతఃకాలము. పర్వతా రోహకత్రయము సౌత్ కాల్ పర్వతమును గూర్చి పయనమయిరి. సర్ జాన్ హాంట్ యేలొకో నిర్వీర్యుఁ డయ్యెను; సమస్థలముపై నడువలేకుండెను. ఇఁక ముస్ముం దారోహణ మార్గము కష్టసాధ్య మైనదే! అట్లగుచో సర్ జాన్ హాంట్ పురోగమించు టెట్లు? శిఖ రాగ్రారోహణ యత్నములోఁ దన భాగము ముగిసి నట్లాతనికిఁ దోఁచెను. టాంబోర్డిలాన్ అతని ప్రాణవాయుసాధనమును సరిఁ జేయగా మఱల సర్ జాన్ హాంట్ పురోగమింపఁ గలిగెను. వారు ముప్పు రతి మందవేగముగ లోట్సె హిమానీనది పై భాగము వఱ కేఁగిరి. ఆవల ప్రబల మార్గావరోధములు రెండు గలవు. వాన నొకటి, యత్యున్నత హిమప్రపాతము. మఱియొకటి యాప్రపాతము నాని యుండు విస్తృత గంభీర బిలమార్గము. ఈ యవరోధద్వయము నెటులో సాధించిన యనంతరము మఱియొక విస్తృత బిలమార్గము వారి కడ్డుతగిలెను. మధ్యాహ్న మొంటిగంటకాలమున నీ బిలమును గూడ దాటిరి. అటనుండి పడమటిలోయ సన్నని కాలువవలె నగపడు చుండెను. ఖుంబూ హిమానీనది దీర్ఘదూర సంస్థిత మగుటచే నది యొక నల్లని యఖాతకూపము వలె నుండెను. ఆ కూపము నంతరిక్షము నుండి శ్వేతమేఘసమూహము లాచ్ఛాదించి యుండెను.

ఎవరెస్ట్ పశ్చిమశ్రేణిక్రింద మిన్నుముట్టుచు నాల్గవ శిబిరము గాన్పించుచుండెను. సాంద్రారణ్యాచ్ఛాదిత పర్వతములు న్యూప్సెశ్రేణి కావలఁ గాన్పించుచుండెను. నేత్రపర్వములౌ యీదృశ్యములఁ గనుఁ గొనుచుఁ బర్వతారోహకులు ముందుకు సాగిరి. ఇఁక పై వారు పర్వత

మున కడ్డముగా నడచిపోవలయును. హిమవృష్టిచేత మార్గ మేదియుఁ గాన వచ్చుటలేదు. మెత్తని క్రొత్తమంచులో వారి పాదములు దిగఁ బడిపోవుచుండెను. ఇట్లు పురోగమించుటచే వారు మిక్కిలి యలసటఁ జెందుచుండిరి. ఒకచో నిట్రముగను, వేఱొకచో సమతలముగను, మఱియొకచోఁ బల్లముగను, గొన్నిఁట సంకుచితముగను, మఱి గొన్నిఁట మిట్టపల్లములుగను, నాయూరోహణమార్గము రకరకము లుగ నుండెను. మంచులో మెట్లు త్రవ్వుచు టామ్, ఇవాన్స్ లిరువురు మార్గదర్శకులై పోవుచుండిరి. సర్ జాన్ హంట్ వారి వెనుక నుండెను. ఆతని వెనుక షేర్పాలు మిక్కిలి ప్రయాసపడుచు వచ్చుచుండిరి. వారి కపుడు నిమిష మొక యుగముగఁ దోఁచుచుండెను. నిమిషమున కొక పరి షేర్పాలలో నెవరో యొకరు విశ్రాంతిఁ గొన నాగుచుండిరి. చేతఁగల మంచుగొడ్డలిపై నొఱగి యుస్సురనుచు, మూల్గుచు, క్షణ మాగి, శరీరములో నేమూలనో యొదిగియున్న శక్తి పైకిఁ జేదికొని మఱల రెండు మూఁడడుగులు నడచు షేర్పాల వేదనాయాసభార ములు వర్ణనాతీతములు. వారి కష్టమునకు వారుగడించు కూలి డబ్బు హాస్తిమశకాంతర మనిన విస్మయ మేల? నిజమునకు వారిదే విస్వార్థ సేవ. అట్టి మహత్తర భావమే వారి హృదయముల రేకెత్తనిచో నీయాత్ర యసంభవమే కదా! వాస్తవమున కీ యాత్రలో నొక్కొక్క షేర్పా యపరిమిత వస్తుభారమును మూపున నిడికొని యెన్ని వేల యడుగు లెక్కి దిగి వచ్చెనో! కొంత దూరమేఁగి కొంత విశ్రాంతిఁ గైకొని మఱల సౌత్ కాల్ త్రోవఁబట్టి సాయంకాలము నాల్గుగంట లకు వారు సౌత్ కాల్ సమీపించిరి. అటనుండి మూఁడువేల యడుగుల యెత్తైన యెవరెస్ట్ శిఖరాగ్ర మహోన్నత స్వరూపము వారి కగపడెను. ఎక్కడో! యాకాశ గర్భాంతరములఁ జొచ్చి కొని యున్న యా శ్వేత శిఖరముఁ జూడ గుండెలు జల్లుమనుచున్న వే!

ఈబ్రహ్మాండమైన శిఖరమునా యధిరోహించుట! ఇయ్యది మానవ సాధ్యమే! ఇట్టి విస్మయ భావతరంగములు వారి హృదయాంబుధిలో నుదయింపక పోలేదు! ఇఁక సౌత్ కాల్ ఏపాటిదో యొకింత తెలిసి కొనవలయును. "మాపాదముల చెంతఁగల సౌత్ కాల్పై దృష్టిఁ బ్రసరింపఁ దలఁపని తలంపుగ నిర్మానుష్య నిర్జీవ విశాలస్థల మొకటి మాకంటఁబడెను. ఏవైపుఁ జూచిన నది నాల్గువందల గజముల వెడల్పుగల సువిశాల పీఠభూమి. దాని యుత్తర దక్షిణపుటంచుల నానికొని, ఎవరెస్ట్, లోట్సె శిఖర పార్శ్వములు లున్నవి. అవియుఁ బడమటిలోయలో దిగి యున్నవి. ఈ సువిశాల పీఠభూమి యనంత ఖ్యాక శిలా సంఘాత నీల నీహార నిబిడీ కృతమై యున్నది. పీఠభూమి యంచుల మంచుపేరికొని యుండెను. అయ్యది భీకర ప్రచండ పవన వేగాతిశయ సమన్విత ప్రాంతము. సర్వకాల సర్వావస్థలయందా పీఠభూమిపై భయంకరానిలములు దాడిసేయు చుండును" సౌత్ కాల్ పర్వతము లోట్సెశిఖరము కన్న నెత్తు తక్కువలో నుండును. అందుచే లోట్సె శిఖర పైభాగములనుండి యధోభాగమున కవరోహించి దానిఁ జేరవలయును. భాస్కరోదయాదిగ నత్యధిక ప్రయాసలఁ బర్వతారోహణ చేసిన వారి కిపు డధోముఖ ప్రయాణ మొకింత విస్మయ కారణ మయ్యెను. వారా విధమున సౌత్ కాల్ పీఠభూమి నడుగువెట్టి కొంత దూర మరిగిన పిమ్మట స్విస్ దళ శిబిర శిథిలములు మఱల నటఁ గానవచ్చెను. ఆ పీఠభూమి నేకచ్ఛత్రాధిపత్యముగఁ బరిపాలించు ప్రళయ మారుతాఘాతమున కెదురొడ్డి యున్న యినుప చట్రముఁ, ద్రాళ్ళుఁ, జినిగి చివికి, గాలి తాకిడి నటునిటుఁ జీరాడు కాన్వాస్ బట్టలు, ప్రాణవాయు సాధనములు, వారి కగపడిన శిథిలావశేషములు. వీనన్నిఁటినిఁ బరిశీలించుచుండఁ దపనుఁ డస్తాంబోధిఁ గ్రుంకు లిడ నరుగనుండ వారు గమనించిరి. ఇఁక నాలస్యమున

నమృతము విషమగును. శిబిరనిర్మాణము వెనుకఁబడుటయేగాక దుర్భర శైత్య మారంభించును. అప్పటికే వా రెన్ని వస్త్ర విశేషాంతరముల ధరించినను, జలిబాధ వారినిఁ బట్టి వెలార్చుచునే యున్నది. కాల హరణము గష్ట నష్ట హేతు వగును గాన వారు తత్క్షణమే శిబిరనిర్మాణోద్యుక్తులైరి.

కాని, కని విని యెఱుఁగని ప్రళయ ప్రచండమారుతము వారి యమానుష ప్రయత్నములకు విఘాతమొనర్ప సమకట్టెను. తదాఘాతములకోర్చి శిబిర నిర్మాణము సేయ వారు శక్తిహీనులు. ఉదయాస్తమాన పర్యంతముఁ బయనించుట వా రత్యధిక మార్గాయాసముఁ జెందిరి. గుడారములు నిర్మింప వస్తువులఁ బట్టుదురేకాని వాయువేగమున కవి చేతులు వీడి, యాడి యెగిరిపోవుచుండెను. ఎగిరిపోయిన వస్తువులఁబట్టి తెచ్చుటకై వారు గొంత దూరమేఁగుచు, నట నట, రాళ్ళఁ దట్టుకొని పడుచు, లేచుచుఁ, బెక్కు చిక్కుల పాలగుచుఁ, జిట్టచివరకు రెండు నిముసములలో నిర్మింపఁగల గుడారము నరువది నిముసములలో నిర్మింపఁ గలిగిరి. ఇంతలో నిరువురు షేర్పా లచటికేతేర వారి సాహాయ్యముతో మఱియొక గుడారమును నిర్మించిరి. ఒకవైపాఁకలి దప్పులు ; మఱొకవైపుఁ బయనపు బడలిక నొప్పులు, వారిని జెండాడుచున్నవి. ఏక్షణమున గాఢ సుషుప్తిపరిష్వంగ సౌఖ్యానుభూతి గలుగునా యను నుత్కంఠ బలీయమగుట నత్యవసరముగ నాహార పానీయముల సేవించి పడక సంచులఁ బ్రవేశించిరి. గుడారముల వెలుపల మహాప్రళయ మాసన్నమైనదా యను భ్రాంతి మొరలువెట్టి తిన్నగఁ దొలఁగుచున్నది.

ఆ ప్రళయ చిహ్నములఁ జూచి పర్వతారోహకులు మఱునాఁడుదయమునఁ బురోగమించుట కల్ల యనుకొనిరి. నాఁటిరాత్రి ప్రకృతి

శక్తుల విజృంభణ మహాదారుణముగ నున్నప్పటికిని. వారు సుఖనిద్రను జెందిరి. మఱునాఁడు ; సూర్యోదయ మైనది ; నిన్నటి పవనములు లేవు. చల్లని గాలి వీచుచుండెను. ఆకసము పరిశుభ్రముగ నుండెను. ఆరోహణ ప్రారంభమున కిదియే యనుకూల కాలము. కాని గత రాత్రి పర్వతారోహకుల నిర్ణయము వేఱొకవిధముగ నుండుట కతనఁ బర్వతారోహణము నాపి యాదినమంతయు వారు పరిపూర్ణ విశ్రాంతి ననుభవించిరి :



# 12

## ఆరోహణము 1

ప్రతికూల వాతావరణ ఫలితముగ మేనెల యిరువదైదవనాఁడు శిఖరాగ్రారోహణకుఁ బ్రారంభోత్సవము జఱుగలేదు. దానివలని కష్ట నష్టము లెట్టివైనను బర్వతారోహకుల పట్టుదల . . . పటుతరమయ్యెను. నిన్నటి పరిపూర్ణవిశ్రాంతి వారి శారీరక, మానసిక పరిస్థితుల కుజ్జ్వల నూత్నోత్సాహ తేజముల నాపాదించెను. దానఁజేసి యిరువదారవ తేదీ నాఁడు శిఖరాగ్రము గూర్చి పురోగమించుటకు వారు సంసిద్ధులైరి. సౌత్ కాల్ శిబిరములో నుండు పేర్వాద్వయమున ఆంగ్ టెన్సింగ్ అస్వస్థుఁడగుట సకలవస్తు పరికరములఁ బైకి మోచికొని వెడలు భారము దానాంగ్యాల్, సర్ జాన్ హాంట్ లపైఁ బడెను. వారు ప్రాణవాయు సాధనములు, చిన్న గుడారము, నాహారపదార్థములు దీపములు మొదలైన సామగ్రిని సుమా రిరువదేనిమిదివేల యడుగు లపైఁ జిన్ని శిబిరము నిర్మించి, యందుంచి రావలెను. మువ్వాగు మోయఁదగిన భార మిరువురపైఁ బడిన వారి కెట్టి శ్రమయో వారికే తెలియనగును. హఠాజ్జనిత ప్రతికూలసంఘటన కతన నిరుత్సాహ మొందక నుదయ మేడుగంటలకు వారు బయలుదేఱిరి. గాలి బహుతీవ్రముగ వారి కెదురు వీచుచుండెను. వాస్తవములో టాం, బోర్డిలాన్, చార్లెస్ ఇవాన్స్ లగ్రగాములై యుండవలయును. కాని ప్రాణవాయు సాధనములు సెడుటచే వారి రాక యాలస్యమయ్యెను. దానాంగ్యాల్, సర్ జాన్ హాంట్ నెమ్మదిగ ముందుకు సాగిపోవు చుండిరి. త్రోవలో మంచుమయమైన యేటవాలు ప్రదేశము లుండెను. ఒక్కొక్కచోట మంచులోఁ జిన్న రాతిపెచ్చులు దిగబడి యుండెను.

పోను పోను హిమము శిలాతుల్యకర్కశమై యుండెను. వారి గమన వేగము గూడ శీఘ్రగతిని క్షీణదశకు రాఁ దొడఁగెను. వారట్లు గొంత దూర మేఁగినపిమ్మట దాదాపు తొమ్మిది గంట లపుడు టాం ఇవాన్స్లు పర్వతారోహణ మారంభించిరి. వా రిరువు రతిశీఘ్రగమనమున నధిరోహించుచు విశ్రాంతికై యొకచోఁ గూర్చొనియున్న సర్ జాన్ హంట్ దళము నతిక్రమించి పోయిరి. అట్లగుట సుగమ మార్గస్థాపనా కార్యము ప్రాగ్భాగమునఁ బయనించు వారిదే. టాం, ఇవాన్సులు సుగమ మార్గాన్వేషణలో మునిఁగిపోవుట వారి గమనవేగము క్షీణించుచున్నది. ఇఁక సర్ జాన్ హంట్, దానాంగ్యాల్ తమ బాధ్యతల నెట్లు నిర్వహించిరో, చూతము. అడుగు దీసి యడుగు పెట్టుటకు వా రెంతయో ప్రయాస పడుచుండిరి.

సాంకల్పిక కార్య బలోత్సాహ మనస్కులు వారు. అట్టివారి దీక్షాపటుత్వమున కన్యథాత్వమా! యువకులయ్యు వృద్ధులవలె నడుములు వంచి, మంచుగొడ్డలి సాయమున నుచ్ఛ్వాస నిశ్వాసముల నతి కష్టముగఁ దీసికొనుచుఁ జిన్నగా వా రిరువురు పైకి పోవుచుండిరి. వారి బాధ వర్ణింప శక్యముగానిది. పురోభాగమునఁ బయనించు శిఖరాగ్రారోహకుల బాటలో నడచుచు, నడుగడుగునకు నిట్రముగఁ దేలు పర్వతోపరిభాగము నధిరోహించుచుండిరి. ఈరీతిని వా రేగుచుండ మార్గమధ్యమున నొకచో సుమారిరువదేడువేల రెండువందల యడుగుల యెత్తులో సంవత్సరము క్రితము రేమండ్ లెప్జింగులు నిర్మించుకొనిన శిథిలశిబిరము గాంచిరి. సౌత్ కాల్ శిబిర శిథిలములవలెనే యిదియు సతత పవనచలిత జీర్ణవస్త్రసహితము. దుర్భర మార్గాయాస ప్రపీడితులైనవా రిది చూడఁగనే పెన్నిధినిఁగాంచు నిఱుపేద గతిని సత్వర మా శిబిరస్థలము జేరి

సుఖాసీనులైరి. సర్ జాన్‌హంట్ ఊపిరికొఱకు బెంబేల లాడు చుండెను. "వాయూపిరితిత్తులా క్షణములోఁ బగిలి, తుత్తునియలై పోవునేమో యనుకొంటిని." ఈమాటలలో నాతని బాధ యెట్టిదో స్పష్టముగఁ జెప్పఁగలుగుచున్నాఁడు. కాని యీ యవస్థ చిరాయువు గాదు! ఒకింత విశ్రాంతి గొనిన యనంతర మాతఁడు నలువైపులఁ బరిశీలించి ఫలితముల నిట్లు వర్ణించియున్నాఁడు. "మేమిపుడు భూలోక సౌధాగ్రముపై నున్నాము. అసంఖ్యాక మేఘసమూహము లతిశీఘ్ర వేగముగ మమ్మావరించుట కెగసి వచ్చుచుండెను. వాయవ్యపవనములు ప్రచండవేగమున వీచుచుండ, నటనుండి నేను నలువైపులఁ బరికించి చూచితిని. విశాలమేఘసాగరమునఁ దేలాడుచున్నట్లు కాంచనజంఘాశిఖర మొప్పుచుండెను. తీవ్రముగ మారుతములు వీచుచుండినను మావిశ్రమస్థానము పెనుగాలి బాధలనుండి మమ్ముఁ గాపాడుచుండెను. అంతట నేను సౌత్ కాల్ పీఠభూమిపై దృష్టిఁ బ్రసరించితిని. అది సుమారు పదునాల్గువందల యడుగుల దిగువనున్నది. దాని నానికొని లోట్స్ శిఖర ముఖభాగము, నష్టమ శిబిరము, నిమ్నస్థలులు, సౌత్ కాల్ శిబిరమును, సూక్ష్మరూపమున గోచరమగుచున్నవి. ఈదృశ్యమును జూచి నేనెంతయో యానంద రసానుభూతి ననుభవించితిని. ఇంతపై కెటుల వచ్చితిమా యను భావమాశ్చర్యరసనిష్యందపువెల్ల నొప్పినది. ఎవరెస్ట్ శిఖరము వైపు చూడ నది మంచు తెఱల మాటున మసకగా కాన్పించుచుండెను. అప్పుడే హిమవృష్టి వాయువేగము లతిశయించుచుండెను. టాం ఇవాన్స్ లతి రయమ్మునఁ బర్వతముపై కురుకుచుండిరి. "సర్ జాన్ హంట్ వలెనే దానాంగ్యాల్ సైతము పురోగమనాశక్తుఁ డయ్యెను. వజ్రకాయుఁడైనప్పటికిని; మహాయాన పీడిత గాత్రుఁడై చిక్కెను. సాగుట కే మాత్రము శక్తుఁడుగాకయుండెను. ఒకవేళ నీ స్వల్పవిశ్రాంతి

వారి శక్తులఁ బునరుజ్జీవింపఁ జేసినను వారు బహుదూర మరుగఁ జాలరు. అయినను మఱలఁ బ్రయాణము సాగించిరి. త్రోవపొడుగున రాతిపలక లొక దానిపై నొకటి పేర్చినట్లుండెను. అచ్చటచ్చట మంచు పొడి వానిపై రాలి యుండెను. ఆత్రోవనే వా రిరువది నిముసములసేపు నడచివెళ్ళిరి. బహుశః స్విస్ శిబిరమునుండి నూట యేఁబది యడుగుల దూరము వారు నడచియుందురు. దానాం గ్యాల్ శక్తి హద్దు ముట్టినది. ఇఁక నొక్కయంగుళమేని నతఁ డెక్కలేడు. కావున నాలసింపక వారు శిబిరనిర్మాణముఁ బ్రారం భించిరి. ఆస్థల మిరువదేడువేల మూఁడువందల యేఁబది యడుగుల యెత్తున నున్నది. అచ్చట శిబిరము సన్నివేశపఱచి, వస్తుపరికరముల నం దమర్చి మధ్యాహ్నము పదునొకండున్నర గంటలవఱకు విశ్రాంతిఁ గైకొనిన పిమ్మట వారు సౌత్ కాల్ శిబిరమునకు దిరోగమునైరి. మార్గమధ్యమున లోట్సె శిఖరము నాచ్ఛాదించిన మంచుపై నల్లని చుక్కలు గొన్ని గానవచ్చెను. అవి కదలుచున్న వే! ఆ చలిత బిందు వులఁ జూచుటతోడనే ద్వితీయ శిఖరాగ్రారోహక దళము సౌత్ కాల్ శిఖరమునకు వచ్చుచున్నదని వారు గ్రహించి సంతసించిరి. హంట్, దానాంగ్యాల్, త్రోవలో నచ్చటచ్చట నాయాస మతిశయింప, నెమ్మ దిగ విశ్రాంతిఁ గైకొనుచు సౌత్ కాల్ శిబిరమును సమీపించిరి. అంత నొకచో నశక్తుఁడైన సర్ జాన్‌హంట్ నడువలేక తటాలునఁ గ్రిందఁ గూలెను. తత్క్షణమే, యచటి కేతెంచిన బెన్టింగ్ హాల్లరీ లాతని గుడారములోనికిఁ దీసికొనివచ్చి విశ్రమింపజేసిరి.

శిఖరాగ్రారోహణారంభకాల పర్యంతము టాంబోర్డిలాన్, ఛార్లెస్ ఇవాన్సులు ద్విగుణీకృతోత్సాహమున శరవేగమునఁ బర్వత మారోహించుచుండిరి. వారి గమనవేగమును జూచి సర్ జాన్‌హంట్

ఆశ్చర్యభరితుఁ డయ్యెను. ఇంచుమించు గంటన్నర కాలములో వారు పదుమూడువందల యడుగు లధిరోహించిరి. సాధారణముగ నొక నాఁడే యంత యెత్తేగినచోఁ బర్వతారోహకులలో నట్టివారు ప్రజ్ఞావంతులుగఁ బరిగణింపఁబడుదురు. అట్టి పరిగణన స్వాల్పౌన్నత్యము లందే యుండిన, నిఁక నిరువదెనిమిది వేల యడుగులపై వా రొనరించిన సాహసకార్య మెంతటి ప్రశంసార్హమో ?

ద్వితీయ శిఖరాగ్రారోహక దళముతో సౌత్ కాల్‌పై సన్నివేశి తాష్టమన శిబిరమున కేతెంచిన జార్జ్‌లో, సర్ జాన్ హంట్, ' బ్లిస్టర్ ' గుడారములో విశ్రాంతిఁ గొనుచుండ వెలుపలికిఁ జూచి సమధికోత్సాహ సంభరితాంతరంగుఁడై 'వారు పైకి వెళ్ళిరి' అని పెద్దపెట్టున నొక కేకఁబెట్టెను. నిజమున కిదెంత యుత్సాహకరమైన వార్త ! అష్టమ శిబిరవాసుల నాడీనివహముల విద్యుచ్ఛక్తి మనోవేగమునఁ బ్రవేశించెను. వారి తనువులెల్ల, నాపాదమస్తకములుగఁ, బులకపటలిచే నిబిడీకృతమైనవి. అందఱు గంపితగాత్రులైరి. సర్ జాన్ హంట్ ఆనందమునకు మేరయున్నదా! ఎవరిముఖపద్మములఁ జూచినను, నానందరేఖలు పొడముచుండెను. ఎవరెస్టును జయించినారని షేర్పాలు సైత మనిర్వాచనీయానంద రసోద్రిక్తులైరి. ఆనాఁ డుదయమునుండి లోట్సె శిఖర మధిరోహించుచు, టాం, ఇవాన్సుల పురోగమనము నాషేర్పా లత్యంతానురక్తిఁ బరిశీలించుచుండిరి. అట్టివారికీ వార్త యెంతటి శ్రవణానందమో ! శిఖరాగ్రము పైకి వడి వడిగ నడిచి పోవు టాం, ఇవాన్సులు, ఎవరెస్ట్ శిఖరము మేఘాచ్ఛన్న మగుటచే మధ్యాహ్న మొంటిగంట వఱకు దానిఁ గనజాలరైరి. అంతటఁ జూచుచుండఁగనే మేఘచయము పైతొలగెను. శిఖరాగ్రము నధిరోహించు నప్పురుషద్వయము, దక్షిణ శృంగా

గ్రమును నిర్మలముగఁ గాన్పించుచుండెను. వారి యెదుట నిట్ట నిడివైన శిఖర పార్శ్వ మున్నది. వీరు చూచుచుండగనే యా పురుష ద్వయము తిన్నగ నాశిఖర పార్శ్వాగ్రము నెక్కెను. మఱల వారి జాడ లెవ్వియుఁ గానరాలేదు. మఱియొక మేఘసమూహ మావర్వతమును దనలో దాచికొనెను.

ఇవన్నియు గమనించుచున్న యష్టమ శిబిరవాసు లాందోళనలో మునిఁగి తేలుచుండిరి. పర్వత మధిరోహించు పురుషద్వయ సందర్శనమునకై చూపులు శిఖరాగ్రముపై నిగిడ్చి నిరీక్షించుచుండిరి.

ఇఁక సరిగా నంత యెత్తునను శిఖరాగ్రము గలదు. దైవ మనుకూలించిన, నింతవఱ కందరాని పండైన శిఖరాగ్రము వారి భద్రపీఠముగాదే! ఆనాఁటి వాతావరణ మనుకూలముగ లేదు. అయినను వారు దృఢచిత్తులై, యచంచల దీక్షా విశ్వాసములతోఁ బర్వత మధిరోహించుచుండిరి. సుమా రిరువదేడువేల యేనుబదడుగులపై వారి గమనవేగ మొకింత కుంటుపడ సాగెను. త్రోవలోఁ గల రాతి పలకల మీఁద వాలిన మంచుపైఁ బాద మూఁదినఁ గొలదిగ జారుచుండెను. ఆకారణమున వారు మిక్కిలి జాగరూకతతో నధిరోహించుచుండిరి. వా రట్లు శ్రమకోర్చి, పురోగమించి, యొకచో నొక మంచుగోడను సమీపించిరి. 1952 సంవత్సరములో స్విస్ యాత్రికులు ఎవరెస్టుపై దాడి వెడలినపు డా యాత్రిక దళ సభ్యులైన రేమండ్ లెన్జింగ్‌లు వసంతర్తు ప్రయత్నమున నీమంచుగోడ పజ్జనే యంతిమ శిబిరము నిర్మించిరని లెన్జింగ్ చెప్పెను. ప్రస్తుత మాస్థలముననే మంచు వాలుచుండెను. వాలిన మంచును వాయవ్య పవనము లూడ్చికొని పోవుచుండెను. మేఘములు సైన్య చయముల వలె నలువైపుల

నుండి వారిపై నలమికొనుచుండెను. ఇంతలో వారి ప్రాణవాయు సాధనములు వారి వారి విధ్యుక్త ధర్మముల జయప్రదముగ నిర్వహించు వఱకుపయోగ పడునా యను శంక వారిని గలవఱపెట్టెను; గాని యెటులో ధైర్యము వహించి పురోగమించి తిన్నగా దక్షిణ శృంగమును సమీపించిరి. త్రోవలో వాలిన మంచు ప్రమాదకరముగ నుండుట దానిపై నడక శ్రేయస్కరముగాదని, టాంబోర్డిలాన్ భావించెను. అందుచేఁ ద్రోవమార్చి యడ్డముగ నడువ మొదలిడిరి. ఈ నూతన మార్గము గూడ నాపజ్జనక మైనదేగాని వారి ధైర్యమే మఱి నాల్గు వందల యడుగుల పైకి వారినిఁ గొనిపోఁ గల్గినది. ఛార్లెస్ ఇవాన్స్, ఊపిరిఁ గొనుటలోఁ గొంత శ్రమించుచున్నను, బట్టు వదల లేదు. వా రట్లు మధ్యాహ్న మొంటిగంట వఱకుఁ బైకిఁ బోవుచుండ బునరాలోచనము లేకయే వారికాళ్ళు వారిని ఎవరెస్ట్ దక్షిణాగ్రము పైకిఁ జేర్చినవి. అది యిరువదెనిమిదివేల యేడువందల యడుగుల యెత్తును మించియున్నది. ఎవరెస్ట్ శిఖరారోహణ చరిత్రలో నింత వఱకు టాం, ఇవాన్సులు దప్ప, మఱియొక రంత యెత్తెక్కలేదు. వారే యిపుడు ప్రపంచమున నత్యున్నత పీఠస్థలముపై నిలిచి యున్న మానవులు!

ఎవరెస్ట్ శిఖరాగ్ర మింక మూడువందల యడుగుల నున్నది. దానిచుట్టు సంగరక్షకుల వలె మేఘము లావరించి పరిసర దృశ్యముల మఱుగుపఱచు చుండెను. కాని శిఖరాగ్రము నిర్మలాకృతిఁ దాల్చి యుండెను. శిఖరాగ్రము నిట్టనిడివిగ నుండెను. దాని కుడి యెడమల బ్రహ్మాండమైన భీతిగొల్పు ప్రపాతములు దాదా పెనిమిదివేల యడుగుల లోతుకు దిగిపోయినవి. ఆశిఖరాగ్రమునంటి గాలి లోనికి విస్తరించిన భయాభీలపు మంచుపలకలు వారికిఁ గాన్పించెను. "ఇవన్నియు

శిఖరాగ్రముఁ జేరుటకు మున్ను దాటవలెను. ఏ కొద్దిప్రమాదము వాటిలినను దుర్మరణము తథ్యము."

ప్రస్తుతకర్తవ్యము ? పురోగమనమా ? తిరోగమనమా ? క్షేమంకర కర్తవ్యాంశమేది ? ప్రాణములపై నాశవీడి విజయకాంక్షితులై ప్రమాదముల కెదురేఁగుచుఁ బురోగమించినచో ననేక ప్రఖ్యాత పర్వతారోహక చిరకాల వాంఛిత విజయలక్ష్మి కరతలామలక మగును. ఆచంద్ర తారార్క జగద్విఖ్యాతకీర్తి తమ కొంగు బంగార మగును. ఆధునిక మానవజీవిత పరమలక్ష్యములలో నొక దానిని సాధించిన వా రగుదురు. పరమోన్నత మహీధరాగ్ర సింహాసనాసీను లగుదురు. అట్టి యదృష్ట విశేషము లభించుట కిది యొక యమూల్య తరుణము, కాని యంతటి గొప్పయవకాశమును జేతులార జారవిడుచు టెట్లు ? ఈ సమస్యలతో వారు డోలాయమాన మానసు లగుచుండిరి. శిఖరాగ్రము నెక్కి తిరిగివచ్చు నంతవఱకు వాతావరణము, ప్రాణవాయుశక్తి యనుకూలించునో, లేదో, యను సమస్య యొకటి. ఈ కొండ నెక్కు పని యెంత కాలము పట్టునో, యూహించుట కష్టము. ఛార్లెస్ ఇవాన్స్, దీనికంతయు మొత్తమైదు గంటల కాలము పరిపోవునని యూహించెను. అట్లగుచో సాయంత్ర మూరు గంటలకు వారున్న దక్షిణ శృంగాగ్రమును జేరఁగలరు. కాని, యింత కాలము ప్రాణవాయు సాధనము లుపయోగపడవు. అవలే యవి వక్రముముగఁ బనిసేయుట లేదు. ఇఁక నీ దీర్ఘకాలములో నవి పనిసేయు టెపుడెచట మానునో, ప్రమాద మపుడే, యచటే, కలుగును. ఏలయన నాయెత్తునఁ బ్రాణవాయువు లేమి, బ్రదుకు దుర్లభము. అది యట్లుండ దక్షిణశృంగాగ్రమును సాయంకాల మూరు గంటలకు చేరినను ప్రమాదరహిత స్థల మింకను మూడువేల యడుగులు

దిగిపోయినఁగాని చేరఁజాలరు. అనఁగా నంధకారములోఁ బ్రబలావరోధ సమ్మిళిత మార్గముపై వారు నడచి రావలయును. వివేకవంతు లెవరేని నీ యసదృశ కార్యాచరణకుఁ గడంగెదరే!

ఇఁక టామ్ ఇవాన్సుల స్థితిగతు లెట్టివో విచారింతము. ఛార్లెస్ ఇవాన్సు, ప్రాణవాయుసాధన మింకను సక్రమ ధోరణిలో లేదు. అతఁడుపయోగించుచున్న యంతర్వ్యాహిక ప్రాణవాయువు సాధనమును, బాహిర్వ్యాహిక సాధనముగ బోర్డిలాన్ మార్చెనుగాని నిరుపయోగమయ్యెను. పైపెచ్చు వారు చాల బడలియుండిరి. ఒకవేళ మూర్ఖచిత్తులై ముందు కేఁగినను బహుశీఘ్రముగనే మఱలివచ్చి యుండెడివారు. అత్యున్నత శ్రేణికిఁ జెందిన పర్వతారోహకులైనను టామ్ ఇవాన్సులు పురోగమింపఁజాలరనుట వారి శారీరకస్థితి యెట్లుండి యుండవలయునో ప్రాజ్ఞు లూహించుకొనఁగలరు. ఇవన్నియు బాగుగ నాలోచించి టామ్ ఇవాన్సు లిరువురు విధివశమున శిథిల మనోరథసిద్ధులై, వికలమనస్కులై శిబిరోన్ముఖులైరి. దారిలోఁ బలుమార్లు బడలికచేఁ గాలు జారుచుండఁ దిన్నగా సాయంకాలము మూఁడున్నర గంటలకు వారు తొమ్మిదవ శిబిరముఁ జేరిరి. అటు పిమ్మట నీఁరుకై మిక్కిలి యేటవాలుగ నున్న వల్లమొకటి వారి నాటంకపఱచెను. ఆవల్లమును దాటుచుండ, ఛార్లెస్ ఇవాన్సు హఠాత్తుగఁ గాలుజారి, యా వల్లపుఁగొట్టకొనకు దొరలిపోయెను. అతని రక్షించు నుద్దేశముతో టాం తన మంచుగొడ్డలిని మంచులోఁ గ్రుచ్చి త్రాటిని దానికిఁ జుట్టి, నొక్కిపట్టుకొని యుండెను. కాని ఛార్లెస్ ఇవాన్సు క్రిందికి దొరలిన వేగముచే నామంచుగొడ్డలి తటాలున మంచునుండి పెళ్ళగించికొని యూడిపడెను. దానిపై భారమును మోపికొనియున్న టామ్ బోర్డిలాన్ సైతము గ్రిందికి దొరలెను. ఇటు లిద్దఱును దొరలి దొరలి

కొంతసేపటికి నొకచోట నాగిపోయిరి. అదృష్టవశమున వారెట్టి ప్రమాదమును బొందరైరి. కొంతసే పలసటఁ దీర్చికొని మఱల వారిరువురు సౌత్ కాల్ శిఖరమునకు బయలుదేరి సాయంకాలమునకు బర్వతారోహక వేషములతో బరికరములు మోసికొని నీహారసిక్తముఖములతో 'గ్రహేతరవాసుల' వలె సౌత్ కాల్ శిబిరమునకు విచ్చేసిరి.

ఎవరెస్ట్ శిఖరాగ్రము టామ్ ఇవాన్స్లచే జారిపోయినను వారి యత్యద్భుత సాహసక్రియా ఫలితములు ముమ్ముందు మిక్కిలి యుపయోగకరము లయ్యెను. ఎవరెస్ట్ దక్షిణ శృంగాగ్రమున నధిరోహించి దాని కావల నున్న ముఖ్యశిఖర నైసర్గిక పరిస్థితులఁ గూర్చి పలు విషయముల వారు టెన్ జింగ్ హిల్లరీలకు సవిస్తరముగఁ దెలియఁ బఱచిరి. అదియుఁగాక వా రధిరోహించినంతవఱకుఁ గల పర్వతారోహణాంతర్గత స్వానుభవ విశేషములను గూడ టెన్ జింగ్ హిల్లరీల కందఁజేసిరి. ఈ యనుభవజ్ఞానము టెన్ జింగ్ హిల్లరీల పురోగమనమునకు వెలుఁగు బాట యగుటయేగాక వారి హృదయ క్షేత్రముల నాత్మవిశ్వాస బీజముల నాటెను. వారి మానసాకాశవీథిలో విజయ తారక లుదయింప సాహసించినవి.

మఱునాఁటి యుదయమున ద్వితీయ శిఖరాగ్రారోహక దళము ద్వితీయ యత్నము సాగించుటకై బయలు దేరవలయును. నాటి రాత్రి సౌత్ కాల్ శిబిరమునకు వస్తుసామగ్రిఁ దెచ్చిన షేర్పాలు వారికి నాయకత్వము వహించిన జార్జిలో యష్టమ శిబిరములో నిద్రించిరి. శిఖరాగ్రారోహణలో సౌత్ కాల్ శిబిరమున కవసర వస్తువులఁ గొనివచ్చి విజయ సాధన కమూల్య సాహాయ్య మొనర్చినవార లైన దావా తోండూప్, దాటెన్ సింగ్, టాప్ కీ, ఆంగ్ నోర్బూ, అనుల్లూ, ఆంగ్ నీమా, ఆంగ్ టెంబా, దానాంగ్యాల్, అను వారలకు సహృద

యుండైన సర్ జాన్ హంట్ తనకృతజ్ఞతాపూర్వక ప్రశంసావాక్యములఁ దెలిపెను. నిజమునకు వారి యచంచల కార్యదీక్షాపరత్వమే ఎవరెస్ట్ విజయ సాధన కొక ప్రధాన కారణమని చెప్పవలయును. ఆరాత్రి యష్టమ శిబిర గుడారముల వారందఱు విశ్రమించిరి. కాని యారాత్రి నిజమునకు గాళరాత్రియే! ప్రథమ శిఖరాగ్రారోహకదళము వారి సహాయార్థము వచ్చిన సర్ జాన్ హంట్ ప్రభృతుల కిది సౌత్ కాల్ పై నిద్రించిన మూఁడవరాత్రి. ఆనాఁడు వారందఱు ఎవరెస్ట్ నధిరోహించి చాల నలసిరి. వారి పాలిటికీ భయంకర నిశీథి, పిశాచ పీడనమువలె నుండెను. అప్పటి యుష్ణోగ్రత మైనస్ యిరవై యైదు డిగ్రీలు. వాయవ్య పవనములు దిన మంతయు బలముగ వీచుచుండి యస్తమానము తోఁడనే ప్రచండ పవనముగ మాఱెను. రాత్రి యంతయు గుడారముల నేకధాటిగ నాపవనము వీచుచుండెను. ఉదయాస్తమానములు పర్వతములపై నిరంతరకృషి సల్పి యమితముగ నలసి కొంతకాలము గనుకూర్కు పట్టినఁ జాలునని తహతహలాడు పర్వతారోహకులను దన వాడిదంతములతో నీ శీతరాక్షసి కొఱికి వేయుచుండెను. ఆరాక్షసి దారుణకృత్యములకు దోహదముచేయుచుఁ బవమానుఁడు రాక్షసరూపమున వీరవిహారము సల్పుచుండెను. ఈ రాక్షసద్వయ బాధల కోర్చుచు నుండైన కూర్కులేక వారా రాత్రి క్షణ మొక యుగముగ నెట్లో గడపిరి. మఱునాటియుదయమున టాంబోర్డిలాన్ నిర్వీర్యుఁడై కదలలేకపోయెను. నిన్నటియసన్యసామాన్య పర్వతారోహణమే దీనికి ముఖ్యకారణము. మే మాసములో నిరువదేడవ దినము. నాఁడే ఎవరెస్ట్ శిఖరాగ్రము పైకి రెండవదాడి సలుపవలసియున్నది. దాని కవసరమైన సన్నాహములు. యోధాగ్రేసరులు సిద్ధముగ నున్నారు. కాని గతరాత్రి వాతావరణ విజృంభణ దుష్ఫలితములే యడ్డునిలిచి యున్నవి. అ దుష్ఫలితము లెట్టివో, సుప్రసిద్ధ

పర్వతారోహకు లైన సర్ జాన్ హంట్, సర్ ఎడ్మండ్ హిల్లరీ యను పురుషవరేణ్యులు స్వానుభవమునఁ దెలిపిరి. తన దినచర్య పుస్తకమున సర్ జాన్ హంట్ ఈ క్రిందివిధమున నిరువదేడవ నాఁటి యుదయము సౌత్ కాల్ శిబిర మెట్లుండెనో వర్ణించియున్నాఁడు.

“ఉదయ మెనిమిది గంట లైనది. ఎడ్మండ్ హిల్లరీ దళ మింకను దరలలేదు. అయినను వారినిఁ జూచి యాశ్చర్యపడవలసినది లేదు. ఆ సమయమునఁ బ్రచండపవనములు విచ్చలవిడిగ వీచుచుండెను. తలఁ బయటఁబెట్ట నెవరికిని ధైర్యము చాలలేదు. గుడారముల వెలుపల భయానకదృశ్యము గాన్పించుచుండెను. ఎవరెస్ట్ శిఖరాగ్రపరిసర దృశ్యము లతిభయానకముగ నుండెను. ఎవరెస్ట్ ఆగ్నేయ శ్రేణీ శిఖరాగ్రములు హిమమేఘావృతములై యుండెను. అచ్చోట వాలిన మంచును బ్రచండపవనములు నింగి కెగఁ జిమ్ముచుండెను. మేమందఱము గుడారముల నొకరితో నొకరు దూరి కూర్చుండి భావి కర్తవ్యమును జర్చించుచుంటిమి — టెన్ జింగ్, ప్రిమస్ స్టౌను వెలిగించుచుండెను. ఇఁక షేర్పాలలో, ఆంగ్ నీమా యొకఁడే జీవముతో నున్నట్లుండెను. ద్వితీయ యత్నము తేపటికైన వాయిదా వేయుట తప్పనిసరియాయెను. అదృష్టవశమున నా శిబిరములో వలసినన్ని యాహార పానీయాదిక వస్తునికరము లుండెను. నామట్టుకు నాకిది సౌత్ కాల్ పై మూఁడవ దినము. కాని గత సంవత్సరము స్విస్ యాత్రికులు దద్విధముగనే సౌత్ కాల్ శిబిరమున గడపిన కాలమునకు, దాని ఫలితములకు, మా ప్రస్తుత ఫలితములకు భేద మెంతయో గలదు. వారు పర్వత మవరోహించి మఱలి దిగువ శిబిరములకు వచ్చునరికిఁ బ్రాణావశేషులైరి. మా విషయ మట్లుగాదు. మే మిరువదారు వేల యడుగుల పైనిఁ బ్రథమ శిబిరమున వలె హాయిగఁ గూరుచుండి సంతుష్టిగా

భోజనము సేయుచుఁ బ్రాణవాయు సాహాయ్యముతో సుఖముగ నిద్రించుచుంటిమి.

మధ్యాహ్నము టామ్ ఇవాన్స్ లిరువురు సప్తమ శిబిరమునకు బయలుదేఱిరి. కొంతదూర మేగిరో, లేదో, ఛార్లెస్ ఇవాన్స్ తిరిగి వచ్చి తన సహచరుఁడైన టాంబోర్డిలాన్, నడువలేకున్నాఁ డను వార్తఁ దెచ్చెను. మాలో నెవరో యొకరు తోడు వెళ్ళనిదే యతఁడు సజీవముగఁ బ్రథమ శిబిరము సేరు టసంభవము. ఇది మఱియొక పరీక్ష. సౌత్ కాల్ శిబిరమునుండి శిఖరాగ్రారోహణ సురక్షితముగ జరిపించుచు వలయుచో వాయిదా వేయుటయో, లేక ప్రయత్నము విరమించుటయో తీర్మానించు పని నాదియైయున్నది. వాస్తవముగ నేను ప్రథమ దళ సహాయార్థమై వచ్చియుంటిని. కాని జార్జ్ లో ఆల్ ఫ్రెడ్ గ్రిగరీ లుండుటచే నేను దిగిపోవుట యుత్తమమని యెంచి బయలు దేఱితిని. నన్ను సాగనంపుటకు వచ్చిన హిల్లరీతో వీలగునంత వఱకు ప్రయత్నము విరమించవలదని చెప్పి యాతనిఁ బంపివైచితిని. అం... నేను, ఛార్లెస్ ఇవాన్స్, టాం బోర్డిలాన్, ఆంగ్ ఛేంబా, బయలుదేఱితిన్నగా దిగిపోతిమి. టాం, అంగ్ ఛేంబా, లిరువురుఁ జాల నీరసముగ నుంట దారిలో మాటిమాటి కాగుచు, నాగినచోటఁ జాలసేపు విశ్రమించుచుంటిమి. నేను ప్రాగ్భాగమునఁ బోవుచుంటిని. చార్లెస్ పశ్చిమ భాగమున వచ్చుచుండెను. ఎటులనో మేమందఱము దిన్నగా సప్తమ శిబిరము సేరుసరికి మాశక్తు లుడిగినవి. అట విల్ఫ్రిడ్నాయిస్, మైక్ వార్డు లుండిరి. మేము వచ్చునపుడు సప్తమశిబిరమునకుఁ బైగాఁ గొంతదూరమునఁ గల బిలములో ఆంగ్ ఛెంబా ప్రమాదవశమున జారి తలక్రిందుగఁ బడెను. వాని నెట్లో వెలుపలికీడ్చితిమి. నాస్థితి

చాల హీనముగ నుండెను. చివరకు నా చిటికెన వ్రేలినైనఁ గదిలింప లేని యశక్తత యేర్పడెను. "

సప్తమ శిబిరములో విల్ఫ్రిడ్‌నాయిస్ వారి కెన్నియో యుప చారములఁ జేసెను. ఆసాయంత్రమే ఛార్లెస్ ఇవాన్స్, మైక్ వార్డ్‌తో గలిసి నాల్గవ శిబిరమున కేగెను.

మఱునాఁ డుదయమే సర్ జాన్ హంట్, టాం బోర్డిలాన్ బయ లుదేఱి మధ్యాహ్నము నాల్గవ శిబిరమును జేరిరి.

ఎడ్మండ్ హిల్లరీ తన యనుభవముల నిట్లు వివరించుచున్నాడు. " ఇరువదేడవ నాఁటి వేకువజామున నేను నిద్ర మేల్కొంటిని. అపుడు చలి దుర్భరముగ నుండెను. నాగుడారములో గ్రిగరీ, లో, టెన్‌జింగ్‌లు శీత బాధానివారణార్థ మెన్ని యుపాయములో పన్నుచుండిరి. హోరు మని వీచు ప్రచండ వాయువులు గుడారముల మోదుచుండ సుఖనిద్ర యసాధ్య మయ్యెను. నాపడకసంచినుండి విధిలేకఁ జేతిని లాగి, యగ్గి పుల్ల గీచి, చేతిగడియారముఁ జూచితిని. అపుడు నాల్గు గంటలయ్యెను. ఉష్ణమాపకము మైనస్ ఇరువదైదు డిగ్రీల సూచించుచుండెను. ఆగ్నేయశ్రేణిపై నొక శిబిరము నిర్మింపవలయునని మేము సంకల్పించి తిమి. కాని యీ ప్రళయ మారుతములోఁ గడప దాటుట యసాధ్య ముగ నుండెను. ఆ ప్రచండ మారుత మాగిన మేము పురోగమింప సిద్ధపడవలయును. నేను నా మోచేత టెన్జింగ్‌ను గొంచెము దట్టి యాహారపానీయముల మాటఁ జెప్పి వెంటనే పడక సంచిలో దూరితిని. కొలఁదికాలములోనే స్టవ్ వెలిఁ గ్రక్కు రొదతో మా నిద్రమత్తు మటుమాయమైనది. మేమందఱము లేచి బిస్కత్తుల నమిలి, నిమ్మరసముఁ ద్రాగితిమి. తొమ్మిదిగంటలైనను గాలితగ్గలేదు. మహాభయంకరముగ

వీచుచుండెను. వేడిమిని గలిగించు వస్త్రములఁ దొడిగి నేను నేలపైఁ బ్రాకుచు సర్ జాన్ హంట్ గుడారము లోనికి వెళ్ళితిని. ఆ పరిస్థితులలో శిఖరారోహణ యసంభవమని సర్ జాన్ హంట్ అంగీకరించెను... ఆనాఁ డంతయు వాయువేగము దగ్గలేదు. అయినను మేము జంకులేక మఱునాఁటి శిఖరారోహణ యాత్రాసన్నాహము లొనర్చుచుంటిమి. ఆనాటి రాత్రియు నిన్నటివలెనే తిప్పలఁ బెట్టినది."



# 13

## ఆరోహణము 2

ద్వితీయ శిఖరాగ్రారోహక దళనాయకుఁడు, ఎడ్మండ్ హిల్లరీ తదీయారోహణ జయప్రదముగ నెట్లుకొన సాగినదో స్వీయానుభవము ద్వారా తెల్పియున్నాఁడు. మేనెల యిరువదెనిమిదవనాఁడు తెల్ల వాఱినది. పవనవేగ మింకను క్షీణదశకు రాలేదు. అట్లది వీచి వీచి యెనిమిది గంటలవేళ కెటులో తగ్గుముఖము పట్టినది. అంతఁ బర్వతా రోహకుల యాశాలత చిగిరించినది. వెంటనే వారు పురోగమనా సక్తులై, తత్కార్య నిర్వహణ మునిఁగి యుండిరి. కొలఁది సరవపను లతో వారు చాల హడావిడిఁబడుచుండ నొక చిన్ని సమస్య తల యెత్తెను. పెంబా యను షేర్పా రోగార్తుఁడైనాఁడనియుఁ, బర్వత మధిరోహింపఁ జాలఁడనియుఁ దేలినది. ప్రస్తుతము హిల్లరీ టెన్జింగ్ దళ సహాయార్థము రావలసిన ముర్వురలో అంగన్యీమా.యను షేర్పా యొకఁడే వారి ననుగమింపఁ గలిగియున్నాఁడు. ఇట్లు పరిస్థితు లొకటి యనుకూలింప నింకొకటి ప్రతికూలించుచుండెను. యాదృచ్ఛిక విషమ పరిస్థితులలో నెవరేని ధైర్యవిలోలురై వివేక శూన్యు లగుట సర్వ సాధారణము. కాని హిల్లరీ ప్రభృతు లచలితచిత్తులు; వారి భుజ స్కంధములపైఁ గల కార్యభార మీ యల్పావరోధముల సరకు గొనునట్టిది గాదు; ఉపాయాంతర మాలోచించి కార్యము సాధింప వలయును. ప్రయత్నమునుండి విరమించు నూహలు తాత్కాలిక మానసిక రంగమునఁ బ్రసరింపఁ జనవు. దాన ముర్వురి మోత యొక్క షేర్పా భుజములపైఁ బడెను. ఇది యసంభవము; కావున నారో హకులే గుడారముల మోసికొని పోవుటకు సంసిద్ధులైరి. అట్ల యగుటఁ

గొన్ని ముఖ్యవస్తువుల సౌత్ కాల్ శిబిరముననే వదలుట యవసర మయ్యెను; ప్రాణవాయు సాధనములఁ గూడ వదలుటకు నిశ్చయించిరి. ఉదయము సుమారు తొమ్మిది గంటలకు జార్జ్‌లో, గ్రిగరీ, ఆంగ్ స్ట్రీమాలు ముగ్గురు మఱినలువది పౌనుల బరువుల నెత్తికొని శిఖరాగ్రము గూర్చి వెడలిరి. తదనంతర మొక గంటకు వివిధ వస్త్రములు, పడకసంచులు, గాలి పఱుపులు, ప్రాణవాయు సాధనములు, నాహార పానీయములు సేకరించి సిద్ధముచేసికొని, చెరినలువది పౌనుల బరువును మోసికొనుచు, టెన్జింగ్ హిల్లరీలు పురోగమించిరి. వారిరువురు మందవేగముగ నాగ్నేయ శ్రేణీపార్శ్వముల నధిరోహించుచు మిట్ట మధ్యాహ్నకాలమునకు స్విస్ దళ శిబిర స్థలమును జేరిరి. బహుశః యాశిథిల శిఖరముఁ జూచి టెన్‌జింగు మనసు, దత్పూర్వ వర్ష విషాద సంఘటనాస్థల సమీపమునకు బరుగు లిడుట యాశ్చర్యమే ? అపు డతఁడు స్విస్ ఎవరెస్ట్ యాత్రికదళసభ్యుఁడు. ఆగ్నేయ శ్రేణిపై నొక శిబిరము నిర్మించి యటనుండి యొకసారిగ శిఖరారోహణఁ గావించి రావలయునని వా రనుకొని యొక్కచోఁ జిన్నిశిబిరము నేర్పఱచిరి.

ఆ స్థలమునుండి నలుదిక్కులఁ గలయఁజూడ సర్వలోకమును సమ్మోహపఱచు మహాద్భుత సౌందర్య ప్రకృతి దృశ్యములు గాన నయ్యెను. దాని కదియ సాటి యగుట హిల్లరీ యాప్రకృతి దృశ్య సంపదను దన ఛాయాగ్రాహక యంత్రమునఁ బ్రతులఁ దీసెను. కొండొకసే పా పర్వతలోక సౌందర్య రసాపూర్ణ హృదయు లగుచు రెండు రోజుల క్రితము సర్ జాన్ హంట్ వస్తువుల దింపిన స్థలమునకు బోయిరి. కించిదున్నత స్థలమున శిబిర ముంట లాభకరమని, యటఁ గల సామగ్రి నెత్తికొని వారు మఱలఁ బురోగమించిరి. వారెక్కు నెత్తము చాల నిడివిగ నుండుట నవుడపుడు వాలు పలుచని పొడి

మంచు తప్ప వేఱొండవకోధ మేమి లేకుండెను. ప్రస్తుతము గ్రిగరీ, జార్జ్ లో, హిల్లరీ, టెన్ జింగ్ లు చెఱి యేఁబది మొద లరువది మూఁడు పౌనుల వస్తుభారము నెత్తికొని పోవుచుండిరి. వారు పోవుకొలఁది పర్వతపు నిడివి మఱింత హెచ్చున ట్లుండెను. పర్వతోపరితలమున మంచు ఘనీభవించి యుంట జార్జిలో మెట్ల నెక్కుచుఁ బోవుచుండెను. ఆ మె ట్లెక్కుచుఁ గొద్ది త్వర వా రందఱు మధ్యాహ్నము రెండు గంటలవఱకుఁ బయనించిరి. వారి తనువు లలసటఁ గన శిబిరస్థలాన్వేషణఁ గావించిరి. పైఁజూడఁ గొంత యెత్తున విశాల శిలాఫలక మొకటి కాన్పించును. అయ్యది శిబిర నిర్మాణానుకూలమని యాశపడి దానిని సమీపింప వారి యాశ లెల్ల నేలపాలగుచుండెను. అట్టి శిలాఫలకము లన్నియు జారుడు బండల వలె నుండెను. ఇట్టి యాశాభంగములు పెక్కుగలుగ టెన్ జింగ్ తన పూర్వానుభవమును బురస్కరించుకొని పర్వతముఖమున కడ్డముగ నడచిన లాభ ముండునని వారికి సూచించెను. అతని సూచన మన్నించి వా రటుల రెండున్నరగంటల వఱకు నడచి వెళ్ళగా నను కూలస్థల మొకటి కాన్పించెను. గ్రిగరీ, లో, ఆంగ్ న్యీమా, లందఱు దమ తమ బరువుల నట ముదమొదవ దిగువఁ బెట్టిరి. ఆయెత్తున కంతటి భారమును మఱే యితర పర్వతారోహకులు మోసికొని పోలేదనుట నిస్సంశయము. అనంతరము వారు ముగ్గురు కాలయాపన సేయక తత్‌క్షణమే సౌత్ కాల్ శిఖరమునకు హుటాహుటి మఱలిరి.

తమ మిత్రులు ముగ్గురు సుఖశాంత్యాస్పదమైన దిగువ శిఖర మునకు మఱలుచుండ, వారలఁ గని టెన్ జింగ్ హిల్లరీల హృద యము లొకింత చలించినవి. కొలఁది కాల మొంటరి తనమును వా రనుభవించిరి. త్వరత్వరగ వారు దమతమ ప్రాణవాయు సాధ

నములం జేసివైచి, శిబిరస్థలము నివాస యోగ్యముగఁ జేయఁ బూనుకొనిరి. రెండుగంటల నిర్విరామకృషి యనంతర మారడుగుల పొడవు, మూఁడడుగుల వెడల్పుఁగల రెండుస్థలభాగము లొకదాని క్రింద నొకటి సోపానములవలె నేర్పఱచిరి. అంత నటఁ జిన్న గుడారముల నిలిపిరి. వానిని నాలుగువైపుల దృఢముగఁ ద్రాళ్ళ బంధింపఁదగిన వసతి లేమిఁ బ్రాణవాయువు సీసాలను మంచులోఁబాతి వానికి నాత్రాళ్ళఁ గట్టిరి. టెన్‌జింగ్ భోజనము సిద్ధముచేయ హిల్లరీ ప్రాణవాయు సాధనముల సరిదిద్దుచుండెను. సూర్యుఁ డపరాంబుధిఁ గ్రుంకెను. ప్రపంచ మంధకారబంధుర మగుచున్నది. ఆకాశారామమున మల్లెమొగ్గల వలె నక్షత్రము లొలసినవి. విశ్రమించుటకు సమయ మాసన్నమైనది. ఈరాత్రి గాఢనిద్రా పరవశులైన మఱుసటి ప్రాతఃకాలమున నూత్న చైతన్య శక్తులు వారి శరీరముల నుదయించును. ఇంతవఱకు యత్న కార్యము నిరాటంకముగ జరిగిపోవుచున్నది. దైవ మనుకూలించిన రేపు శిఖరాగ్రమునఁ గాలూని విజయలక్ష్మిని గైవసము సేసికొన నగును నను నాసలూర వా రిరువు రాహారముగైకొని కవోష్ణజనకవస్త్రములఁ దొడిగి పడకసంచులఁ జేరిరి. వారి కాహారపుఁ గొఱఁత లేదు. తేనె, పండ్లరసములు బిస్కత్తులు, ఖర్జూరఫలములు, రకరకమైన మిఠాయి, వివిధపానీయములు వారికడ నుండెను. అత్యౌన్నత్యమున వారు నిద్రించుచున్నను నుచ్ఛ్వాసనిశ్వాసముల కెట్టియాటంకములేకుండెను. హిల్లరీ పైభాగమునను, టెన్‌జింగ్ క్రిందిభాగమునను, బరుండిరి.

ఆరాత్రి మఱలఁ బవనవేగ మతిశయించెను. దిక్కులు మాఱుమ్రోయునట్లు శీతానిలములు విచ్చలవిడిగ వీచుచుండెను. ఈపవనముల ధాటికిఁ దొమ్మిదవ శిబిరము నాశమొందునను భయము వారి హృదయములఁ గలఁతఁ బెట్టెను. హిల్లరీ కొంచెము ప్రక్క కొదిగి

గుడారము గాలి కెగురకుండఁ గాపాడుచుండెను. ప్రాణవాయు సాహాయ్యములో గొన్ని యంతరాయములు గలిగినను వారు సుఖనిద్ర గూరిరి. నాటిరాత్రి యుష్ణమాపకము మైనస్ ఇరువదేను డిగ్రీల సూచించెను.!! కడచిన రెండు మూఁడు దినములలో నింతటి దుర్భర శీత మేర్పడలేదు. కాని యదృష్టవశమునఁ ద్వరిత గతినిఁ బవన వేగము దగ్గి, గాలి యున్నదా, లేదా, యనున ట్లుండెను.

ఎట్లో రాత్రి కడచెను. ప్రాతఃకాలమైనది. అదియే మేనెల యిరువది తొమ్మిదవ దివసము: వాయుచలన మిసుమంత యేని లేదు. హిల్లరీ గుడారము వెలుపలికిఁ దొంగిచూచెను. హిమవత్పర్వత సీమ యాతని యెదుట ననంతముగ విస్తరించి యున్నది. ప్రాతఃకాల స్నిగ్ధకాంతులు హిమావృత శిఖరములపైఁ బ్రసరించి వాని నిర్మలాకృతినిఁ బ్రకటించుచున్నవి. నేపాళసీమ సాంద్రారణ్య సహితములు, సువిశాలములు, నైన లోయ లింకను మసకచీకటి తెరచాటున నిద్రించుచున్నవి. ప్రాచ్యాకాశ ముదయభాను తరుణారుణకిరణ రాగపటలిచే నమరసౌందర్య విలసితమై యున్నది. నీలాంబరవీథి, గాఢ నిశీథవేళ స్వేచ్ఛాక్రీడలఁ దేలిన తారాపంక్తు లిపుడు దినకరోదయ తేజోరాశి దుర్భరము గాఁగ నదృశ్య మగుచున్నవి. అత్యున్నపర్వత సానువుల రవి నవనవోన్మేష కిరణావళి ప్రసరించుచున్నది. ఈ యద్భుతదృశ్యమును గాంచ, టెన్జింగ్ హిల్లరీల కఠినకర్కశ పర్వతారోహక హృదయములఁ గళాపిపాస లతిశయించెను. వా రానందవివశులైరి. టెన్జింగ్, సుమారు పన్నెండువేల యడుగుల దిగువ నస్పష్ట గోచరమగు నొక చిన్నమచ్చను గాంచెను. అది త్యాంగ్‌బోచ్ మఠముగ గుర్తించి భక్త్యావేశహృదయుఁ డయ్యెను. అహో! ఏమి యీ యమాయిక బౌద్ధుని భక్తిపారవశ్యము! త్యాంగ్‌బోచ్ మఠాధి

పతి లామా తమ క్షేమ విజయైశ్వర్యాయు రారోగ్యప్రాప్తికై బుద్ధ దేవునిఁ బ్రార్థనార్చనలఁ బూజించుచుండునని యతఁడు తలపోసెను. ప్రపంచచరిత్ర నొక మహత్తర దివసోదయ ప్రభావిస్తరణ ప్రారంభము గానున్నది.

హిల్లరీ శీఘ్రముగఁ బడక వీడెను. ప్రాణవాయు సాధనములఁ గప్పిన నునుమంచుపొడిని రాలఁగొట్టి వానినిఁ బరీక్షించెను. ఆతని పాదరక్షలు (బూట్లు) ముద్దఁ గట్టి పోవుటచే స్టౌపై వానినిఁ గఱగఁ జేసెను. వా రిరువురు నిమ్మరసమును విరివిగా సేవించిరి. బిస్కత్తులు మొదలైన పదార్థములను దృప్తిగ భుజించిరి. పిమ్మట యారున్నర గంటలకు గుడారముల వెలువడి ప్రాణవాయు సాధనముల ధరించి బయలుదేఱిరి. ఆసరికి సూర్యకాంతి దక్షిణశృంగముపైఁ బరిపూర్ణ ముగఁ బ్రసరించెను.

ప్రాణవాయు ప్రభావమున వారు నెమ్మదిగ, నిరాటంకముగ నధిరోహించుచు నాగ్నేయశ్రేణిని దాటిపోయిరి. అటుపిమ్మట మార్గము ప్రమాదజనకముగ నుండెను. శిలలపైఁ జేరికొనిన మంచు పలుచగ నుంట దానిపై నడచు టంత నిరపాయముగఁ దోఁచలేదు. దురదృష్ట వశమున నొక్కొక్క సమయమునఁ బాదములక్రింది మంచు ముక్కలు ముక్కలుగ విఱుగుచుండెను. ఇంతటి ప్రమాదకారియగు మంచుపైఁ గొన్నివందల యడుగుల దూరము నడచుచు వారిరువు రొక నిమ్న భాగమును జేరిరి. అందునఁ బ్రథమ శిఖరాగ్రారోహకులు విడిచివచ్చిన రెండు ప్రాణవాయు పాత్రలు గాన్పించెను. వాని సాహాయ్యమున శిఖరాగ్రమునుండి సౌత్ కాల్ వఱ కనాయాసముగఁ దిరిగి రావచ్చునని వారు సంతసిల్లిరి. ఇయ్యది యత్నకార్యసిద్ధి కనుకూల శకునము గదా యను భావము వారి నుత్తేజపఱచుచున్నది. వారు దక్షిణ

శృంగాగ్రమున కింక నాల్గువందలయడుగుల దిగువ నుండగాఁ బర్వతశ్రేణి మఱింత నిట్ట మయ్యెను. పర్వతముఖ మత్యంత విశాల హిమాచ్ఛాదితమై, మహాసమస్యయై యుండెను. ఆపర్వతభాగ మధిరోహించునపుడు టెన్జింగ్ హిల్లరీ లిరువురు మార్గదర్శకత్వమును సమయానుకూలముగ మార్చుకొనుచుండిరి. వారిరువురుఁ బురోగమనాది విషయములఁ బరస్పరముఁ జర్చించుకొనుచుండిరి. సరిగ ఉదయము తొమ్మిదిగంటలకు వారిరువురు దక్షిణ శృంగాగ్రముపై నిలిచిరి. అటనుండి శిఖరాగ్ర పర్యంతము సాగియున్న పర్వత నైసర్గిక స్థితిగతులఁజూడ వారి హృదయముల సందేహ మంకురించెను. ఇన్ని యవరోధముల దాటి వచ్చినను, నంత్యదశలో మఱియొక ప్రబల నైసర్గికావరోధ మెదుఱొడ్డుచున్నది. దీనినిఁ దరించుటెట్లు? అడుగడుగున నవరోధములు ప్రత్యక్ష మగుచుండఁ బురోగమనోత్సాహము క్షీణించుట ప్రాణి సహజ లక్షణమే గదా! ఉత్సాహ మస్తమించుచుండ మహాకార్యముల సాధించుటెట్లు? మహత్తరకార్యసాధనలో ప్రబలావరోధములు నీడలవలె సర్వకాలముల వెన్నంటియే యుండును. సర్వకాలములందుఁ, దేనె తొట్టెను మూఁగి విడనాడ నొల్లని తేనెటీగల రీతి నీ యవరోధము లా మహత్తర కార్యముల చుట్టుముట్టి యుండును. తేనెటీగలఁ దఱిమి వేయనిచోఁ దీపి తేనె సోనలు చేతికందని యట్లు లీ ప్రబలావరోధములఁ భేదింపనిచోఁ గార్యసిద్ధి చేకుఱదు. ఈయవరోధము లొసఁగు దారుణ పరీక్షల కెదురునిల్చి యాద్యంతము పోరు సల్పఁగల దుర్భేద్య సంకల్ప దార్ఢ్య సమన్వితులౌ, వీరాధివీరులు మహాకార్యసాధనాప్రాంగణమున దూకినచో నిఁకఁ గొదవ యేమున్నది! టెన్జింగ్, హిల్లరీల వలె పటుతర శరీర మనోదార్ఢ్య సంపన్నులయిన పర్వతారోహకులు లేరనుట కేల తడబాటు? ఈయనంత సృష్టి వైచిత్ర్యములచే విస్మయ భ్రాంతచేతస్కులౌట, నేతద్వైచిత్ర్య రహస్య ప్రకటనా కాంక్షిత కార్యాసక్తయా

మనోబలము వారిరువుర మూర్తీభవించినది. అశేష పరిమాణౌన్నత్యములతో మానవశ నవగణనఁ జేయుచున్నదా యనునట్లు నిలిచియున్న యెవరెస్ట్ శిఖర దురహంకారమును సమూలవినాశ మొనరింప వారు సమకట్టిరి. వారి మనోనిశ్చయము వజ్రతుల్యము. అట్టిచో నీ నిరోధములు వారిదృష్టి నేపాటివి ? వారి మనోనిశ్చయ ప్రోజ్జ్వలాగ్నికి నీయవరోధము లింధనముల వంటివి.

టెన్‌జింగ్ హిల్లరీలు శిఖరాగ్రముపై విస్మయ దృగ్వీచికలఁ బ్రసరించిరి. దక్షిణభాగమున వికృతాకారముల హిమరాసు లెన్నియో వెలుపలికిఁ జొచ్చుకొని క్రిందికి వ్రేలాడునట్లుండెను. వానిపై నడచుట మృత్యుదేవతా ముఖగహ్వరములోనికి నడచుటయే ! కాని హిమరాసులు శిలాప్రాయములైన వానిపై నిర్భయముగ నడచిపోనగును. ప్రస్తుత మీ మార్గమే గమనార్హమై యున్నది. ఇటులఁ దీర్మానించి కొండొకసేపు వారొకచో విశ్రమించిరి.

విశ్రాంతిఁ గొన్న మీఁదటఁ బునఃపర్వతారోహణ నారంభించిరి. అదృష్టవశమున నా ప్రాంత హిమము శిలారూపముగ నుండెను. ఇఁక విచారమేల ? ...... ఒక పరి హిల్లరీ మెట్లఁజెక్కుచుఁ గొంత దూరమేగును. ఆమెట్లపై టెన్జింగ్ నెమ్మదిగా నడచి హిల్లరీనిఁ జేరును. అంత హిల్లరీ విశ్రాంతిఁ గొనును. టెన్జింగ్ మెట్లు చెక్కును. ...... ఇట్లు వారేకాత్మక శరీరద్వయరూపకులై వేగమున నెక్కిపోవుచుండిరి. అటనటఁ బర్వతపు టంచుల నానికొని హిమరాసులు గాలిలోనికిఁ జొచ్చికొని యున్నవి. వానిపైనుండి యెనిమిదివేల యడుగుల క్రిందఁ గల పడమటిలోయఁ బడి నిట్టనిడివిగ దిగిపోయిన యెవరెస్ట్ దక్షిణ ముఖముఁజూడ వారి నేత్రములు గిఱ్ఱునఁ దిరిగి చీకటులు గ్రముచుండెను. అట్టి శిలాఫలకములపై కేఁగఁ బ్రాకుచుఁ బోయిరి. అంత

నొకపరి టెన్జింగ్ వెనుకఁబడి, యూపిరాడక తన్నుకొనుచుండెను. హిల్లరీ వెనుఁ దిరిగిచూడ, నిది కన్పడఁ, గారణమరయఁ, బ్రాణవాయు పరికర లోపమని గ్రహించి, దానిఁ బరీక్షింప మంచుతీవియలు దాని నలమియుంటఁ గాంచి సవరించెను. తత్సాధన ప్రయోగానుభవజ్ఞాన మింకను టెన్జింగున కలవడమి యిట్టి యవరోధ ముత్పన్న మయ్యెను. సాధనమునుండి నాసికా ద్వారములకు వాయు ప్రసరణ చేయు గొట్ట మా మిహికాలతికా ప్రతానమునఁ జుట్టఁబడుట యని హిల్లరీ గ్రహింపుటఁ దన సాధనావరోధమును గూడ వాసించి సవరించుకొనెను. టెన్జింగ్ లేచి కదలెను. హిల్లరీ పురోగ ముఁడుగ నుండెను.

అప్పటి వాతావరణము నిర్మలము, నిర్దోషము, నిరపాయ మును; గాని యందొక విచిత్రప్రత్యేకత కూడ నుండెను. అందులకు హిల్లరీ స్వీయానుభవమే సాక్షి. "పురోభాగమును సమగ్రముగఁ బరి శీలించు నుద్దేశముతో నాకంటి యద్దములఁదీసివైచితిని. కాని తత్క్షణమే సన్నని మంచు దుమ్ము నాచూపును గప్పివైచినది. వెంటనే కంటి యద్దముల ధరించితిని." అని హిల్లరీ చెప్పుచున్నాఁడు. ఆ ప్రయాణ మతని కెంతయో యాహ్లాదకరముగ నుండి మాతృభూమియైన న్యూజీ లాండ్ దేశములో నొక పర్వత మారోహించుచున్న ట్లుండెనని వర్ణించెను. అటులే నిరాటంకముగ వా రొక గంటకాల మధిరోహించ నట నలువ దడుగుల యెత్తైన మహాశిల యొకటి వారి కెదురొడ్డెను.

ఆశిల నున్నగ, నెట్టిపట్టులేక, యుండెను. దాని నధిరోహించు టనగా మఱియొక గండము గడచుటయే. ఇంత ప్రయత్నమంతయు నీ శిలామూలమున శిథిలము కాఁగల యవకాశము గలదు. విజయమో, పరాజయమో, యిదియే తేల్చఁగలదు. పై కెగఁబ్రాకుట కేమాత్రము పట్టులేకుండెను. దాని నాల్గువైపులఁ బరిశీలించిన మీఁదటఁ బ్రాగ్దిశా

భాగమునఁ గొంచె మవకాశము గాన్పించెను. ఆశిలనంటి తూర్పుగా గొన, మొదలు, నొక హిమరాశి వెలికిఁజొచ్చికొని యుండెను. కాని యాశిలకు, దాని నంటియున్న హిమరాశికి, నడుమ సన్నని చీలిక యొకటి వారి కంటఁబడెను. శిఖరాగ్రముఁ జేరవలెనన్న నింతకన్న నదుపాయము మఱొండులేదు. ప్రాణములపై నాశవీడి యెటులో యీ శిలావరోధమును దాటవలయును. ముందువెనుక లాలోచించి, హిల్లరీ తెగించి, ముందంజ వేసెను ఆ యిరుకైన చీలికలోని కెటులో తనశరీరమును దూర్చి, వెనుకఁగల మంచులోఁ బాదరక్ష మేకులఁ జొన్పఁజేసి, యెదుటనున్న శిలాతలముపైఁ జేతులూని, దొఱికినంత తాతిగుబ్బల నాధారముగాఁ గొని, సర్వశక్తుల వినియోగించుచు, నూపిరి బిగియఁబట్టి, ప్రాణములపై నాశవీడి. భగవంతునిపై భారము మోపి, యా హిమరాశి నిశ్చలముగ నుండునట్లుగా సర్వేశ్వరుని వేడుచు, నధోముఖుఁడై కిందనుండి పైకి, నతిమందవేగమున, నంగుళ మంగుళముగఁ, బ్రాకుచు నాశిలాగ్రమున విశాలశిలాఫలక మొకటి కాన్పింపఁ, బైఁబడుండి విశ్రమించెను. తన సాహసమును జూచి ముక్కుపై వ్రేలిడి, విస్మయ భయాందోళనలలోఁబడి, యేమి కాఁగలదో యను కౌతుక మతిశయింపఁ దేఱిపాఱఁజూచు టెన్జింగును బైకి రమ్మని యతఁ డాహ్వానించెను. శిలాగ్రముపైనున్న హిల్లరీ త్రాటిని గట్టిగఁ బట్టుకొనఁగా, టెన్జింగ్ దానియాధారమున నట కెగఁబ్రాకి "బహుకాల ఘోర సంగ్రామానంతరము పట్టువడిన పెద్ద చేపవలె" నుస్సురుస్సనుచు నాతఁడు నీరసమునఁ గ్రిందపడెను.

ఇఁక నేమి ? శిఖరాగ్రముపై కురుకుట కెట్టి యాటంకములేదు. దాని నధిష్ఠించుట యిపుడా, యెపుడా, యనునదే కాని వేఱొండు సంకటమున కవకాశమే లేదు. హిల్లరీ యుల్లముపై భావి విజయ

పవనములు వీవసాగెను. టెన్జింగ్ మనముపై విజయ చంద్రోదయ కాంతి కిరణములు ప్రసరింపఁ జొచ్చెను. వారు నిరవధి కానందామృత సాగర వీచీ నివహాలోలచిత్తు లగుచున్నారు. అయి, యొకింత విశ్రమించి, పునరారోహణ క్రియకు ప్రారంభించిరి. టెన్జింగ్ ప్రాణ వాయు సాధనాభావముచే మెల్లగ నధిరోహించు చుండెను. హిల్లరీ చూచి, యదేమని యడిగెను. ఆతఁడు దరహాసవదనుఁడై 'పురోగ మించుము' అను మూసనసంజ్ఞలఁ జేయుచుండెను. పర్వతశ్రేణి మార్గ మునకిరువైపులఁ బర్వతఁపు టంచుల నంటి వ్రేలాడు చిన్న చిన్న మంచు ముద్దలు, నున్నని శిలాఫలకములు, నుండుట కతన శిఖరాగ్ర దర్శనము వారికి లభించుటలేదు. త్రోవ చాల వక్రగతిని సాగుచుం డెను. ఎంత కాలమట్లు మెట్లు సెక్కుచుఁ బోవుచున్నను దుద ముట్టు జాడ లెవ్వియుఁ గానవచ్చుటలేదు. సుమారు రెండు గంటల క్రితము నుండి యతఁడు మెట్లు సెక్కుచుంట వారికి బడలిక యతిశయిల్లెను. ముందున్న యుత్సాహమిపుడు లేదు. కాయికశ్రమ యంత కంతకు హెచ్చుచుండెను. అల్లంత దూరములో నిఁక మెట్లు చెక్కనవసరము లే దనిపించును; గాని యాదూరమేఁగు సరికి మార్గము మలుపు దిరిగి యుండును. పురోగమించుకొలఁది శిఖరాగ్ర మెటకో మానవ సామీ ప్యము నేవగించు కొనుచున్నదా యనునటుల దూర దూర మగు నట్లుండెను. ఎండమావులఁ జూచి యాసపడి వాని చేరువకు గబగబఁ బోవు గ్రీష్మర్తు పథికుని వలె, నాయిరువురా శిఖరాగ్రముఁజేర నడుగు లిడుచుండిరి. అటుగొంత యెత్తున కెక్కగా నావలి వైపున రాంగ్ బక్ మఠము, నార్తకాల్ పర్వతము, వారికి దృగ్గోచరమయ్యెను. అటనుండి మఱియొక సన్నని మంచుగోడ శిఖరాగ్రము వఱకు సాగి యుండెను. బహుశః యదియే యంతిమావరోధము గావచ్చునను నాసతో మెట్లు సెక్కుచు నేఁగిరి. అంతయే! ...... కనుమూసి

తెలుచు లోపల శిఖరాగ్ర సింహాసనాధిష్ఠు లైనారు!! అదియే!! మానవచరిత్రలో నొక యనన్య కార్యసంఘటనము!! ఆశుభ ముహూర్త మాసన్న ఫలానుభూతిం గాంచినది. దీనికోసమే మాన వులు త్రింశద్వర్ష కాలపర్యంతము నిరంతరోత్సాహ సంపన్నులై, పరాజయమొందియు విగత పరాక్రములుగాక, పరాజయమును, విజయసోపాన పంక్తి కొక యూంత యను దృఢమతి, విజయకాంక్షా ప్రభాసిత భుజబలశక్తి సామర్థ్యములతో, నఖండ కృషినల్పుచుండిరి. మహత్తర మానవ సాహస కార్యసాధనా మహిమ కిదియే పరమా వధి కాంబోలు! మానవశక్తి శిఖరములు మహోత్తుంగ పర్వత శిఖ రముల కన్న మిన్నయను భావ మిపుడుగదా నిరూపితము!

అల్లదే! ఎవరెస్ట్ శిఖర సార్వభౌముని మహోన్నతదుర్గము. అల్లదిగో! ఆతని నీలాంబర చుంబిత స్నిగ్ధకాంతి మయూఖ ప్రసారిత మకుటాగ్రము. ఏ మా రాజరాజు రాజసరీవి! స్వీయ బలాతిశయ సంపన్నమహత్వ మేనా యీరాజేంద్రు రాజసమునకు మూలము? లేక తాను మానవ శక్తియుక్తుల కజేయుండనియా? లేకున్న మానవ పాదస్పర్శాజనిత మాలిన్యరహితుండనియా?......కావచ్చును. తాను జన్మించిన దాదిగం బ్రకృతిశక్తుల దౌష్ట్యఫలితముగం బ్రాణికోటి సాహ చర్యమే తనకు లేదు. తన్నావరించియున్న ప్రచండ పవనహిమములే, తన యనుంగు మిత్రులు; దనకు వారితోడిదే లోకము. సర్వకాల సర్వావస్థలం దేకాంతమున కలవడిన తన కన్యసంపర్క మేల? తన దుర్గమును, బర్వతశ్రేణీ కక్ష్యాంతరములను దాటి తన్ను సమీపించు మానవుల నింతకాలము శత్రుభావముతో, బారంద్రోలుచుండెను. కాని యాకాల మిపుడు గతించినది. మానవుండు ప్రకృతిని దన విజయ పతాకముతో నధిష్ఠించుచున్నాండు.

ఎవరో, విచిత్రవేషధారులైన మానవు లిరువురు, హిమాచ్ఛాదిత శిఖరాగ్రముపైఁ గాలు మెట్టినారు. మానవసంచార శూన్యమౌ నాస్థలము నాక్రమించిరా! ఎవరెస్ట్ శిఖర సార్వభౌముని గర్వాంధకారమును మానవ బాహుబల విక్రమతేజోరాశిచే నాశమొనర్చిన వీరవరులా వారు? ముప్పది వర్షముల మహాస్వప్నము నేఁడుగదా సత్యమైనది! మానవ జీవితచరిత్రలో నీదినము నిజముగ సుదినము. ఈ సుదినమున కింతటి యజరామర కీర్తి గడించి తెచ్చిన మహావీర వరేణ్యు లెంతటి పూజ్యులు? ప్రపంచ వీరగాథలలో నీ యెవరెస్ట్ శిఖరారోహణగాథ యత్యంత ప్రాశస్త్యముతో వెలుఁగఁ గలదు. నేఁడు మొదలు ప్రపంచమునఁ గల వింత లెనిమిది!! శిఖరాగ్ర మధిరోహించినపుడు దా నెట్టి యనుభూతినిఁ బొందెనో ఎడ్మండ్ హిల్లరీ యీక్రింది విధముగ వర్ణించి యున్నాఁడు: "శిఖరాగ్రముపై నా పాదము లానుటతోడనే గొప్ప భార మెద్దియో నన్ను వీడి పోయినటు లనిపించినది. ఇఁక మీఁదట మంచుపై మెట్లు చెక్కుట పర్వతశ్రేణుల నెగఁబ్రాకుట, విజయసాధనా సంబంధమైన కౌతుకముతో డోలాయమానమానసుఁడ నగుట యను భారము లెవ్వియు నన్నుఁ బీడింపఁజాలవు. అంతట నేను నా సహచరుఁడైన టెన్జింగ్‌ను జూచితిని. ఆతని వస్త్రములు, కంటియద్దములు, ప్రాణవాయు సాధనములు, సన్నని మంచు దారములచేఁ జుట్టఁబడియున్నవి. అవన్నియు నతని ముఖమును గప్పియుండెను. అయినను నతఁడు నలువైపులఁ బరికించి చూడఁగా, నతఁ డనుభవించిన యనిర్వచనీ యానంద మతని మందహాస పరంపరలో గోచరమగుచుండెను. మే మిరువురముఁ బరస్పర కరచాలన మొనరించితిమి. టెన్జింగ్ నన్నమాంతముగఁ గౌగిలించికొనెను. మేమిరువుర మొకింతసే పా కౌఁగిలి వీడక నొకరినొకరు వీపులఁ జరిచికొనుచుంటిమి. నాచేతి గడియార మపుడు పదునొకండు

న్నర గంటలు సూచించుచుండెను. అనఁగా దక్షిణశృంగాగ్రమునుండి వేయి యడుగుల దూరము — నెక్కివచ్చుటకు మాకు రెండున్నర గంటలు పట్టినది. కాని యాస్వల్పకాలమే మా జీవితకాలమని యపు డనిపించెను. నా ప్రాణవాయు సాధనములఁ దీసివైచితిని. చొక్కా లోపల స్వకీయ ఛాయాగ్రాహక యంత్రమును మంచుప్రభావ దుష్ఫలితము లేవి యంటని యటు దాచి యుంచితిని. దాని నిండుగ వర్ణ చిత్రముల ఫిలి (Colour Film) యుండెను. టెన్జింగ్ చిత్రమును దీయఁదలఁచి యాతని సిద్ధపడుమంటిని. టెన్జింగ్ శిఖరాగ్రముపై నిలిచి తనమంచుగొడ్డలికిఁ జుట్టిన భారతీయ నేపాళ ఆంగ్ల ఐక్యరాజ్య సమితి పతాకముల నావిష్కరింప నాతని చిత్రమును గ్రహించితిని. అంత దిగంత పర్యంతము వ్యాపించిన పర్వతముపై నాచూపు ప్రసరించెను.

మాకుఁ దూర్పున మకాలుశిఖర మున్నది. ఇంతవఱ కది పరిశోధనభాగ్య మొందలేదు. ఆశిఖరారోహణ మార్గ మేదైనఁ గలదా యని యాలోచనా పరవశహృదయుఁడనైతిని. అటనుండి బహుదూర మునఁగల కాంచనజంఘా, చోహాయు, శిఖరములు, నేపాళ పర్వత శ్రేణులు, నార్త్‌కాల్ పర్వతము, ఎవరెస్ట్ పూర్వమార్గము, నా కగపడుచుండెను. ఆసుందర దృశ్యముల నాయంత్రముతోఁ జిత్రించితిని. పదినిముసము లిట్లు గడిపిన యనంతరము నా కాయాసము రాఁదొడఁగెను. అందుచేఁ బ్రాణవాయువు గొంచెము గ్రోలితిని. మేము సౌత్ కాల్ శిబిరమునుండ సర్ జాన్ హంట్ నన్ను బిలిచి, నాచేతి కొక చిన్న సిలువ నిచ్చి శిఖరాగ్రమునకు దానిఁ గొని పొమ్మనెను. తదాజ్ఞానుసారము దానిని శిఖరాగ్రమున నొకచోఁ బాతితిని. మా ప్రాణవాయువు క్రమముగ క్షీణించుచుండెను. ఇఁక నాలసించిన ప్రమా

దము దప్పదని త్వరితముగ దక్షిణశృంగము దాటఁ గలిగితిమా, ప్రాణదములగు తత్సాధనములు మాకు లభింపఁగలవు. దానఁజేసి వేగిర పడవలసివచ్చెను. అందుకు దోడుగా మా కాయాసము హెచ్చు చుండెను. సహజపరిస్థితులలో మార్పు వేవేగముగ వచ్చుచుండెను. ఇఁక నాలస్యమేమిలేక తిరోగమింపవలయును. ఈతొందరలోనే మేలరీఇర్విసుల చిహ్నము లేవైన నటు గన్పించునేమో యను కౌతుక మెలయ నలువైపులఁ గలయజూచితిమి, ఫలితము శూన్యము. పదు నైదు నిముసములపాటు నటఁ గడిపి శిబిరోన్ముఖుల మైతిమి."

అదిగో, యతఁడే మన పర్వతారోహకశిఖామణి ! షేర్పాకుల రాజన్మణి ! నేఁడుగదా యాతని జీవితవాంఛ నెఱవేరినది. తన కోర్కె నెఱవేరునా యను శంకతోఁ గుములుచుండిన టెన్‌జింగ్ ఇపుడు ఎవరెస్టు శిఖరాగ్రముపై పతాకచతుష్కావిష్కరణఁ జేయు చున్నాఁడు. నిరుపమానాదృష్టము కేవల మొక వస్తు వాహకుఁడైన టెన్‌జింగునకే లభించుట యెంతటి భారతదేశ చరిత్రాత్మక విశే షము ! ఆతని యచంచల దీక్షా పరతంత్రతయేకదా యీమహాభాగ్యో దయమునకు మూలకందము. శిఖరాగ్రముపైఁ గాలు మోపిన యనం తరము నతఁడేలొకో యుత్తర దిశగా వెడలి దేనినో మిక్కిలియానతోఁ గలయఁ జూచుచున్నాఁడు. ఇతఃపూర్వము దాను ఎవరెస్ట్ యాత్రిక దళములతోఁ బర్వతమధిరోహించిన మార్గముల గుర్తించుట కొఱ కేమో ! అప్పటి శిబిరస్థలములన్నియు నతని కెఱుకయే, ఎచ్చటో, పది, పదుమూడు వేల యడుగుల లోతున నక్షత్రము వలె నొకచుక్క హిమాచ్ఛాదిత పర్వతోత్తుంగ సీమలో మిన్కుమిన్కు మనుట యతఁడు చూచెను. బొమలు ముడిచి, పరికించి, చూడ నతనిహృదయ క్షేత్రము భక్తిరస ప్రవాహప్లావిత మయ్యెను. ఇట్టి భక్తి రసోద్భవ

మున కేది కారణము......గౌతమబుద్ధుని పాదసేవకుల కాత్మానంద జనకమగు రాంగ్‌బక్ మఠమున కన్న మఱేమికారణ ముండఁగలదు? ఆ దివ్యస్థల దర్శన మాత్రముననే టెన్జింగ్ హృదయ కమలము భాను దర్శన భాగ్య లాభమునఁబలె వికసించెను. తన జీవిత వాంఛఁ దీర్చుటకై బుద్ధభగవానునిఁ బ్రార్థించి యాశీర్వదించిన మఠాధిపతి వాసస్థానమది. ఇదివఱలోఁ దానెన్నిసారులో యాతని దర్శించినాఁడు. తన బంధువులలోఁ గొందఱు మఠాధిపతులుగ నున్నారు. తద్దర్శన మాత్రముననే భక్త్యావేశము నవకోమల హృదయ కమల పరాగ పరంపరల రూపమున వెలువడెను. ఆతఁ డా భక్తిరస పూరిత వివశుఁడై యెదుట దిక్చక్ర పర్యంత విస్తృతిఁ జెందిన టిబెట్ నేపాలదేశదృశ్య సంపదఁ గాంచెను. అతిలోక సుందర శిఖరమను ప్రఖ్యాతిఁ గనిన కాంచన జంఘాశిఖరమును జూచెను. ఆతని మానసాకాశములో నింక మధురస్మృతిరేఖ లెన్ని యుదయించెనో!

అతఁడే యాబుద్ధ భగవానుని పాదదాసుఁడు. ఆతని ముఖ మండల మతి నిర్మల గాంభీర్యముఁ దాల్చినది. ఏదియో కారణము! రసావేశ పూరితుఁడై నాఁ డతఁడు. అవిగో! ఆనేత్రాంచల వీచికలలోఁ బరమభక్తి పారవశ్యము కన్పించుచున్నది. ఏదివ్యస్మృతులు, నేదివ్య శక్తు లాతని హృదయమున నీసంచలనము గలుగఁజేయుచున్నవో? అతఁ డేలొకో, శరీరము వంచి, శిఖరాగ్రముపై నొకచో మంచుఁ బెక లించి, గోతినిఁ ద్రవ్వినాఁడు? ఆగోతిలో బిస్కత్తులు, నాహారము, చాకలేట్లు, మొదలైన తినుబండములు దాచినాఁడు. ఏమి, యీాతని యీావిచిత్రకార్యము! ఓహో! నిజమనోరథ ఫలసిద్ధుఁడౌటచే, సత్యు న్నత నీహార శిఖర సింహాసనాసీనయగు భూదేవి కీతఁ డర్పించు నిజ కృతజ్ఞతాపూర్వక మహానైవేద్యమా యది!! అత్యున్నతస్థితి కెగసి

వచ్చినను, నాతని హృదయ మహంభావ పూరితముగాలేదు. ప్రపంచ మిపు డతని వేనోళ్ళఁ బొగడుచున్నది. ప్రపంచ సుమహత్తరకార్యసాధకు లలో టెన్జింగ్ నేడొక ప్రముఖస్థాన మాక్రమించినాఁడు. అహహో! ఏమి యీావస్తువాహకుని యదృష్టఫలానుభూతి.

ఎవరెస్ట్ యాత్రా విజయముఁ జేకూర్చికొని నేపాళ దేశములో ఖాట్మాండూ నగరమునకు మఱలివచ్చుచుండఁ, బత్రికా విలేఖకు లెందఱో టెన్జింగ్ హిల్లరీలపైఁ బ్రశ్నల వర్షించిరి. ఆప్రశ్నోత్తరముల మూలముగ నెన్నియో విషయములు మన కెఱుక పడుచున్నవి.

త్యాంగ్‌బోచ్ మఠములో బౌద్ధమతాధిపతుల సమక్షమున విశ్రాంతిఁ గొనుచుండగా, హిల్లరీనొక విలేఖకుఁడు ఎవరెస్ట్ శిఖరాగ్రముపై నుండగా నతఁ డెట్టి యనుభూతుల నొందెనో తెలుపవలసినదిగ నడిగెను. ఆపృచ్ఛకునకు హిల్లరీ యి ట్లుత్తర మొసఁగెను. "శిఖరాగ్రముపై నేనెంతయో హాయి ననుభవించితిని. ఆనాఁటి వాతావరణ మత్యంతానంద దాయకముగ నుండెను. గాలి మందముగ వీచుచుండెను. దక్షిణశృంగము పైఁగల పర్వతభాగము, ఆల్ప్స్ పర్వతములవలె, నధిరోహించుట కష్టతరముగ నుండెను." అట్లు టెన్జింగును బ్రశ్నింప — "ఆనాఁ డాకాశవీథిలో సూర్యుఁ డెంతయో కాంతిమంతముగ నొప్పుచుండెను. మచ్చునకైనను మబ్బుతునక గానరాదయ్యెను. పవనములు మందముగ వీచుచుండెను. నేను సువిశాలమైన టిబెట్, నేపాల్, కాంచనజంఘా, రాంగ్‌బక్ మఠదృశ్యములఁ దనివిదీఱఁ జూచితిని. అట నేనున్నంత కాలము ప్రాణవాయు సాధనముల నుపయోగించుచునే యుంటిమి," యని చెప్పెను. మఱియొక ప్రశ్నకు టెన్‌జింగ్ ఈక్రిందివిధముగఁ బ్రత్యుత్తర మొసఁగెను. "శిఖరాగ్రము పైనుండి కాన్పించు దృశ్యము లతిమనోహరములు;

కాని నాకేలకో, యానందానుభూతి కలుగలేదు. పర్వతావరోహణలో నెన్నియో ప్రమాదము లున్నవను భావము నన్ను కొలఁదిగ వేధింపసాగెను. దిగువ శిఖరములఁ జేరిన పిమ్మటనే నేనత్యంత మోదమయాత్మకుఁడ నైతిని." ఎడ్మండ్ హిల్లరీని గురించి ప్రస్తావింపనాతని ధైర్యసాహసములఁ గొనియాడి యాతఁడు దన ప్రాణమిత్రుఁడని చెప్పెను. మఱియొకచో శిఖరారోహణ సంబంధవిషయములఁ బ్రస్తావించుచు శిఖరాగ్రము నేర నరుగునపుడు దాను, దన సహచరుఁడును సమయసందర్భములఁ బట్టి యొక్కొక్క రొక్కొక్కప్పుడు నాయకత్వము వహించుచుఁ జిట్టచివర కించు మించు నేకముహూర్తముననే శిఖరాగ్రము నధిరోహించితిమని టెన్‌జింగ్ వక్కాణించెను.

టెన్జింగ్ హిల్లరీ లిరువురు శిఖరావరోహణముఁ బ్రారంభించిరి. ప్రాణవాయువు దక్షిణశృంగమును జేరకమున్నె పూర్తిగ వినియోగమగునేమో యను భయము వారిని వేధింపసాగెను. అందుచేఁ బోయిన త్రోవనే వేగముగ వారు వచ్చుచుండిరి. అట్లు వచ్చుచుండగా నిదివఱలోఁ బ్రాణములపై నాశవీడి ధైర్యసాహసములతో నధిరోహించిన శిల వారి కెదురయ్యెను. కాని పూర్వమువలె వారి కిపు డది భీతిఁ గొల్పుటలేదు. పూర్వపరిచయముచే నాయవరోధ మిపుడు వారి దృష్టిలో హాస్యాస్పదముగ నుండెను. సునాయాసముగ వారు దానిని దాటి సుమారొక గంటలో దక్షిణశృంగమును జేరిరి. అటఁ గొన్ని పానీయములఁ గ్రోలి విశ్రమించి బయలుదేఱిరి. దక్షిణశృంగమునకు దిగువభాగమున భయోత్పాతము గొల్పు నేటవాలు ప్రదేశము గలదు. అతిజాగరూకతతో వారా యేటవాలును గడచి దిగి వచ్చిరి. అప్పటికే వారు మిక్కిలి యలసి యుండిరి. తొమ్మిదవ శిబిరము సమీపములో నుంట నెట్లో యోపికఁ బట్టి యటఁ బ్రాణవాయుసాధనములఁ గైకొని

వారు దిగివచ్చిరి. ఆశిబిరముకడ మఱికొంత విశ్రాంతిఁ గొని సౌత్ కాల్ శిబిరమునకు బయలుదేఱిరి.

సౌత్ కాల్ శిబిరమునుండి కొందఱు శిఖరాగ్రము వీడి తిరోగమించు టెన్జింగ్ హిల్లరీలకొఱకు కౌతుకాయత్తచిత్తులై వేచి యుండిరి. వారిరువురు తొమ్మిదవ శిబిరమునఁ గల గాలి పరుపులు పడకసంచులు మోసుకొని బయలుదేఱిరి. ఈభారము వారికి మిక్కుటమయ్యెను. శారీరకశ్రాంతిచేఁ బరిపీడితులౌ వారికీ వస్తువులు గొండంత బరువై వారి నిర్గమన వేగమును నాటంకపఱచుచుండెను. స్విస్ శిబిరస్థలమున కావలఁ బవనవేగముచే వారిదివఱలో శిఖరారోహణ మొనర్చినపుడు చేసికొనిన మెట్లు పూడిపోయెను. నున్నపైన యేటవాలు వారి ముందు మెఱయుచుండెను. మఱల నట మంచును బగులఁగొట్టి మెట్లు చెక్కనిదే వారు దిగిరాలేరు. పర్వతము దిగి వచ్చునపుడైనను వారికిట్టి కష్టములు దప్పలేదు. అట్లు మెట్లునేసికొనుచు దిన్నగా సౌత్ కాల్ శిబిరమును జేరిరి. జార్జ్‌లో వారి కెదురేఁగి వేడివేడి పానీయమును ప్రాణవాయువును వారి కాప్యాయముగా నొసంగెను; గాని టెన్‌జింగ్ హిల్లరీలు మాటలాడ లేనంత బడలియుండిరి. అందుకు దోడుగా వారి ప్రాణవాయు సాధనములు సెడియుండెను. ఆశిబిరము గొంచె మెత్తులో నున్నది. నడచుటకే శక్తి లేనివారా శిబిరమున కెట్లు పోఁగలరు? అన్యోపాయము లేక హిల్లరీ టెన్జింగు లిరువురు నేలపైఁ బడి చిన్నగఁ బ్రాకుచు శిబిరమును బ్రవేశించి మాఱుమాటాడక పడకసంచులలోనికి దూరిరి.

వారికిపుడు వలసినది పరిపూర్ణ విశ్రాంతి. దాని కెట్టి యవరోధము నుండరాదు. మంచి యాహారము, గాఢనిద్ర, వారి ప్రాణములఁగా పాడఁగలవు. కాని ఎవరెస్ట్ శిఖరారోహణము మన కవసర

మైన శాంతిసౌఖ్యములఁ గోరినదే తడవుగ నీయఁగల వరప్రసాదిని కాదు. తగిలిన వ్రేలికే తగులు నను సామెత యా యిరువురి పట్ల నా రాత్రి సార్థక మయ్యెను. గుడారముల వెలుపలఁ బ్రచండ వాయవ్య పవనములు తీవ్రగతిఁ జలించుచున్నవి. శీతలము మహాభీలముగా నుండెను. ఆరాత్రిఁ దమ యనుభవముల నిట్లు హిల్లరీ వర్ణించియున్నాఁడు. " మిక్కుటమగు చలిబాధచే మాకు నిద్రపట్టలేదు. దీనికి సహాయముగ నుత్తేజకరములైన మా విజయ ఫలితములు తోడైనవి. ఆనాఁడు మే మెదుర్కొనిన ప్రమాదములు, ధైర్యసాహసములతో మేము వానినిఁ దప్పించుకొనిన విధము, నప్పటి మా యాందోళన మఱల మఱల మా స్మృతిపథములో మెలఁగుచుండుటచే మాకు నిద్రాభంగము కలిగెను. ఒకవైపు చలి బాధతో గడగడ వణఁకుచున్నను, మే మొకరితో నొకరము నాఁటి యపూర్వమహాభయంకర సంఘటనలం గూర్చి గొణుఁగుచుఁ గొంచెము గొంచెముగ నిద్రించితిమి. "

హిమాలయ మహోత్తుంగ శిఖరారోహణానంతరము లోకబాంధవుఁడు ప్రాగుదయాద్రిపైఁ దనయరుణ కిరణపుంజముతోఁ బ్రథమ దర్శన మొసంగుచుఁ, దన శాత్రవ శిఖరరాజ గర్వాపహారుల బాధఁ దొలఁగించుచు నుండెను. అష్టమశిబిరవాసు లెల్ల రంతమేల్కాంచిరి. గతరాత్రి సుఖనిద్రలేమి, వారు చాల నీరసముగ నుండిరి. అయినను సౌఖ్యరహితమగు నాపర్వతముల వీడి యెప్పుడు మానవసంచారముతోఁ గలకలలాడు జనపదముల కేగుదుమా యను తహతహతో నువ్విళులూరు యాత్రికులు శారీరకశ్రాంతి బలీయముగ నున్నప్పటికిని బ్రయాణ సన్నాహము లొనర్చుట ప్రారంభించిరి.

# 14

## వీర పూజ

నాల్గవ శిబిరములో సర్ జాన్ హంట్, చార్లెస్ ఇవాన్స్, టాంబోర్డిలాన్, మొదలైనవారు విశ్రాంతి ననుభవించుచుండిరి. వారి మనసు లన్నియు ద్వితీయ శిఖరాగ్రారోహణ ప్రయత్నముపైనే కేంద్రీకరించియున్నవి. టెన్జింగ్ హిల్లరీలు సౌత్ కాల్ శిఖరమునుండి పురోగమించిరా! వాతావరణ మనుకూలముగ నున్నదా? తదారోహకు లారోగ్యముగ నున్నారా? యను సమస్యలు వారి హృదయములం బొడముచుండెను. కౌతుకాయత్త మనస్కులై వారు నిమిషమొక యుగముగ గడపుచు విజయవార్తల కెదురుచూచుచు నుండిరి. విల్ఫ్రెడ్ నాయిస్ సప్తమశిబిరమున కేగునపుడు శిఖరారోహకుల విజయవార్త లాలస్యము లేక తమకుం జేరంగల సదుపాయములం గొన్ని సర్ జాన్ హంట్ వానికిం జెప్పెను. మే నెల యిరువది తొమ్మిదవనాంటి యుదయమునుండి నాల్గవ శిబిరవాసులు విల్ఫ్రెడ్ నాయిస్ చూపింపంగల గుర్తులకై సౌత్ కాల్ లోట్సె పర్వత శిఖరముఖములం దనేక ధ్యానములతో నెదురు సూచుచుండిరి. అస్తమానమువఱ కిట్లు ప్రయాసపడిరే కాని, యడియాసలయ్యెను. ఆరాత్రిం దచ్చింతాపరంపరాహతులౌట వారు మఱునాం డుదయము తొమ్మిగంట లగుసరికి లోట్సె శిఖరముఖ భాగముపై నెవరో యైదుగురు వ్యక్తులు దిగి వచ్చుచున్నట్లు వారి కగపడెను. జయాపజయము లెట్లున్నను, నంతఱు సురక్షితముగం దిరిగి వచ్చుచున్నందులకు వార లెంతయో సంతసించిరి. కించిత్కాలానంతరము సప్తమ శిబిరమును వీడివచ్చువారు, హిల్లరీ, టెన్జింగ్, పసాంగ్, ఫూతార్, అనువారని చూచాయమైం దెలిసికొనిరి. జయాప

జయముల విషయమేమి? ఇంతవఱకావిషయమైన గుర్తులేవియుఁ గానరాలేదు. విల్ ఫ్రెడ్ నాయిస్ ఈవిషయమును బూర్తిగ మఱచెనేమో! హిల్లరీ టెన్ జింగ్ లఁ జూచిన కొలఁది నాల్గవ శిబిరవాసుల హృదయ పతాకలు గాలికిఁ బటపటఁ గొట్టికొనుచుండెను. అటుండ టాంస్టోబార్డ్ తనఛాయాగ్రాహక యంత్రముగైకొని చతుర్థ శిబిరోన్ముఖులౌ యాత్రికుల తిరోగమన చిత్రములఁ దీయుటకై త్వరత్వరగఁ బంచమ శిబిరమున కేతెంచుట వారు చూచిరి.

మధ్యాహ్నము రెండుగంట లయినది. అపుడే భారతీయ రేడియోశాఖవారు ఎవరెస్ట్ శిఖరారోహణ యత్నము బునర్విచ్ఛిన్నమైన దను వార్తఁ దెలియఁజేసిరి. ఈవార్త వినఁగనే వారి మనస్సులు జివుక్కు మనినవి. షేర్పాలెల్లరు గుడారములు వీడి గుమిఁగూడిరి. అందఱును నాల్గవ శిబిరమును సమీపించు యాత్రికదళము నత్యుత్కంఠతోఁ గాంచుచుండిరి. వీరి యుత్సాహమంతకంత కభివృద్ధి యగుచున్నదే కాని వీరి యాశావీక్షణల నాకర్షించు యాత్రిక దళ గమన వేగ మాశాజనకముగ లేదు. పరాజయ జనితవిచార భారముచేఁ గ్రుంగి, కృశించి, విగత బలాఢ్యులై యెటులో శాంతి సౌఖ్యాస్పదమైన గృహమును జేరఁబోవు జిత వీరులవలె హిల్లరీ ప్రభృతులు మెలమెల్లగ దిగివచ్చుచుండిరి. వారి ముఖపద్మములలో వికాసవీచికలు మచ్చునకొకటి యైనను గాన్పింపలేదు. విజయోత్సాహ చిహ్నములు గానరావు. విజయవార్తకై ప్రతిక్షణ వివర్ధమాన కౌతుకాయత్త చేతస్కులై నిరీక్షించు మిత్రబృందమును జూచియు నొక్క పలుకో! మందహాసమో! సంజ్ఞయో! చేయని తిరోగమన యాత్రిక బృందమును జూచి నాయకుఁడైన సర్ జాన్ హంట్ విచారగ్రస్తుఁ డాయెను. మఱియొక పరాజయమా! ఇంతవ్యయప్రయాస లన్నియు నేలపా

లయ్యెనే! ఇంకను మానవశక్తి యుక్తులం దనశక్తి, యుక్తులచే నీ శిఖరము పరీక్షించుచున్నదా! తృతీయ యత్నము వలయునే! ... ఇట్టి యూహాలు సర్ జాన్ హంట్ మనస్సులో నొక్కటొక్కటిగ నుద యించుచుండెను.

ఆ తిరోగమన దళమునకు బురోభాగమున, వ్యక్తి, యెవరో! హాఠాత్తుగ నొక సైగఁజేసెను. తనచేఁతనున్న మంచుగొడ్డలి నపు డపుడు ఎవరెస్ట్ శిఖరాగ్రమువైపు జడిపించుచుండెను. అతని యనుచ రులు గూడ నటులఁ జేయుచుండిరి. ఆసైగ విజయచిహ్నమే యని నాల్గవశిబిరము కడ నిరీక్షించుచుండిన వారు తెలిసికొనిరి. ఆ పూర్వ సంశయము లెల్లఁ బటాపంచలయ్యెను. అచటివారి హృదయము లుప్పొంగి పొరలసాగినవి. గట్లు ద్రెంచికొని స్వేచ్ఛగాఁ బ్రవహించు మహాప్రవాహమువలె వారియుత్సాహము కనీనికలఁ ద్రెంచికొని రాసాగి నది. వారి యానందాతిరేక వచనములు మిన్నుముట్టినవి. మైక్ వెస్ట్ వాకెట్ నిరవధికానంద భరితాత్ముఁడై హిలరీప్రభృతులఁ గలిసికొనుట కొక్క పఱుగుదీసెను. సర్ జాన్ హంట్ వాని ననుకరించెను. శిబి రము వీడి ప్రతీఁవాఁడు వెలుపలికిఁ బరువెత్తెను. అచట నానంద కోలా హాలమున కవధులేవి? టెన్‌జింగ్ హిల్లరీలను గలిసికొనిన హంట్ ప్రభృతులు దమ యానందముఁ బట్టలేక యమితముగ వారలఁ గౌగి లించికొనిరి. టెన్‌జింగ్ హిల్లరీల చుట్టు జనమెల్ల గుమిఁగూడి వారి కరచాలనా సౌఖ్యసౌభాగ్యములఁ బొంది మెల్లగా వారిని శిబిరమునకు దోడితెచ్చిరి. నాల్గవ శిబిరముకడ షేర్పా లెల్లరు వారి కత్యంత గౌరవ పురస్సరముగ సుస్వాగత మొసఁగిరి. స్వజాతీయుఁడైన టెన్ జింగ్ ఈ నిరుపమాన విజయసామ్రాజ్యమును హిల్లరీతోఁ బంచికొను టయే వారి యానందమునకు మూలకారణము.

ఆనాఁటి సాయంకాలము సర్ జాన్ హాంట్ఁ విల్ ఫ్రెడ్ నాయిస్‌ను ప్రశ్నింపగా ఎవరెస్ట్ శిఖరారోహణవార్తను సూచించు నిమిత్తమై యతఁడు రెండు పడకసంచులను నాంగ్లభాషలోని 'టి' (T) అను నక్షరాకారములో నొకస్థలమందు బదినిముసములపాటుంచితినని యతఁడు వివరించెను. ఆరాత్రిఁ బ్రస్తుత మెవరెస్ట్ యాత్రకుఁ బోషకస్థానమాక్రమించిన ఎడింబరో డ్యూక్ గారి కీ యాత్రాభివిజయసందర్భోచితముగఁ దదీయాయురారోగ్యాభివృద్ధికై దైవప్రార్థనాకార్యాచరణ చిహ్నముగఁ గొలఁది మద్యమును సేవించిరి. అటులనే యాయాత్రకు నూతనమార్గ మన్వేషించి తద్విజయమునకు గారకుఁడౌ ఎరిక్ షిప్టన్ అను వారికిఁ, బ్రారంభదశనుండి నిరంతరకృషిసల్పిన వీరవర్గమునకు, వారిధైర్య సాహసాదిక ప్రజ్ఞావిశేషములకు, వారియనుభవజ్ఞానములకు, దద్గౌరవమర్యాదా పూజాస్తోత్రాదికమునుగావించి, దీవించి, యానందించిరి. వారి యచంచలదీక్షాకృషిఫలితమా నీవిజయము వారి కెంత యానందమును గూర్చునో, యని యచ్చెరువొందిరి.

యాత్రికులెల్ల రిపుడు నిర్జనహిమవత్పర్వతసీమవీడి మనుష్యావాసముల నెపుడు సేరనేగుదుమాయను నాశతో నుబ్బెనలాడుచుండిరి. అంతియగాక వారు కొనివచ్చిన యాహారపదార్థములు మే మాసాంతమునకే సరిపోవును. ఇఁక నాపర్వతసీమలో నెక్కువకాలమున్న నాహారపుకొఱత యేర్పడుటయేగాక ఋతుపవనఫలితముగ వాతావరణము విజృంభించును. దానఁజేసి యాలస్యములేక యాత్రికులెల్లఱు దిరోగమన సన్నాహములలో నిమగ్నులై పోయిరి. ఉన్నతశిఖరముల నుండి షేర్పాదళములు సకలవస్తుసామగ్రిని బ్రథమశిబిరమునఁ జేర్చుచుండిరి. పడమటిలోయలో ఛార్లెస్ వైలీని మాత్రముంచి కొందఱు షేర్పాలసాయముతోఁ ద్వితీయశిబిరమునకు వస్తుసామగ్రినిఁజేర్ప

నియోగించిరి. యాత్రికదళము దిగువశిబిరమునకు దిరిగివచ్చుచుండఁ ద్రోవపొడుపున విచిత్రపరిణామము లెన్నియో వారు నూడఁగలిగిరి. అచ్చటచ్చట వారు నాటిన జండా లవుడు గాన్పించుటలేదు. దారిలోఁ గ్రొత్తబలము లెన్నియో రూపొందెను. అట్లు ప్రయాణముసేసి వారు జూన్ రెండవనాటికిఁ బ్రథమశిబిరమును బ్రవేశించిరి.

అది జూన్ రెండవనాఁటిరాత్రి. ప్రథమ శిబిరములోని పర్వతారోహకు లెల్లరు భోజనానంతరము రేడియోవార్తలు వినఁ గుతూహలులై రేడియోయంత్రము చుట్టును గుమిఁగూడిరి. ఎవరెస్ట్‌యాత్రలో నిదియు నొక శుభదినమే. యాత్ర జయప్రదముగఁ గొనసాగించుకొని, యెట్టి ప్రమాదము లేక సురక్షితముగ బ్రథమ శిబిరమునఁ జేరి కడు పారఁ గమ్మని భోజనము సేసి విశ్రాంతి ననుభవించఁగలుగుట యెంతటి యదృష్టమో, యెవరుసెప్పగలరు? కాని, దీనినిఁ బ్రపంచ చరిత్రలో శుభతర దివసముగాఁ జేయు విశేషము వేఱొకటి కలదు. ఇంగ్లండుదేశములో రెండవ యెలిజబెత్ రాణి పట్టాభిషేక మహోత్సవ దినమిదియే! ఆంగ్లేయుల కంతకన్న నానంద దాయకమగు దినము వేఱొకటి కలదా? ఎవరెస్ట్‌శిఖరారోహణము, సురక్షిత యాత్రిక తిరోగమనము, పట్టాభిషేక మహోత్సవము, నను విశేషాంశ త్రయము పర్వతారోహక మానసముల రంజిల్లఁజేయుచు, వారి నానందాకాశ మార్గమునకు గొంపోవుచున్నవి. వసంతునికి వెన్నెల తోడైనయట్లు ఎవరెస్ట్ విజయమునకు బట్టాభిషేకోత్సవము దోడయి వారి నానందోన్మత్తులఁ జేయుచుండెను. ఇంతలో రేడియోవార్తలు ప్రారంభమైనవి. "లండనునగరమున గత రాత్రి ఎవరెస్ట్. శిఖరారోహణవార్త చెలఁచెలఁ బ్రాకెను." యాత్రికు లీవార్త విని విస్మయభ్రాంతమనస్కులైరి. ఇంత వేగిర మావార్త లండనునగరమున కెట్లు

వ్రాసినది ? ఈ పట్టాభిషేకోత్సవము నాఁటికి ఎవరెస్ట్ శిఖరారోహణము, అను నమూల్య బహుమతిని ఎలిజబెత్ రాణికిఁ సమర్పింపవలె నను సర్ జాన్‌హంట్ కోరిక సఫల మయ్యెను.

ఇఁకముందు రాఁగల సంతోషవార్తలు వినుటకు వారు సావధానచిత్తులై యుండిరి. "ఈ విజయవార్త విని, ఎలిజబెత్ రాణి, ఆమె ప్రధానమంత్రి, ఖాట్మండూలోని రాయబారికి యాత్రికవర్గమున కందఁజేయవలసినదిగ నభినందన లేఖార్థములు పంపిరనియు లండన్ వీథులలో నీవార్త దూరశ్రవణ యంత్రముల ద్వారా ప్రజల కందఁజేయఁ బడెననియు వారి యుత్సాహాతిరేక నినాదములు మిన్ను ముట్టినవనియు వార్తలు వచ్చినవి."

వారి సంతోష మెట్టిదోకాని, యిఁక క్షణకాలమైన నా హిమ లోకములో నుండుటకు వారిచ్ఛగించుటలేదు. ఆ రాత్రి కీప్రథమ శిబిర మును విడదీసిరి. వీడ్కోలుచిహ్నముగ నొక చిన్న ఫిరంగినిఁ బేల్చిరి. భారతసైనిక శాఖ యీ యాత్రిక దళమునకు బహుమతిగా నొసఁగిన పన్రెండు శతఘ్నుల వరుసగా నొక్కొక్కరు విజయచిహ్నముగఁ బేల్చిరి. లోబూజ్ గ్రామమున సేరిన పిమ్మట నీ పనులు జరిగెను. నాఁటి యానంద రసావేశ నిమగ్నులు, షేర్పా స్త్రీపురుషులు చిత్ర విచిత్ర నాట్యభంగిమములఁ బ్రదర్శించిరి. పిమ్మట నాంగ్లేయులు జాతీయబృందగానమును గావించిరి. అట్లు వినోదములతోఁ గాలక్షేపము సేయుచు నాల్గవ తేదీనాటికి వారు త్యాంగ్‌బోచ్ గ్రామముఁ బ్రవేశించిరి.

అంతటఁ బర్వతారోహకు లచటి బౌద్ధమఠాధిపతుల సందర్శించిరి. రెండు మాసముల క్రితము ఎవరెస్ట్ యాత్రకై వెడలునపుడు సర్ జాన్‌హంట్ వారిని సందర్శించెను. అపుడు మఠాధిపతి వారిని

దీవించుచు మఠమును మరమ్మతు సేయుటకు గొంతధనము బహూకరింపఁ బ్రార్థించెను. ఆతని కోర్కెను సావధానముగ విని తమ కార్యము జయప్రద మయ్యేనేని నాకోర్కెఁదీర్ప గలనని యాతఁడా మఠాధిపతికి మాట నిచ్చెను. ఆమాట ప్రకారమిపుడు సర్ జాన్ హాంట్ అతనికి గొంతధన మొసఁగెను. ఆరాత్రి యెవరెస్ట్ యాత్రికుల వినోదార్థము గొందఱు మఠాధిపతులు విచిత్రవేషముల ధరించి వివిధ నాట్యరీతులఁ బ్రదర్శించిరి. అటనుండ ఎవరెస్ట్ యాత్రికుల నభినందించుచు ఎడింబరోడ్యూక్ వద్దనుండి వార్తలు వచ్చెను. మఱునాఁడు గ్రిగరీ, హాంట్, బోర్డిలాన్, కలిసి ఖాట్మండూ నగరమునకు బయలుదేఱిరి. సకలవస్తు పరికరములతోఁ బ్రధానషేర్పా దళములు రాఁగనే కూలీల రావించి వానిని ఖాట్మండూ నగరమునకుఁ జేర్చు బాధ్యత ఎడ్మండ్ హిల్లరీపైఁ బడెను.

దారి పొడుపున షేర్పాలు దమ యానందమును బలువిధములుగ విందులు వినోదములతో జఱుపుకొనిరి. హాంట్ ప్రభృతులు ధూధ్ కోశీ లోయను సమీపించునరికి వర్షారంభ మయ్యెను. దారి పొడుపున వర్షము వారినిఁ బలుచిక్కులఁ బెట్టెను. ఒక్కొక్కనాఁడు వారు రెండు రోజుల ప్రయాణమును జేయుచుండిరి. పరిసర పర్వత శ్రేణుల మేఘసమూహము లాచ్ఛాదించి యుంట వాని నిజరూపములు డాగియుండెను. కనుల మిఱుమిట్లు గొలుపు వన్నెచిన్నెలతో వృక్షముల పైని, నాకాశవీథులను విహరించు విహంగములను, జక్కని పుష్ప జాతులను, జిన్నచిన్న తోటలను, బచ్చనిపొలములను మొయిలు గుంపులను, వీక్షించుచు వడివడిగఁ బయనించుచుండిరి. మార్గమున ఎవరెస్ట్ వైపున కెగిరిపోవు విమాన మొకటి వారికంటఁ బడెను. అది భారత విమాన శాఖకుఁ జెందిన దనియు నెవరెస్ట్ శిఖర పరిసర దృశ్యముల

ఛాయాచిత్రములఁ దీయునిమిత్తము వెడలుచున్నదనియుఁ దెలిసికొనిరి. అట్లు పయనించుచు బదుమూఁడవనాఁటి సాయంకాలము ఖాట్మాండూ నగరమును బ్రవేశించిరి.

ఎవరెస్ట్ ప్రధానయాత్రికదళము నిదానముగ వెనుక వచ్చు చుండెను. త్రోవలోఁ బల్లెపల్లెలఁ గల షేర్పాలత్యుత్సాహ సంతోష సంభరితులై వీరికి ఛాంగ్ పానీయాదుల నిచ్చుచుండిరి. కొందఱు షేర్పావనితలు దమతమ భర్తలను, బుత్రులను, నిఁకనైన నిండ్లకు రమ్మని బ్రాథేయపడుచుండిరి. కొన్నిచోట్ల ఎవరెస్ట్ శిఖరారోహకులను గ్రామీణులు పుష్పమాలాంకృతులఁ జేసి వారి విజయమును వేనోళ్ళఁ గొనియాడుచుండిరి. ఈషేర్పా ప్రజానీకానంద సాగరము నీఁదుచు యాత్రిక దళము హూక్స్ గ్రామముఁ జేరెను. వీరినిఁ గలియుటకై సర్ జాన్‌హాంట్, ఇంగ్లండు దేశమునుండి వచ్చిన యాతని సతీమణి, జేమ్స్‌మారిస్, అను మువ్వురు ఖాట్మాండూ నగరమును వీడి హూక్స్ గ్రామమున కెదురేగిరి. ఖాట్మాండూనగరమునకు బ్రవేశించుట కిదియే చివరి మజిలీ. ఆరాత్రి యచటఁ గడిపి మఱునాఁడుదయమున నిరువది మైళ్ళ దూరమునఁ గల ఖాట్మాండూ నగరమునకు యాత్రికదళము బయలుదేఱెను. ఆ త్రోవపొడవున వేలకు వేలుగ నానావర్ణతోరణ ములుఁ, బతాకములుఁ, జక్కఁగ నలంకరింపఁబడిన సింహద్వారములు, గట్టఁబడియుండెను. లక్షలాది ప్రేక్షకులు మార్గమున కిరువైపుల బారులు దీర్చి నిల్చికొని, యాత్రికదళమును, ఎవరెస్ట్ విజేతలను, నొక పరిఁ దనివారఁ జూడఁ గుతూహల పడుచుండిరి. "నేపాల – ఉదయ తార – టెన్జింగ్ – ఆయురారోగ్యములతోఁ జిరకాలము వర్ధిలుగావుత" "వీరాధి వీరప్రియతముఁడు టెన్జింగ్ చిరకాలము వర్ధిలుగావుత" అను జయజయధ్వానములు భూనభోంతరాళములఁ బ్రతిధ్వనించుచుండెను.

"టెన్జింగ్ హిల్లరీల విజయము — కీర్తిశేషులు మేలరీ యిర్వినుల యలంకారప్రాయము" అని గోడలమీఁదను పెద్దపెద్ద కాగితముల మీఁదను, మఱికొన్నిచోట్ల వ్రాసియుండెను.

జూన్ మాసములో సిరువదేడవ దిన మది.

నేపాల్ రాజధానీ నగరమైన ఖాట్మాండూ పురోపవన ప్రాంతము కాఁబోలు! అహా! ఏమా సంబరము! ఆ సుందరనగరము సుందరతరముగఁ జేయఁబడినది. ఎటుచూచినను బచ్చనితోరణములు, రంగు రంగుల పతాకనులే. ఎవరెస్ట్ శిఖరారోహణవార్త విని, తచ్ఛిఖరారోహకు లచటికి కేతెంచుచున్నారని కాఁబోలు సంతోషమున నవి గాలిలో నెగురుచున్నవి! ఏమా ప్రజ! ఎక్కడిదీ ప్రజామహాసముద్రము. వీరెల్ల ఆ ఖాట్మాండూ నగరవాసులేనా! ఆబాలగోపాల మీ పురవీథులనిలిచియున్నదే! ఏమది! ఉన్నటులుండి వీ రేలొకో ద్విగుణీకృతోత్సాహులగుచున్నారు. ముంగాళ్ళ నిలిచి నిన్నో తదేక ధ్యానమునఁ జూచుచున్నారు! ఆవింతయేమి!!..... ఏమది! భూమ్యాకాశములఁ బ్రతిధ్వనించుచున్నదే వీరి కోలాహలము! చేతులు విసరుచున్నారు! జయజయ ధ్వానముల నెలుగెత్తి చాటుచున్నారు. పెద్దలాశీర్నినాదములఁ గావించుచున్నారు. యువకులు మహోత్సాహపరవశులై మోదాబ్ధివీచికల నుయ్యాలలూగుచున్నారు. పిన్నలు గేకలిడుచున్నారు. పురస్త్రీలు మందహాసరుచిరాననాబ్జలై, సంతోషానురాగ రసమయ దృక్కులఁ జూచుచున్నారు. ఇందఱ యభిమాన గౌరవములఁ జూఱఁగొనిన మహాపురుషులెవరో!!

ఎవరుందురు? ఎవరెస్ట్ విజేతలు టెన్జింగ్ హిల్లరీలు గాక, వారే! వారు విజయలక్ష్మీసమేతులు, ఖాట్మాండూనగర ప్రవేశము గానున్నారు. అట్టి మహావీరుల కిట్టి స్వాగతోత్సవ పరంపర చాలునా;

ఆహా! ఈ ప్రేక్షకుల యుత్సాహ పరంపర చాలునా! ఆహా! ఈప్రేక్షకుల యుత్సాహ మెంతటిది! వందలాదిగ టెన్జింగ్, హిల్లరీ, సర్ జాన్ హంట్ కంఠసీమల, వికసిత పుష్పహారముల నలంకరించు చున్నారు. అబ్బా! ఆ పుష్పహారముల భారము నెట్లు మోయు చున్నారో? ముద్దరి నొసళ్ళుఁ గొందఱు గుంకుమ బొట్టులఁ బెట్టుచున్నారు. ఏమి, కన్నులపండుగ! ఎంతటి దృశ్యము! ఈ దృశ్యముఁ జూచినవా రేమినోములు నోచినారో! అనుపమాన స్వాగత మహోత్సవ మిది.

అదిగో! ఆమూలల, వివిధ కుసుమాలంకృత రాజరథము! కనుడు! ఆ త్రిమూర్తుల నారథమునఁ గూర్చుండఁజేసినారు. అం దాసీనులగుట యెంతటి మహాభాగ్యము! ఆ రాజరథము కదలినది. దాని ప్రాగ్భాగమున రాజమర్యాదా చిహ్నములు, సైనిక వాద్యములు మ్రోయుచున్నవి. మఱి యింతటి విజయసామ్రాజ్యలక్ష్మినిఁ జేపట్టిన వీరసార్వభౌముల కీపాటి రాజమర్యాదలు వలదా! ఖాట్మాండూ రాజ వీథులలో నా రాజరథము సాగుచున్నది. ఇఁక నీ దృశ్యము నేమని వర్ణించుట. దారిబాట కిరువైపుల నపరిమిత ప్రజాసమూహ మీ నిరుపమాన మహోత్సవమును జూచుటకై యెంతకాలము వేచి యున్నదో! మేడలు, మిద్దెలు, గవాక్షములు, వృక్షములు దమతమ నిజరూపములఁ గోల్పోయినవి. బాలవృద్ధ స్త్రీపురుష భేదములేక, యెచట సందుదొరికిన, నచటఁ గదలక, మెదలక గూర్చుండి యున్నారు. వృక్షములపై నున్న నంఖ్యా తత్పత్రముల మించినది. ఆ రథములో టెన్జింగ్, హిల్లరీ, హంట్, టెన్జింగ్ కుటుంబము, నాహ్వానసంఘాధ్యక్షుఁడు, గూర్చుండి యున్నారు. రథము పుర వీథులఁ గదలుచుండ టెన్జింగ్ లేచి నిలిచి ప్రేక్షక జనములకు నమ

స్కృతు లొసర్చుచున్నాఁడు. రథము సాగుచునే యున్నది. గమ్య స్థాన మేది? ప్రజల యానందరసోద్రేకసినాదములు ముల్లోకముల మేల్కొల్పుచున్నటు లున్నవి.

అల్లది యొక సింహద్వారము. వెదురు కలపల నిర్మాణము. కాని యేమావిచిత్ర వర్ణచిత్రములు. దివ్యసౌందర్య ముట్టిపడు నా చిత్ర లేఖన మే కళా తపస్వి నైపుణ్యఫలితమొ? అదియే విజయద్వారము. ఎల్లొకో దానిఁ జూడ మానవ నిర్మితముగఁ దోఁచుటలేదు. ఆద్వారము కడ నెవరెవరో గొప్పవ్యక్తులు వేచియున్నారు. ఇప్పటి కీరథ మైదు మైళ్ళ దూరము పయనించి యీద్వారముకడ నాగినది. ఆవ్యక్తులు నేపాళ ప్రధానమంత్రి శ్రీకోయిరాలా, భారత దేశపు రాయబారి శ్రీగోఖలే, బ్రిటను రాయబారి శ్రీసమ్మర్ హేస్. ఈ రథము వెంట మఱికొన్ని మోటార్లు వచ్చుచున్నవి. వానిలోఁ దదితర యాత్రికు లాసీనులై యున్నారు. ఈ ఘన విజయమునకు వారి నిస్స్వార్థసేవయే కదా మూలకందము. ఆ ప్రేక్షకులెల్ల రహింసాధర్మపాలనాహస్తములఁ జప్పట్లు జఱచుచు నాత్రిమూర్తుల శుభాక్షతలు, నాణెములు వర్షించు చున్నారు. ఇదియేకదా భారతీయ వీరపూజ. అదిగో రాజప్రాసాదము కడ నాగినది. రథములోనుండి వారిని దింపి, యథోచితగౌరవముగఁ ద్రిభువన రాజసమక్షమునకు గొంపోయిరి.

అయ్యదియే త్రిభువన రాజసింహదర్బారుశాల. నాఁడది యెంత సౌందర్యముగ నలంకరింపఁబడినది. త్రిభువన మహారాజు, నాతని మంత్రులు, రాజన్యులు, నధికారులు, నితరప్రేక్షకుల నుచితాసనాసీను లైరి. పర్వతారోహకులకు నారాజశిఖామణి హృదయ పూర్వక స్వాగత మొసఁగెను. అద్వితీయ సౌందర్యమున నొప్పారు నాదర్బా రులోఁ బర్వతారోహకులు విచిత్రవేషధారులవలెఁ బ్రవేశించిరి. వీరా!

మూడువారముల తరఁబడి సాంద్రారణ్యములు, నున్నతపర్వతశ్రేణులు, నఘాతమైనలోయలు, నతిశీఘ్రగమన గంభీరవాహినులు దాటుకొనుచు, మాసిన గుడ్డలు, పెఱిగిన గడ్డములు, జీర్ణపాదరక్షలు, వాడిన ముఖములుగల యెవరెస్ట్ యాత్రికులు! కాని యావీరవరేణ్యులకు వన్నెయు వాసియు దెచ్చినది యీవేషములేకదా! మహారాజు పర్వతారోహకుల సత్కరింపనున్నాఁడు..... షేర్పా టెన్జింగ్ నార్గేకు నేపాళతార యను బిరుద మొసఁగుచు నీతఁడు నీవు నేపాల గౌరవప్రతిష్ఠలను మఱింకొంచె మున్నతస్థితికిఁ గొనిపోఁ గలిగితివి. అని చెప్పెను. కల్నల్ సర్ జాన్‌హంట్‌ను జూచి 'మీరు నక్రమపద్ధతిలో నీ యాత్రను జయప్రదముగఁగొనసాగించి నేపాల్ బ్రిటన్‌దేశగౌరవప్రతిష్ఠల యభివృద్ధికిఁ దోడ్పడినారు' అని పలికెను. ఎడ్మండ్ హిల్లరీకి 'నేపాలతార' యను బిరుదు నొసఁగుచు నటులే యాతనిఁ బ్రశంసించెను. ఇవిగాక నేపాల ప్రభుత్వము టెన్జింగ్ నార్గేకు బదివేల రూప్యములు బహుమతిగ నొసఁగినది. నేపాల మహారాణి సర్‌జాన్‌హంట్ హిల్లరీలకు రత్న ఖచిత ఖుక్రీల బహూకరించెను. తదితర పర్వతారోహకులకు రత్న ఖచిత పేటికలను బ్రసాదించెను. మహారాజు హంట్ హిల్లరీలకు 'గోర్కా, దక్షిణబాహు' బిరుదుల నొసగెను.

ఎవరెస్ట్ విజేతలకు రాజసమ్మానకార్య సందర్భమునఁ బ్రధానామాత్యుఁడు, శ్రీ యం. పి. కోయిరాలా యిట్లు ప్రసంగించెను. "ఈమహావిజయమునకుఁ దోడ్పడిన మీ ధైర్య సాహస సహనములఁ జూచి మేము మిక్కిలి యాశ్చర్యపడుటయే గాక, మిమ్ముల నెంతయో బ్రశంసించుచున్నాము. ఈవిజయసాధన భారతీయాంగ్ల నేపాళదేశముల పరస్పర నిస్స్వార్థ సహకార సత్ఫలితమే యని చెప్పవలసియున్నది. ఈ సహకార మంతర్జాతీయ భ్రాతృసహకార సుహృద్భావ చిహ్న

మనియుఁ జెప్పవలయును. టెన్జింగ్ నేపాళదేశీయుఁడనియు, నేపాళ దేశములో వెలసిన యత్యున్నత శిఖరాగ్ర మధిష్ఠించి, యట జాతీయ పతాకముల నాటినాఁడనియు నేపాళీయులు గర్వపడుచున్నారు. న్యూజీలాండ్ దేశీయుఁడైన ఎడ్మండ్ హిల్లరీ టెన్జింగ్ సహితముగ ఎవరెస్ట్ శిఖరాగ్ర మధిరోహించిన వీరుఁడని మేము గర్వపడుచున్నాము. సర్ జాన్‌హంట్ పట్లగూడ మాకట్టి భావమే యున్నది. అతని యసామాన్య నాయకత్వము, నల్పానల్ప విషయ శ్రద్ధాశక్తులు, వినా, యీ యాత్ర జయప్రద మయ్యెడి కాదు. ఇంకను నీవిజయ సాధనకు సర్వశక్తుల నిర్వీరాము సేవఁ జేసి సత్యాన్వేషణ మానవశక్తి కనన్యకీర్తి గడించిన పర్వతారోహక షేర్పా వీరవర్గముల మే మెన్నటికిని మఱువఁజాలము. ఈయెవరెస్ట్ విజయసాధకులఁ బ్రథమముగ సత్కరించు నదవకాశము మాకే దక్కినందుకు మే మెంతయు సంతసించుచున్నాము. ”

నేపాళ మహారాణి యొసగిన రత్నఖచిత ఖుక్రీ — ( బాకు ) నందికొనుచు “ నాకీ ఖుక్రీ యెంతటి ప్రీతికరమైనది ! దీనిని మించిన బహూకరణ లేనేలేదు ! ” అని సర్ జాన్‌హంట్ పలికెను. ఖుక్రీ నేపాళ పురాతన వీరచిహ్నము.

పర్వతముల నధిరోహించు నపు డెట్టి వేషముల ధరింతురని యడుగ హంట్ హిల్లరీ టెన్జింగులుఁ దద్వేషముల ధరించి దర్బారులోఁ బ్రదర్శించిరి. తరువాతఁ బర్వతారోహకులు నాలుగు దినము లా నగరమున నుండిరి. ఎంద తెందఱో ప్రసిద్ధవ్యక్తులు, సంస్థలు, బహురమ్యముగ వారిని సత్కరించిరి. ఖాట్మాండూ నగరమును వీడునపుడు యాత్రిక దళము చీలిపోయెను. ఛార్లెస్ వైలీ, మైక్ వార్డ్ లిరువురు సామానుల భద్రముగ నింగ్లండునకు జేర్చ నియమితులైరి. హిల్లరీ, సర్ జాన్‌హంట్, అతని సతీమణి, టెన్జింగ్, అతని కుటుంబము కలసి

విమానములోఁ గలకత్తా నగరము నేరిరి. పశ్చిమ బంగాళాగవర్నరు, కలకత్తా పురపాలక సంఘము వీరికి బహువిధ సత్కారములఁ జేసిరి. ఆ నగరములో వారుండిన మూఁడు దినములలో నూపిరి ద్రిప్పికొనుట కైన వ్యవధి లేనట్లు స్వాగత సభలను, నల్పాహారపు విందులను వా రంగీకరింపవలసివచ్చెను. బంగాళయువకుల నీ శిఖరారోహణ మెంతయో యుత్తేజపఱచిన దనియు, వారి హృదయ నైర్మల్యము దన్నెంతయో యాకర్షించినదనియు సర్ జాన్ హంట్ తెలిపియున్నాఁడు.

ఈ విధముగ సత్కారముల నందుచు జూన్ ఇరువదేఁడవనాటికి యాత్రికదళ మంతయు ఢిల్లీనగరమునఁ గలిసికొనెను. భారత రాష్ట్రపతి ప్రభుత్వ యాజమాన్యమున నెవరెస్ట్ యాత్రిక విజేతల నిరువది తొమ్మిదవనాఁ డుచిత రీతిని సత్కరించెను. వారికి శ్రీ రాజేంద్ర ప్రసాద్ రజత పతకముల నొసఁగెను. పండిత జవహర్లాల్ నెహ్రూగూడ వీరి నెంతయో గౌరవించెను. ఇవిగాక ఎవరెస్ట్ యాత్రికు లిదివఱలోఁ గని విని యెఱుఁగనంతటి యసంఖ్యాక ప్రజానీక మనేక సభలలో వీరిని బహువిధముల సత్కరించెను. భారతీయుల సుహృద్భావము, వీరపూజ యనెడి మహత్తర లక్షణము లా సత్కారములలోఁ బ్రతిబింబించినవి.

మాతృభూమినివీడి చిరకాలమగుటచే మఱలి పోవలయు నను నాతురత బలీయమగుట వా రతిరయమున గృహోన్ముఖులైరి. వారి విమాన మాగినచో నెల్లఁ బ్రజ లమితోత్సాహులై వారికి స్వాగత మిచ్చుచుండిరి. టెన్‌జింగ్, కుటుంబసమేతముగ లండన్ పట్టణమునకు బోవుచుండెను. జ్యూరిచ్ నగరమునఁ బూర్వ మెవరెస్ట్ యాత్రిక దళములు, ఆల్పైన్ సంస్థలు, రేమండ్ ల్యాంబర్ట్, గేబ్రియల్, ఇత్యాదులీ విజయము నెంతయో కొనియాడిరి. సాహస కృత్యముల హృదయ

పూర్వకముగఁ గొనియాడఁ గలవారు సాహసమూర్తులుగాక వేఱొక రుందురే! జూలై మూడవనాఁడు వారిదర్శనముకొఱకై చిరకాలము నుండి వేచియుండు బంధుమిత్ర సమూహములతో నొప్పు లండన్ విమానాశ్రయమున వారు దిగిరి.

ఎవరెస్ట్ శిఖరారోహణ జ్ఞాపకార్థము భారత ప్రభుత్వము, రెండణాలు, పదునాలుగణాలు, విలువగల తపాలాబిళ్ళలను, ఎవరెస్ట్ శిఖర దక్షిణముఖచిత్రముతో ముద్రించిరి. లండన్ నగరములో ఎలిజెబెత్ రాణి, హిల్లరీ టెన్సింగ్ లిరువురికి 'సర్' బిరుదములను, మహా ప్రశంసనీయమైన కార్యసాధకులకు మాత్రమె ప్రసాదితమగు జార్జిపతకములను బహూకరించెను.

ఎవరెస్ట్ యాత్రికదళ సభ్యులలోఁ గొందఱు స్వానుభవముల నటనట వక్కాణించి యున్నారు. ఈ శిఖరారోహణమును జలనచిత్రముగఁ దీసిన టాంస్టోబార్ట్ ఈ యాత్రికదళము ఖాట్మాండూ నగరమును వీడి యాత్రఁ బూర్తి నేసికొనినంతవఱకుఁ జిత్రములఁ దీయుచునే యుండెను. ఆతని యనుభవము లిటఁ బొందుపఱుపఁబడినవి. "శిఖర మధిరోహించినారనువార్త వింటిని. ఆయాత్రపొడవున నే ననుభవించిన సమయములలో నాక్షణమే క్లిష్టమైనది. అంతవఱకుఁ బూర్వమువలెనే మఱి యొక యెవరెస్ట్ యాత్రను జిత్రించుచుంటిననుభావముతో నుంటిని; గాని యిపుడది చెఱిగిపోయినది. నేను చిత్రించుచున్న దొక లోకోత్తర వీరగాథ యను జ్ఞానోదయ మా క్షణముననైనది. మఱుక్షణములో నాలో గొప్పసందేహములు జనించినవి, బహుశః నాఛాయాగ్రాహకయంత్రమున నేదైనలోపమున్న దేమో!... అట్లుగానిచోఁ బ్రత్యేకముగ దాచియుంచిన ఫిలిం అతిశైత్య ఫలితముగఁ జెడినదేమో?... చిత్రములఁ దీయునపు డేమైనఁ బొరపాట్లఁ

జేసితినేమో ........ ఇట్టి సందియములు నాతలలో రొదపెట్టు చుండెను. ఇట్టి యాందోళనలు, సమస్యలు, ప్రారంభమునుండియే నన్నెదురుకొనుచున్నవి. ఇట్టి యాత్రను జిత్రించుట చాల కష్టము. ఛాయాగ్రాహకు డెల్లప్పుడు తరలిపోవు యాత్రిక దళముల వెనుకనుండి తన ధర్మముల నిర్వహింపఁగలుగుచుండవలయును. మేము నలువది మైళ్ళ దూరమునుండి ఎవరెస్ట్‌ను దర్శించితిమి. వాస్తవమున నాదూర మునుండి చూచిననే యా శిఖర మత్యద్భుతముగ నుండును. ఉన్నత పర్వతశ్రేణీపరివృతమై మహానాయకునివలె నౌన్నత్యములో నది వానిని మించి యగపడుచుండును. ఆ చిత్రముకొఱకు నేను సుమా రొక గంటకాలము ప్రయత్నించితిని......మున్ముందుఁ బడమటిలోయ చివరభాగమునఁ గల హిమనిపాతముకడ నాకార్య మెట్లు నమర్థింపఁ గలుగుదునో యని నేనెంతయో యాశ్చర్యపడుచుంటిని. అదియొక మహాజలపాతమువలెఁ బడమటిలోయనుండి పడుచుండెను. ఆప్రదేశము బహుకాలముక్రితము శిథిలీభూతపట్టణమువలెఁ గాన్పించుచుండును. అచటి గంభీరశబ్దములు, నాకసమున కెగజిమ్ము మంచు దుమార ములు, హిమశైలపతన చిహ్నములుఁ జూడఁగా ఎవరెస్ట్ శిఖరము సజీవమైనదనియుఁ, దనపైకివచ్చు దండయాత్రల సహింపదనియు నాకు నమ్మకము దోఁచెను. ఈభావములు నా మనసునుండి వైదొలఁగవు... ఈచలనచిత్ర నిర్మాణకార్యక్రమములో జార్జ్‌లో నాకు చాల సాయపడెను."

ఇట్టి పురుషవరేణ్యుల త్యాగధర్మదీక్షాఫలితముగ నీ యెవరెస్ట్ శిఖరారోహణ జయప్రదమైనది!!!

# 15

# విజయము

ఎవరెస్టు శిఖరారోహణ యాత్రను జలనచిత్రముగఁ దయారుచేసి "ఎవరెస్టు విజయము" అని పేరిడిరి. సర్ జాన్‌హంట్, అతని యనుచరులు, నిందులకు దమ యనమ్మతిని సూచించిరి. "శిఖర మధిరోహించిరేగాని, జయింపలేదు." అని వారి యభిమతము. ఇంతకు నిరువురే కదా శిఖరాగ్ర మధిరోహింపఁ గల్గినది! అంతమాత్రము నకే విజయసాధకులమని విఱ్ఱవీఁగు టవివేకము. ఏ తద్విజయ మంత సులభసాధ్యముగాదు. ఇదే విజయమని భావించిన ఎవరెస్టు యాత్ర యింకమీఁద జఱుగక పోవునేమో? నిరాటంకముగఁ బదుగు రా శిఖరాగ్ర మధిరోహించినపుడే విజయము పూర్తియగును. అట్టి విజయ మింకను సాహసోపేతుల విశేషకృషిని వాంఛించుచున్నది.

ఈ భావపరంపర ఎవరెస్టు యాత్రిక హృదయములలో జనించి యుండుటఁ గన నాశ్చర్య మేమియులేదు. ఎవరెస్టు శిఖర నిరుపమాన సహజశక్తులు వారికిఁ బ్రత్యక్షానుభవైకవేద్యములు గావున నాశిఖరమును 'జయించుట' ఘనమైన పేరు పెట్టినంత సులభము గాదని వారి భావమై యుండనగును. పరాజయములఁ ద్రోసిరాఁ జనుచుఁ ద్రిదశాబ్దపర్యంతము నిర్విరామయత్నములు సల్పినంతకదా నేటి కాయిరువురు మాత్రమే శిఖరముపై నిలిచిరి? ఇంతకాలమునుండి యొందఱినో దూరముగఁ బాఱఁద్రోలిన యెవరెస్టు శక్తిసంపద చులకన చేయఁరానిది. అను సర్ జాన్‌హంట్ అభిప్రాయము అతనికి యెవరెస్టు యెడల నెంతటి భక్తిప్రపత్తులు గలవో వ్యక్తము చేయుచున్నది. ప్రపంచమంతయు దీని; నొక నిరుపమాన విజయమని

శ్లాఘించినను ఎవరెస్టు యాత్రికులు దమ విజయమును దామే శ్లాఘించి కొనుట కీయకొనరు. వారు స్వాతిశయోపేతులు గారని వారి పలుకులె తెలుపుచున్నవి. వారెంతటి స్వార్థరహితులు! వీరులన వారె; ప్రత్యర్థి సామర్థ్యాతిశయముల మెచ్చుకొనఁగల వీరుఁడు, నిజమైన వీరుఁడు విజయమో! ఆరోహణమో! ఏదైననేమి. ఆ యున్నత శిఖరాగ్రముపై నేఁటికైనఁ గాలు మోపఁగలిగిన పురుషవరేణ్యు లొకరో; యిరువురో, యెందఱైన నేమి?......

ఏతద్విజయ కారణముల నరసికొనుట యిఁక మనపని. సర్ జాన్ హంట్ అట్టి కారణములఁ జేర్కొనినాఁడు:

"పూర్వ మెందఱో మిక్కిలి యత్నించి విఫలమనోరథులైన కార్యసాధనలో మాకేల విజయము లభించినది? దీని కంతటి కొక గొప్ప కారణము గలదు.

అదియే పూర్వయాత్రలవలని సంపాదించిన యనుభవము; దీని గడించిన వారందఱికి నా ప్రశంసాపూర్వక వందనముల నర్పించుటకు నేను మిక్కిలి యాతురపడుచున్నాను. ఆ పూర్వానుభవమే మా కిపుడు మార్గదర్శియైనది. ఈయది యతఃపూర్వ మొక్కొక యెవరెస్టు యాత్రికవర్గము కృషించి, గడించిన యనుభవ పరంపరల మొత్తమే. ఏతదానుభవిక శిఖర మొక యున్నతస్థాయికి వచ్చిన కదా, తచ్ఛిఖరాగ్ర నిర్మాణము పూర్తియగుట. ఈ దృష్టిఁగనినఁ బూర్వయత్నములు విఫలమొందలేదు; సాధ్యమైనంత యనుభవము సంపాదించి పెట్టినవి. అందుచే నాశిఖర సంబంధానుభవజ్ఞానసంపద మాకు లభించినది.

ఆ శిఖరమును సదా రక్షించు సంగరక్షకుల శక్తి సంపద లిపుడు మాకు దెలియనివిగావు. దానఁజేసి యిపుడు మిగిలినది, వెనుకముందుల నాలోచించి మఱి యొక యుద్ధమును బ్రకటించుట కవసర సాధన సంపత్తినిఁ — బర్వతారోహకాది వస్తు పరికరములు — సిద్ధముచేసికొనుట. ప్రస్తుత యాత్రికులమైన మేము మా పూర్వికుల యడుగుజాడలలో నడచి వారు సంపాదించిన కీర్తి సంపదలలో భాగస్వాముల మైనందులకు జాల గర్వించుచున్నారము.

వీనినన్నిటిని మించిన విశేష మొకండు గలదు. మా పూర్వీకుల యనుభవపాఠముల వల్లించుటయేగాక వారి నిశ్చల కార్య పర్వత ప్రబల సత్యాన్వేషణాసక్తి, పరాజయమొల్లని మనోదార్ఢ్యము లనెడు ధీరోదార లక్షణములు మాకు మార్గదర్శకములై మమ్ముల నుత్తేజపఱచినవి.

తఱువాత బహుజాగరూకతతో నల్పానల్పాంశములతో మేము కూర్చిన పథకము, శిఖరారోహణ కవసరమైన వస్తుపరికరములు, ప్రకృతిసిద్ధమౌ పర్వత వాతావరణాదిక వైపరీత్యముల నెదురొడ్డి నిలిచిన యీ పరికరముల శ్రద్ధాభక్తులతోఁ దయారునేసిన వివిధసంస్థలు, మా కార్యసిద్ధి కనుకూల సందర్భములు. అయినను బ్రాణవాయు సాధనలఁగూర్చి నేను ప్రత్యేకించి కొనియాడవలసియున్నది. మా కార్యసిద్ధి కీసాధనము లత్యంత ప్రధానములు, ఏకైక కారణములు నని నా యభిప్రాయము.

హిమవత్పర్వతారోహణ యాత్రలు మూఁడు పాళ్ళు పరాజయ మొందుటకుఁ గల కారణములలోఁ బర్వతారోహకుల యనారోగ్యమొకటి. ఈలోపముఁ దీర్చఁగలిగిననాఁడు కార్యసాఫల్యము గష్టసాధ్యము గాదు. ఈలోపముఁ దీర్చుటకుఁ బర్వతారోహక దళ మును విస్తృతముచేయుట యేకైక కారణము. ఇట్లు చేసినచోఁ దలపనితలంపుగ నారోగ్యలోపము గలిగినను గార్యక్రమము నిరాఘాటముగ సాగిపోఁగలదు. అందుచే మా పథకానుగతినిఁ బర్వతారోహకులసంఖ్యను విస్తృత మొనరించితిమి. మా యాత్రిక దళములో ననారోగ్యమున బాధపడినవారు చాల స్వల్పము. దీనికి ముఖ్యకారణము పర్వతారోహకవరణములోఁ దగు జాగ్రతపడుటయే.

వాతావరణాభ్యాస శిక్షణయు మా కార్యసిద్ధి కెంతయో సాయపడినది. ఉన్నత సానుదేశ సంసా రములఁ బ్రతిదినము ద్రవపదార్థ మెక్కువగఁ బుచ్చు కొనవలయుననియు, నాహారసంబంధమయిన సలహాల మాకందఁజేసినట్టియు వైద్యులుగూడ మాకార్యసిద్ధికిఁ దోడ్పడినవా రగుటఁ వారికిఁగూడ నాకృతజ్ఞతాపూర్వక వందనములు.

మా పర్వతారోహక దళమునఁగల యైకమత్య మును గూర్చి నేను విశేషించి చెప్పవలసి యున్నది. ఈ శిఖరారోహణ సఫలమొందుటయం దితర సాధన ములకన్నఁ బర్వతారోహకుల మహత్తరనిస్స్వార్థ పర స్పర సహకార మత్యవసరమని ప్రత్యేకించి చెప్పఁ బని

లేదు. ఈ సహకారము వినా యాహార, యాంత్రిక, వస్తుపరికరాది సాధనము లెంతటి శక్తిమంతములైనను ఫలితము శూన్యమే. మా పర్వతారోహక సంఘము కన్న సుస్నేహ సహకారైక్యభావపటిమ గల సంఘము వేరొకటి యుండజాలదనియే నాభావము. మే మంద అము గలసిమెలసి యుండిన యీ నాల్గు మాసముల, నతిక్లిష్టసమయముల మాలో నెవరేని మఱి యొకరినిఁ గోపించుటగాని, పల్లెత్తుమాట యనుటగాని లేకుండుట మిక్కిలి ప్రశంసనీయము. ఇట్టి పరస్పర సద్భావకారణ మున నాబాధ్యత యెంతయో సులభతరమైనది. ముఖ్య ముగ శిఖరాగ్రారోహక నిర్ణయమున నిట్టి స్నేహ భావము నాకెంతయు నుపకరించినది. ఈ యదృష్ట మెల్లఱకు లభింపదు. తప్పనిసరిగఁ గొంద ఱాశాభం గము ననుభవింపవలసినదే. ఇవన్నియు దెలిసి సభ్యు లెల్ల ఱీ యారోహణలోఁ దమ పాత్ర ప్రయోజనా ప్రాముఖ్యములఁ జక్కగ నెఱిఁగి నిరాశాపీడితులు గాక సుహృద్భావముతో నాకు హృదయపూర్వక సహకార మిచ్చిరి. ప్రతివాఁడు మాటాడక తనతన కార్యముల దోషరహితముగ నెఱవేర్చుచుండెను.

షేర్పాల సహకారము సాటిలేనిది. మేము నియమించికొనిన యిరువదేడుగురు షేర్పాలు వారి పర్వతారోహక ప్రజ్ఞావిశేషములు, వారు మాతోఁ గష్టనష్టముల సమముగ ననుభవించుట యనునవి విస్మ రింపరాని విషయములు. మాకును షేర్పాలకును బరస్పరసంబంధము గుదుర్చుటలో శెన్నింగ్ చార్లెస్ వైలీ

లిరువురు శక్తివంచనలేక సాయపడిరి. అందుచేతనే యిరువదెనిమిదివేల యడుగుల పైన షేర్పాల సాయముతోఁ దొమ్మిదవ శిబిరమును స్థాపింపఁగలిగితిమి. డాక్టర్ లాంగ్‌స్టాఫ్, కర్నల్ నార్టన్ అనువారి సలహాలఁ బాటించి యీ తొమ్మిదవ శిబిరమును నిర్మించుటవలన మాకార్యము సిద్ధించినది.

మాకార్యసిద్ధి కనుకూలించిన వానిలో వాతావరణ మొకటి. ఏప్రెల్ యెనిమిదవనాఁటినుండి మే పదునాల్గవ నాఁటివఱ, కించుమించు దినదినము మంచువాలుచు మాప్రయత్నముల కంతరాయములు గలిగించుచునే యుండెను. మే నెల పదునాల్గవనాఁటి కావల, వాతావరణము క్రమక్రమముగ ననుకూలించుచు దినములు గడచుకొలఁది యాహ్లాదకరముగ నుండెను. మా యాధిపత్యములేని యీవిషయములో నిజముగ మేమదృష్టవంతులమనియే చెప్పవలయును. ఇట్లు సెప్పిన వాతావరణ విపర్యాసములవలన మేమెట్టి యవరోధముల నెదుర్కొనలేదని భావింపఁజనదు. ప్రళయఝంఝామారుతములు ప్రతిదినము వీచుచు మమ్ములఁ జిక్కులఁ బెట్టుచునే యుండెను. ఎదో యదృష్టవిశేషముననే వారిరువురు శిఖరాగ్ర మధిరోహించిన నాఁడు పవనములు మందవేగమున వీచుచుండెను.

మా విజయవార్తా శ్రవణమునకై మిక్కిలి యుత్కంఠతో నిరీక్షించుచు దైవప్రార్థనలు జఱుపుచుండు మాశ్రేయోభిలాషుల తీవ్రవాంఛలును, మా కార్యసిద్ధికి మిక్కిలి తోడ్పడినవి ;

ఈ యారోహణవల ప్రయోజనము? ఈ యాత్రఁ బాల్గొనిన మాకట్టి సందేహ మణుమాత్రమేని లేదు. ఒక మహత్తర కార్య సాధనలో మేము పాల్గొంటిమి. నిరుపమాన సౌందర్యదృశ్యములఁ గనులారఁ గాంచితిమి. శాశ్వతస్నేహబంధముల నేర్పఱచికొంటిమి. ఉన్నతపర్వతములపై మేము కడపిన కాలమును మా జీవితములలో నెన్నటికి మఱవఁజాలము. ఎవరెస్ట్ శిఖరారోహణ చరిత్ర యాద్యంతము సంఘీభావ సహకృత కృషినిఁ దెల్పుచున్నది. దీనివలని శాశ్వత ప్రయోజన మేదేని యున్నచో, నయ్యది కేవల మొక సాహసకార్య సాధనయే గాక శాశ్వతస్నేహసంబంధము, జాతి మత భేదజ్ఞానరహిత మైత్రి, యనునవియుఁ గలవు. ఈయుని పర్వతారోహణలో నెదురు వచ్చు నకలావరోధముల నెదుర్కొనుటలో సిద్ధించుచున్నవి.

ఇతరులకు దీనివలని ప్రయోజనము లేవైనఁగలవా? ఈ శిఖరారోహణలోఁ బ్రయోజనము లేదని చెప్పుట యెట్లు? ఈ శిఖరారోహణకార్యమున మా పూర్వీకులచే మే ముద్దీపితులైనట్లుగ సాహసవంతులు దమతమ జీవితములలో ఎవరెస్ట్ అంతటి మహాఘనకార్యముల సాధింపఁగలరు. అట్టి ఘనకార్య సాధనోద్దేశమే ప్రస్తుత శిఖరారోహణ పరమప్రయోజనము. మా కార్యసాఫల్యము విని వివిధ దేశములఁ గలిగిన సంచలనము, సాహసకార్యసాధనాపిపాస ప్రపంచములో నింకను నుపశమించలేదని చాటుచున్నది. ప్రభుత్వములు పండితపామరులు, మిత్రబృందములు, వివిధ సంఘములు మా కార్యసిద్ధి నభినందించుచు మా కొసఁగిన బహువిధ బహుమతులు, సన్మానములు, నారోహణకు బూర్వమే కార్యసిద్ధి నాకాంక్షించుచు మాకు బంపిన సందేశములు, మా కార్యము విలువను గుర్తించి యానందించుచున్నారని నిస్సందేహముగఁ దెల్పుచున్నది. ఎందఱో యువకులు, బాలురు, మాకు సందేశములఁ బంపిరి. ప్రతివాని హృదయాంతరాళ

మున నిద్రితమైన సాహసక్రియాభిలాషను నీ ఎవరెస్ట్ శిఖరారోహణ మేల్కొలిపి యుఱ్ఱూత లూఁగించినది. ఈ యభిలాష శాశ్వతముగ రూపొందఁగల చిహ్నములకు గొఱవలేదు. దీనికిఁ దార్కాణము డార్జిలింగ్ పట్టణములోఁ బర్వతారోహణ శిక్షణ కేంద్రము నేర్పాటు నేయుటకు బంగాళరాష్ట్రప్రభుత్వ నిర్ణయమే.

ఎవరెస్ట్ శిఖరారోహణము తఱువాతఁ బర్వతశిఖరారోహణమే యర్థరహిత మగునేమో యను సందియ ముత్పన్నమగును ; గాని ఇఁకమీఁదట సాహసవంతుల శిఖరారోహణోద్దేశముతోనేగాక యితర పరిశోధనలకొఱకై హిమవచ్ఛిఖరారోహణను బ్రోత్సహింపవలయును. మానవచరిత్రలో మఱియొక శుభదినమునఁ బ్రాణవాయువుతో నిమిత్తము లేకయే యీ శిఖరారోహణ జఱుగఁగలదు...... బహుశః ఎవరెస్ట్ శిఖరము నొక వైపునుండియెక్కి యావలవైపునకు దిగు టచిరకాలములో సంభవ మగును. ఇట్టి సాహసకార్యము లనేకము లీ హిమవత్పర్వత సీమలో నికముందు జఱుగుట కవకాశము లెన్నియో కలవు. మానవున కసాధ్యమేది ?

ఎవరెస్ట్ యాత్రికదళసభ్యుఁడు విల్‌ఫ్రిడ్‌నాయిస్ తన యభిప్రాయము నిట్లు ప్రకటించెను, " మేము ఎవరెస్ట్‌ను జయించితి మను భావ మెన్నఁడు మాహృదయముల జనింపలేదు. కృత్రిమసాధనమైన ప్రాణవాయువుతోను, బర్వతారోహక వస్తుపరికరములతోను వాతావరణ సహకారముతోను, నెటులో యిన్నిసంవత్సర ప్రయత్నముల కొకమాఱా శిఖరాగ్రముపై నడచి వెళ్ళఁగలిగితిమి. ఎవరెస్ట్ మాకు శత్రువుగాక మిత్రమై యీమాత్రమైన కార్యమును సాధించుటకు మాకు తోడ్పడినందులకు మే మాశిఖరసార్వభౌమున కెంతయో కృతజ్ఞులము "

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము 9225/55